వణమాసం శ్రావణలక్ష్మి మీఇంట కళకళలాడాలని ఆశిస్తూ...



పట్టు చీరల నిలయం

చి, ధర్మవరం, బెంగుళూరు, బెనారస్, కొత్తకోట
వాల్, నారాయణపేట, వెంకటగిరి, పోచంపల్లి,
యమూర్, వెండిజరీచీరలు, బెనారస్ అరంజా,
సూర్, క్రేప్‌సిల్క్స్, సాఫ్ట్ సిల్కు మరియు ఫ్యాన్సీ
ంథటిక్ చీరలు విస్తృత శ్రేణులలో...

# చందన బ్రదర్స్

(A.C)

లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్

జగదాంబ సెంటర్

విశాఖపట్నం

# కొంత ఆదా చేసైనా ఆల్విన్ కొనడం ఎందుకు సమంజసం




**ల్విన్ తన శ్రేణిలో సాటిలేనిది**

రిఫ్రిజిరేటర్ ఒక ముఖ్యమైన పెట్టుబడి. దానికోసం మీరు బాగా ఆలోచించాలి. ఖర్చు చేయాలి. అవును, ఆల్విన్ ధర కొంచెం ఎక్కువే. ఎందుకంటే, ఆల్విన్ మీ పెట్టుబడికి ఎన్నో రెట్లు ఎక్కువ విలువనిస్తుంది.

ఆల్విన్ పని తనాన్ని, లక్షణాలను పరిశీలించండి. అవే ఆల్విన్ను తన శ్రేణిలో సాటిలేనిదిగా నిలబెడతాయి. ధరెంతైనా, ఆల్విన్ తన విలువను నిరూపించుకుంటుంది. మీరే అంగీకరిస్తారు.




**టాచి రూపకల్పన చేసిన కంప్రెసర్**

చప్పుడు చేయని, సాఫీగా, చీకు, చింతలేని పనితనం.




**ల్టేజి స్టెబిలైజర్ అవసరం లేదు**

ఎందుకంటే, 170 నుంచి 250 'వోల్ట్స్' దాకా 'వోల్టేజి' హెచ్చు తగ్గుల్ని సునాయాసంగా భరిస్తుంది.




**ల్ బాండ్ ఫ్రీజర్**

త్వరగా 'అయిస్' అవుతుంది. పళ్ళు, కూరగాయలు ఎల్లప్పుడూ తాజాగా ఉంటాయి.




**ల్ఫ్ డ్రైవింగ్' పద్ధతి**

బాదరబందీ లేకుండా మీట నొక్కగానే దానంతట అదే జమకూడిన 'అయిస్' కరిగించేస్తుంది.




**క్కువ చోటు**

ఆల్విన్ అన్ని రిఫ్రిజిరేటర్ల కంటే ఎక్కువ 'ఐస్ ట్రే' మరియు 'క్రిస్పర్' స్థలం ఉంది.




**క్కువ చోటు**

మిగతా వాటి కంటే ఆల్విన్ రిఫ్రిజిరేటర్ పెట్టుకొనుటకు తక్కువ స్థలం ఆక్రమిస్తుంది.




**న్నో రకాలు**

ఆల్విన్ 165 ఇంకా 300 లీటర్ల సింగిల్ డోర్, డబుల్ డోర్ మోడల్స్‌లో ఎన్నో రంగుల్లో లభిస్తాయి.




**సంవత్సరాల గ్యారంటీ**

సంవత్సరాల తరబడి మీకు చింతలేని సేవ




**శవ్యాప్తమైన సేవాసౌకర్యం**

ఒక్క ఫోన్ పిలుపుకే మీ సేవకై సిద్ధం.




**ల్విన్ మీకోసం విమూల్యమైన 'రక్షణ ఒప్పందాన్ని' అందిస్తుంది.***






అన్ని సింగిల్ డోర్ ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు ఐ ఎస్ ఐ చిహ్నం కలిగి వుంటాయి







**అన్ని వేళలందు ఆల్విన్**

* మిగతా వివరాలకోసం మీ దగ్గర్లోని ఆల్విన్ ఏరియా ఆఫీసును సంప్రదించండి.

**హైదరాబాద్ ఆల్విన్ ఏరియా ఆఫీసులు:** అహ్మదాబాదు, ఫోను: 463181, బెంగుళూరు, ఫోను: 238885, భోపాల్, ఫోను: 64122, భువనేశ్వర్, ఫోను: 52271, బొంబాయి, ఫోను: 4927575, 4927586, 4934178, 4921051, కలకత్తా, ఫోను: 440437, 446853, 433576, చండీఘడ్, ఫోను: 41941, కడప, ఫోను: 2230, ఎర్నాకులం, ఫోను: 368002, గౌహతి, ఫోను: 32691, ఘజియాబాదు, ఫోను: 843204, హైదరాబాదు, ఫోను: 43407, జబల్‌పూర్, ఫోను: 22665, జైపూర్, ఫోను: 65729, కాన్పూర్, ఫోను: 245249, కర్నూల్, ఫోను: 2480, మద్రాసు, ఫోను: 861401, నాగపూర్, ఫోను: 45125. న్యూఢిల్లీ, ఫోను: 734740, 730715, పాట్నా, ఫోను: 32745, పూన, ఫోను: 39029, విజయవాడ, ఫోను: 62544, విశాఖపట్నం, ఫోను: 61652.

MAA COMMUNICATIONS/HAL B TEL 88





డబ్బుకు పూర్తి విలువ...

చాలా కాలం మన్నుతుందిగనక.

# ECtv

इका EC ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (భారత ప్రభుత్వ సంస్థ), హైదరాబాదు 500 762.

Karishma/EC/64/2125 TL

# చతుర కతలు

## పొదుపు

ఆ రోజు ఆదివారం. సినిమాకని ప్రొగ్రాం ఫిక్స్ చేసి, సాయంత్రం అయిదున్నరకు శ్రీమతితో కలసి ఇంట్లోంచి బయటపడ్డాడు కైలాసం.

బస్‌స్టాపులో బస్‌కోసం ఎదుర్చూసి, విసుగేసి "ఏమండీ! ఇటువైపు బస్సులు అంత ఎక్కువగా లేవండి. దాన్ని నమ్ముకుంటే మన సినిమా ప్రొగ్రాం అయినట్లే" అన్నది శ్రీమతి కైలాసం పెద్ద ఫోజుపెట్టి "దానికేం భాగ్యం రిక్షాలో పోదాం" అని "ఏయ్ రిక్షా" అంటూ దర్పంగా ఓ రిక్షావాణ్ని కేకేశాడు. వాడు దగ్గరికి రాగానే "సరస్వతి థియేటర్‌కు వస్తావా?" అని అడిగాడు.

వాడు తలూపి, "నాలుగు రూపాయలౌతది సారూ" అన్నాడు. "రెండు రూపాయలిస్తాను" అన్నాడు కైలాసం నిక్కచ్చిగా. వాడు కైలాసం వంక వింతగా చూసి మరేమీ మాట్లాడకుండా ముందుకెళ్ళి పోయాడు.

కాస్త ముందుకు నడిచి, అక్కడ మరో రిక్షా కనపడగానే, "సరస్వతి థియేటర్ వస్తావా?" అని అడిగాడు. వాడూ నాలుగు రూపాయలు అడిగాడు. కైలాసం ఇక లాభంలేదనుకుని ఉసూరుమంటుంటే, అతడి శ్రీమతి "అంత కంటే తక్కువకురారు వెళ్దాంలెండి" అన్నది.

"నువ్వు ముందు నోరుమూసుకో! రెండు రూపాయలకు ఒక్క పైసా ఎక్కువియ్యను. బేరాలాడటం నాకు చేతకాదనుకున్నావా? చూస్తూవుండు నా మాటకారి తనంలో రెండు రూపాయలకే రిక్షా మాట్లాడకపోతే అప్పుడడుగు" అన్నాడు.

వాళ్ళు మరికాస్త ముందుకు వెళ్ళి మరో రిక్షా నడిగేసరికి వాడు మూడున్నర ఇవ్వమన్నాడు. కైలాసం వాణ్ణి మింగేసేట్లు గుడ్లురిమి చూస్తూ, అల్లంత దూరంలో మరో రిక్షా కనబడితే వెళ్ళి అడిగాడు.

వాడు సరస్వతి థియేటర్‌కు రెండున్నరకే వస్తానన్నాడు. కైలాసం వాడి వంకైనా చూడకుండా, కాస్త దూరంలోని మరో రిక్షా నడిగాడు. వాడు రెండు రూపాయలకు వస్తానని అన్నాడు. కైలాసానికి ఏనుగునెక్కినంత సంతోషమైంది. ఒక్కదూకున రిక్షా ఎక్కికూర్చున్నాడు.

"చూశావా? రెండు రూపాయలకే రిక్షాను మాట్లాడాను" అన్నాడు గర్వంగా భార్యతో.

"చాల్లెండీ మీ సంబరం, ఏడ్చినట్లే ఉంది. మీ బేరాల గొడవలోపడి సగం దూరం నడిచిచ



చ్చాం. ఆ కనిపించే నందుమలుపు తిరిగితే సరస్వతి థియేటరు కన్పిస్తుంది!'' అన్నది అతడి భార్య.

కైలాసం క్షణంలో తేరుకుని అప్పుడు గమనించాడు పరిసరాలను. నిజమే దాదాపు సగం దూరం నడిచే వచ్చాం అనుకున్నాడు.

ఇదేమీ తెలియని రిక్షావాడు మామూలుగా నందుమలుపు తిప్పి వారిని సరస్వతీ థియేటరులో దించాడు.

-దాసరి వెంకటరమణ

## చచ్చేచావొచ్చింది

"ఒరే అబ్బాయ్! ఓసారిలా వచ్చి చావు'' అరిచింది ఆనందవల్లి.

"ఏంటమ్మా?'' ఒక్క అంగలో వచ్చాడు గోపి.

"కూరల సంచీ ఎక్కడ తగలెట్టి చచ్చావ్?''

"ఇదిగో...'' చూపించాడు.

"మీ నాన్నొచ్చి చచ్చారా''

"అదేమిటమ్మా!''

"చచ్చేలా తిట్టేనని అలిగి బయటికెళ్ళి చచ్చారు! దిక్కుమాలిన పొగరు మాత్రం బోల్డంత చచ్చింది''

ముసిముసిగా నవ్వుకున్నాడు గోపి.

"అలా నవ్వి ఛస్తావేంట్రా! ఓపక్క నాకు లైమైచచ్చింది. వంటయి చావలేదు. బస్సులు సరిగ్గా వచ్చిచావవు. ఒచ్చినా కూర్చుందామంటే సీటు దొరికి చావదు'' అరుస్తూనే కంగారుగా పన్లు చేసుకుంటోందామె. హడావిడిగా ఆనందవల్లి బస్టాపుకొచ్చేసరికి ముఖపరిచయం మాత్రమే ఉన్న ఒకావిడ కనిపించింది చాలారోజులకి.

"చిక్కిపోయారేం'' అడిగింది ఆనందవల్లి.

"అబ్బే! నేనేం చిక్కిపోలేదండీ'' అందామె మొహమాటంగా.

"ఆఁ! చావచిక్కితేనూ!'' అంటూ దీర్ఘం తీసింది ఆనందవల్లి.

అంతే! క్షణంలో ఎదుటావిడ ముఖంలోని రంగులు మారాయి. ఏమనుకుందోగాని వెంటనే ఓ ఆటోని పిల్చుకుని అందులో వెళ్ళిపోయింది.



సందర్భంలేకపోయినా సదరు 'చచ్చు' ఊతపదాన్ని అనుక్షణం వాడే ఆనందవల్లికి బంధుమిత్రులెంతగానో చెప్పారు ఆ శాపనార్థాలు మానుకొమ్మని. కానీ.... ఆనందవల్లి "ఆఁ... పుట్టకతో వచ్చిన అలవాటు పుడకల్తోగానీ పోదు'' అని కొట్టిపారేస్తుంది. ఆమెని ఎరిగున్న వాళ్ళంతా ఆ ధోరణికి అలవాటుపడ్డా ఆఫీసులోమాత్రం ఈమధ్యే సెక్షన్ మారటంతో కొత్తవారికి ఈమె ధోరణి ఓ సమస్యగా పరిణమించింది. కానీ ఆనందవల్లి అవేమీ గమనించదు. తన ధోరణి తనదే!

ఆరోజు లంచవర్లో డైనింగ్ హాల్లోకి అంతా చేరారు. ఆనందవల్లి వెనుక చీరకొంగుకు ఎవరు తగిలించారోగాని ఓ కాగితం ఉంది.

పక్కనే కూర్చున్న ప్రియంవద చూసి ఆ కాగితం తీసి ఆనందవల్లికి ఇచ్చింది. అది చదివిన ఆనందవల్లి కుతకుతా ఉడికిపోయింది. కోపంతో కళ్ళెర్రబడ్డాయి. అందర్నీ కలయజూస్తూ- "ఎవరీ పద్యం రాసి చచ్చింది. చెప్పి చావండి- పనీపాటా లేదా వీళ్లకి? తిండి అరిగిచావక రాసి చచ్చారా" హూంకరించింది.

ఎవరూ నోరు మెదపలేదు. కొందరు లోలోపల నవ్వుకుంటున్నారు.

"చచ్చు కవిత్వం తప్ప వీళ్ళకి మరోటి వచ్చి చస్తుందా ఏమిటి? నేను తప్ప మరెవరూ దొరకి చావనట్టుంది. నామీదే ఈ కవిత రాసిచచ్చారు. కనిపించనీ... చెబుతా వీరి సంగతి? కనిపించక చచ్చారో బతికి చస్తారు"- అది ఆఫీసని కూడా మర్చిపోయి కేకలు వేస్తోంది ఆనందవల్లి.

దించింది ప్రియంవద.

"ఈ చచ్చినోళ్ళెవరో రాసింది చాలక నాకొంగుకీ ఈ కవిత తగిలించి చావాలా? అందుకే కాబోలు నేను వస్తుంటే ఇందాక వచ్చేపోయేవారంతా నవ్విచచ్చారు. స్టాఫంతా చచ్చేలా నవ్వుతుంటే ఎందుకో అనుకున్నాను. ఈ అవమానాన్నెలా భరించి చావనూ?..."

ఆమె వాగ్ధాటికి తట్టుకోలేక కొందరు త్వరత్వరగా తినేసి లేచి వెళ్ళిపోసాగారు.

"పోనీయండి వల్లిగారూ... ఇకపై ఆ చచ్చు పదాన్ని వాడటం మానేయండి- సరిపోతుంది" సలహా ఇచ్చింది ప్రియంవద.

"ఆఁ... నేనూ అలాగే అనుకున్నానులెండి! చచ్చేదాకా ఇహ చచ్చు పదం నా నోటినుంచి రానీను... సరేనా! అయ్యో- ఇదేమిటి చచ్చు అలవాటు? నానోటంట అది మళ్ళీ వచ్చి చచ్చిందే! ఇహ ఇది చచ్చినా పోదేమో? చచ్చే చావొచ్చిందిగదా" వాపోయింది ఆనందవల్లి.

**జ్యోతిరాణి**

---

# ఏ కుక్కర్ ఇవ్వలేని, మెజెస్టిక్ మాత్రమే ఇచ్చే అతి ముఖ్యలక్షణం...

**మనశ్శాంతి**




**కేవలం**

మెజెస్టిక్‌లో పటిష్టమైన నిర్మాణం
అదనపు ఏర్పాట్లు
అందుకే రోజంతా చికాకులున్నా
మెజెస్టిక్‌తో వంట ... చింతలేని అనుభూతి.



మూడు రకాల ఖచ్చితమైన రక్షణ: గాస్కెట్ విడుదల ఆవిరి విడుదల అధిక ఒత్తిడి విడుదల.



లోపల మూతలు గల గిన్నెలు చట్రంలో పొందికైన అమరికవలన పదార్థాలు పొంగవిక.



ఎంపిక సౌలభ్యానికి ఎనిమిది పరిమాణాల్లో లభ్యం!



# మెజెస్టిక్®

మనశ్శాంతినిచ్చే ప్రెషర్ కుక్కర్



# 'తొలిపొద్దు'పై చతుర సమీక్షలు

జూలైనెల 'చతుర'లో ప్రచురితమైన సింహప్రసాద్ నవల 'తొలిపొద్దు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం

## అరుదైన వ్యక్తిత్వం

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

**ఉ**పాధ్యాయుడు పొట్టకూటికోసమే ఉద్యోగం చేస్తున్నాడనే భావం నాటుకుపోయిన విద్యార్థులు ఒకవైపు, ఉద్యోగం చేస్తున్నారుకాబట్టి మొక్కుబడిగా విద్యాలయాలకు వచ్చిపోయే అధ్యాపకవర్గం మరోవైపు విద్యాస్థాయిని రోజురోజుకు కృంగదీస్తున్న ఈరోజులలో "తొలిపొద్దు" నవల కనువిప్పు. ఇంటికో ట్యూషన్‌మాస్టారు. వీధికో ట్యుటోరియల్ కాలేజి వెలిసి విద్యను అంగడి సరుకులా అమ్ముకొనే ఈరోజులలో "మాస్టారు" లాంటి మనిషి వెయ్యిమందిలో ఒకరైనా ఉంటారన్నది సందేహమే.

ఈ విషయంలో ఒక్క ఉపాధ్యాయవర్గాన్నే వేలెత్తిచూపనవసరంలేదు. క్రమశిక్షణ లోపించిన విద్యార్థుల సంఖ్యకూడా ఈనాడు ఎక్కువగానే వుంది. పంతులు చెప్పిన విషయాలని వినాలనీ, విజ్ఞానం పెంపొందించుకోవాలనీ తహతహలాడే విద్యార్థులు నేడు ఎంతమంది ఉన్నారు? శివంలాగా పట్టుదలతో చదువు సాగించి గుర్తింపుతెచ్చుకోవాలనే మనస్తత్వంగల యువకులశాతం అతి తక్కువ.

"మాస్టారి" పాత్రను రచయిత పాత తరహాలోనే నాయకులమధ్య నలిగేలాచేసినా ఆవేశపడక, అలసటచెందని బాటసారిలా గమ్యాన్ని చేర్చిన తీరుకు అభినందించకుండా ఉండలేము. ఆ పాత్రచిత్రణలో కనిపించిన హుందాతనం మిగిలిన పాత్రల విషయంలో లోపించిందనటంలో సందేహంలేదు. ఎందువల్లనంటే మిగిలిన ఏపాత్రను పరిశీలించినా ఇదివరకు చదివిన ఏ పుస్తకంలోనో ఇలాంటి పాత్ర వుందని అనిపిస్తుంది. రాయుడు, నరసింహ, పానకాలులాంటి పాత్రలు ఎన్నో పుస్తకాలలో చదివాము; ఎన్నో సినిమాలలో చూశాం. ఒకవిధంగా చెప్పాలంటే ఈ పాత్రలన్నీ పాతవే. నడిపించిన తీరుకూడా పాతదే

ఉన్నతభావాలు, ఉత్తమ వ్యక్తిత్వంగల మాస్టారివద్ద విద్యనేర్చుకున్న భార్గవ ఆవేదన చెంది, ఆవేశంతో తుపాకీ పట్టుకోవటం, సంఘవిద్రోహశక్తిగా ముద్రవేసుకోవటం బాధనిపించడమేకాదు, రచనాపరంగా లోపంకూడా జరిగిందేమో అనిపిస్తుంది. ఆ పాత్రను రచయిత ఎందుకు సృష్టించారో, ఎందుకు అర్థాంతరంగా వదిలేశారో అంతుపట్టకుండా ఉంది.

ఇలాంటి లోపాలు లేకుంటే "తొలిపొద్దు" నవల మరింత బాగుండేది.

**- దాసరి నటరాజు**
ఉయ్యూరు

## మార్గదర్శకం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

**'తొలిపొద్దు'** నవల అభ్యుదయం ఎక్కడినుండి, ఏవిధంగా ప్రారంభం కావాలో విపులీకరిస్తూ సాగింది. దేశానికి ఆయువుపట్టు కుగ్రామాలేనని, అక్కడినుండే మార్పు ఆరంభంకావాలని చాలాసూటిగా, స్పష్టంగా చెప్పిందీ నవల.

పల్లెపట్టు రాజకీయాలను, రైతుజీవనాన్ని యథాతథంగా కనులముందుంచడంలో రచ

యిత సఫలీకృతులయ్యారు. రైతుల రుణ భారం, అవిద్య, అజ్ఞానం, అణచివేత వివిధ దశలలో మెట్టుమెట్టుగా చెప్పబడింది. ముఖ్యంగా పూజ్యమైపోతున్న 'గురు'భావనను రేకెత్తింపజేస్తూ మాష్టారిపాత్ర సృష్టించి, ఒకనాటి అరుదైన గురు-శిష్య బాంధవ్యం, అందులోని ఆత్మీయత, తృప్తి వంటి భావపరంపరకు ఊపిరిపోసి, నేటి విద్యార్థులకు ఒక నూతన దృష్టినిచ్చారు సింహప్రసాద్‌గారు. గాంధేయవాదిగా రూపొందిన మాష్టారిపాత్ర, హృదయగత సంస్కారం, మానవత్వపువిలువలు మృగ్యమైపోతున్న ఈ సమాజానికి ఒక కొత్త హీరో! అయితే చివరలో ఆయన మరణించకుండా వుంటే ఆయనద్వారా ఎస్టాబ్లిష్ చేసిన సిద్ధాంతాల ప్రభావం పఠితలపైన గాఢంగా వుండేది. మరణంతో ఆ పాత్రపై సానుభూతి చోటుచేసుకుంటుందేకాని అతని వ్యక్తిత్వం, ఆశయాల ప్రభావంకాదు. ''ఇలాంటివాళ్లుంటారా అతిశయోక్తి కాకపోతే- ఉన్నా మరణమే శరణ్యం'' అనిపించగల ప్రమాదముంది.

వృద్ధుల అనుభవసారానికి, సంయమనానికి యువశక్తి తోడైనప్పుడే కార్యాచరణ సాధ్యమౌతుందని, మార్పుకి జీవనాడి యువతరమేనని ఈ కథలో శివం, గాంధి, దీపిక, మూర్తివంటి యువకిశోరాలు నిరూపిస్తారు. ఒక బలమైన ప్రేరణ, స్పందనతో కూడిన పిలుపు యువతరానికెంతటి శక్తివంతమైన మార్గదర్శికాగలదో వివరిస్తుందీ నవల. చివర్లో పెళ్లిచేసి జంటలను కలపడం సినిమాటెక్నిక్ అనిపించినా, ఆ జంటలుకూడా మొదటి ఆశయాలతోనే దగ్గరయినారు కాబట్టి ఫర్వాలేదు. సరైన దారిచూపలేనప్పుడు భార్గవలను తయారుచేసేదీ మనమేనన్న విషయం కూడా నిజాయితీగా చెప్పారు రచయిత. గాంధీ ఉద్యమంనాటినుండే మితవాద,అతివాదనలుంటూ వున్నాయి. కాని సర్వజనామోదం పొందినదేది? అనే ఆలోచన కల్గించిందీ నవల.

''మార్పు కావాలి... రావాలి'' అనేధోరణిలో అనేక రచనలొస్తున్నాయి కాని ఆ మార్పు రూపం ఏమిటి? ఎక్కడ ప్రారంభించాలి? ఎలా తేవాలి? ఏ చర్యలు చేపట్టాలి? ఎలా జాగ్రత పర్చాలి?- అన్న విషయాల్ని దశలవారీగా క్రియాత్మకంగా చెప్పి మార్పును ఆర్గనైజ్ చేయటమంటే ఏమిటో నేర్పిన నవలగా 'తొలిపొద్దు' ప్రత్యేకతనాపాదించుకున్న నవల.

ఈ కాలపుదృష్టితో ''అసహజం'' అనిపించవచ్చునేమో! కాని కొన్ని విలువలు,నిత్యసత్యాలు, కాలాతీతాలనే నిజాన్ని గుర్తించడానికి లాంటి రచనల అవసరం నేడెంతైనా వుంది.

**-శ్రీమతి లక్ష్మి**
రాయనూతల

## ఆసక్తికరమైన కథనం

***(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)***

**సాం**ఘిక నవలలు చదివే అలవాటున్న ఎవరైనా ఇట్టే గ్రహిస్తారు - ఈ కథ చాలా పాతదేనని. ఆ మాటకొస్తే ఎప్పుడూ కొత్తకథలు ఎక్కణ్నించిపుట్టుకొస్తాయి? పాతవాటినే కొత్తగా చెప్పడంలోనే వుంది రచయిత ప్రతిభ. ఎవరో ఒక మహారచయితన్నట్టుగా అనుభవం పాతదేకాని అనుభూతి మాత్రం కొత్తది. గ్రామాభ్యుదయం, స్త్రీ జనోద్ధరణ ముఖ్యాంశాలుగా పల్లెటూరి వాతావరణాన్ని ప్రతిబింబిస్తూ, చివరివరకూ కథను ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా నడిపించగలగటంలో కృతకృత్యులయ్యారు రచయిత సింహప్రసాద్.

ఈ నవలలో హీరో 'మాష్టారు'. పచ్చినెత్తురు తాగే స్వార్థం విలయతాండవం చేస్తున్న ఈరోజుల్లో కేవలం తన గ్రామ ప్రజల శ్రేయస్సునే దృష్టిలోపెట్టుకుని నిర్విరామంగా కృషిచేసిన మహనీయుడుగా కనిపిస్తాడు కాని కొత్త స్కూలు బిల్డింగు ప్రారంభోత్సవ సందర్భంలో ఆయన దూరంగా నిలబడిపోవటం, అనుకోకుండా ఆయన శిష్యుడు కలెక్టరు అది చూడటం - ఆయన్ని వేదికపైకి తీసుకుపోవడం, అక్కడాయన ఉద్వేగంతో ప్రసంగించటం - ఆ తరువాత గుండెపోటుతో తుదిశ్వాస విడవడం సినిమాటిక్‌గా వుంది.

ఏదియేమైనా ఆసక్తికరమైన సన్నివేశాలతో చివరివరకూ ఉత్కంఠను రేకెత్తిస్తూ సాగిన నవల 'తొలిపొద్దు'.

**-జె. సుబ్బారావు**
సికింద్రాబాదు

## ప్రయోజనాత్మక నవల

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

'కృషితో నాస్తి దుర్భిక్షం'- మనిషి అనుకుంటే ఏదైనా సాధించగలడు అన్న సత్యాన్ని చాటిచెప్పిన ఇతివృత్తం సింహప్రసాద్‌గారి 'తొలిపొద్దు'. ఊరి దుస్థితిని మార్చాలని పిల్లలకు పాఠాలుచెప్పే ఒక మాష్టారు పడే ఆవేదన, తపన ఈ నవలలో మనకు స్పష్టంగా కనిపిస్తాయి. స్వాతంత్ర్యంవచ్చి నలభైసంవత్సరాలు గడచినాగానీ దేశానికి పట్టుకొమ్మలైన పల్లెలు ఎన్నో కనీస అవసరాలకు కూడా నోచుకోకుండా ఉన్నాయి. బలవంతులైన భూస్వాముల, వడ్డీవ్యాపారుల కబంధహస్తాల్లో పల్లెప్రజానీకం ఎలాంటి అత్యాచారాలకు గురిఅవుతున్నారో సింహప్రసాద్‌గారు కళ్ళకు కట్టినట్లుగా సహజంగా చిత్రీకరించారు.
మహిళామండలి, వయోజన విద్యాకార్యక్రమాలద్వారా పల్లెప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యడం ప్రస్తుత యువతకు కర్తవ్యాన్ని గుర్తుచేసినట్లుగా వుంది.

ఒక ఉగ్రవాదిగా భార్గవ్ పాత్ర చిత్రీకరణ వూరి షావుకార్ని చంపడానికి మాత్రమే రచయిత ఉపయోగించుకున్నట్లు స్పష్టమవుతుంది. రచయిత నవలలో ఎక్కువగా గాంధీయిజాన్ని చూపించారు. మార్క్సిజాన్ని అక్కడక్కడా చొప్పించినా ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వలేదనే చెప్పవచ్చు.

ఇలాంటి ఇతివృత్తాన్ని చక్కగా మలచడంలో సింహప్రసాద్‌గారిది అందెవేసిన చెయ్యి అని మరోసారి రుజువుచేశారు.

-యస్.ఖాశింపీరా
తిరుపతి

## యువతకు 'తొలిపొద్దు'

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

తెలుగు సాహిత్యం నానాటికీ దిగజారుతున్న ఈరోజుల్లో 'తొలిపొద్దు' అనే మంచినవల 'చతుర'ద్వారా రావటం పాఠకుల అదృష్టమనే చెప్పుకోవాలి. ఈ నవలలో అంగాంగవర్ణనలు గాని, అసభ్యపదజాలాలుగాని లేవు. సమకాలన సమస్యల [illegible]

నవలకు మూలాధారం 'మాస్టారు'. కన్నవాళ్లనుకూడా విస్మరించే ప్రబుద్ధులున్న ఈ భారతావనిలో, తనది అనుకున్న గ్రామంకోసం తన జీవితాన్నే త్యాగంచేసిన మహామనీషి ఈ మాస్టారు. అధికారదాహంతో అలమటించిపోయే గ్రామసర్పంచ్ రాయుడు, వడ్డీలకు అప్పులిచ్చి రైతుల రక్తాన్ని జలగలా పీల్చే షావుకారు నరశింహం, తండ్రికి వంతపాడే రాయుడి కొడుకు ప్రభాకర్ పాత్రలను, ఒకవైపు గ్రామాన్ని బాగుపరచాలని ఆరాటపడే నవయువకులు గాంధీ, శివం, సేవాదృక్పథంగల దీపిక, వరకట్నదాహానికిబలైన ఆడపడుచు సరిత, సమాజంలోని కుళ్లును ప్రక్షాళనచేయడానికి మందుగుండుతప్ప మరో ఆయుధంలేదని భావించే భార్గవ పాత్రలను మరోవైపున సమర్థవంతంగా చిత్రీకరించారు. ఈ పాత్రలద్వారా పలికించిన చాలామాటలు మనసున్న ప్రతిమనిషినీ ఆలోచింపజేస్తాయి. ఒక సందర్భంలో మాస్టారు కోడల్ని మందలిస్తూ "మనకి తెలియనివారి గురించి ఎక్కువ మాట్లాడితే, అది మన మనస్తత్వాన్ని బయటపెడుతుంది" అంటారు. నిజంగా ఎంత చక్కని వాక్యాలవి. నవల మొత్తంమీద మాస్టారిపాత్ర, ఆ పాత్రయొక్క ఔన్నత్యం ప్రస్తుతించదగ్గవి. మాస్టారి తర్వాత కథ నడిపేదంతా యువజనులే. తన తండ్రిని తాగుడు మానేయమని చెపుతూ శివం, "ప్రజల ఆరోగ్యాలకన్నా ప్రభుత్వానికి ఆదాయం ముఖ్యమైపోయింది. అందుకే ప్రభుత్వ సారా వచ్చింది. తర్వాత ప్రభుత్వ లాటరీలొచ్చాయి. ముందుముందు ప్రభుత్వదొంగలూ, ప్రభుత్వ వ్యభిచారమూ వచ్చినా ఆశ్చర్యపడక్కర్లేదు" అంటాడు. ప్రజల బలహీనతను పాలకులు ఇలా సొమ్ముచేసుకోవడం ఎంత దురదృష్టం. ఇలాంటి మన దోపిడీ వ్యవస్థ మారాలంటే యువశక్తి సంఘటితం కాకతప్పదు. చాలా నిజాల్ని తమ అద్భుతమైన నవల 'తొలిపొద్దు'ద్వారా తెలియజేసిన రచయిత సింహప్రసాద్‌గారికి అభినందనలు.

-కె.వి.యస్.ప్రసాద్
చోడవరం

కవరు పేజీ ఫొటోగ్రాఫర్: వికీహిండా

# యువతకు ఆదర్శం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**ప**ల్లెలలో నేడు జరుగుతున్న అన్యాయాలను, పెత్తందారీ విధానాలను ఖండిస్తూ, చక్కని మలుపులతో రచింపబడిందీ "తొలిపొద్దు".

గ్రామపెద్దల అక్రమాలకు బలి అవుతున్న అమాయకపు గ్రామప్రజానీకం జీవితాల్లో తొలి పొద్దుపొడవడానికి, వెలుగురేఖలు విచ్చుకోవడానికి మాస్టారు పడే తాపత్రయం, తన గ్రామం నాగరికతను పెంపొందించుకోవాలన్న ఆశ, మాస్టారి పెద్దమనసును, ఔన్నత్యాన్నీ తెలియచేస్తుంది. ఈ పాత్రను రచయిత ఏ ఉద్దేశంతో ఎన్నుకున్నారో అది విజయవంతమయిందనవచ్చు.

సహనానికి ఒక హద్దు ఉంటుంది. కొంతకాలానికి ఆ సహనం స్థానంలో ఆవేశం, క్రోధం చోటుచేసుకుంటాయి. ఇది యువతలో అయితే మరింత త్వరగా చోటుచేసుకుంటుంది. ఇదే ఆవేశం తీవ్రవాదానికి దారిచేస్తుంది. చిన్నన సింహాప్రసాదగారు భార్గవ పాత్రద్వారా నిరూపించారు.

ఆవేశం,ప్రతీకారంకన్నా ఆలోచన,వివేకాలే మిన్న. అవే విజయానికి సోపానాలు. అని శివం, దీపికలద్వారా నిరూపించగలిగారు. నేటి సమస్యల నెదుర్కోవడానికి యువత బాధ్యతలను చేతలద్వారా వారు నిరూపించారు. ప్రజల అమాయకతను, అజ్ఞానాన్ని ఆసరాగాచేసుకొని వారి రక్తాన్ని పిండుకుతాగే రాయుడు, షావుకారులాంటి పెద్దమనుషుల మనస్తత్వాలను చక్కని శైలిలో, సహజంగా చిత్రీకరించారు.

కానీ అన్ని నవలలలాగే ఉన్న ముగింపు కాస్త నిరుత్సాహానికి గురిచేసింది. చెయ్యి విరగ్గొట్టుకున్నా మారకుండా మరింత పగపట్టే రాయుళ్ళున్నారు నేడు. మొత్తానికి దౌర్జన్యదారులకు, వారిపెత్తందారీ విధానాలకు కనువిప్పు. యువతకు ఆదర్శమార్గం ఈ 'తొలిపొద్దు'.

-యలవర్తి మురళీభాస్కర్
గుంటూరు

సంపుటి: 11 **చతుర** సంచిక: 8

సెప్టెంబర్ 1988

# ఈ నెల సమగ్ర నవల

"నీ బ్లాంకెట్టూ, స్వెట్టరూ ఏవిరా శ్రీనూ! నాకు చూపించనేలేదు" అడిగింది విజయ.

"కోప్పడొద్దక్కా! ఇన్నాళ్ళుగా చాలీచాలని దుప్పటితో తలో, కాళ్ళో ఏదో ఒక్కటే కప్పుకోగలిగాను. ముడుచుకుని పడుకోవటం ఎలాగూ అలవాటైపోయింది. కానీ పుస్తకాలకని మళ్ళీ డబ్బులివ్వాలంటే ఇంట్లో ఇబ్బందిగదా! అందుకే బ్లాంకెట్ కొనలేదు" అన్నాడా తమ్ముడు.

కొత్త దుప్పటీ, స్వెట్టరూ కావాలని నిన్న మొన్నటివరకూ పేచీపెట్టిన శ్రీను ఎంతగా ఎదిగిపోయాడు? పరిస్థితులని ఎంత చక్కగా ఆకళింపు చేసుకున్నాడు?- అని అక్కడున్నవారంతా ఆశ్చర్యపోయారు.

ఈనాటి ఆర్థిక పరిస్థితుల్లో అవసరాలకు, ఆదాయానికి లంకె కుదరదు. ఆర్థికంగా నేటి జీవితం చాలీచాలని దుప్పటిలాంటిదే. కాళ్ళో, తలో ముడుచుకుని సర్దుబాటు చేసుకోవలసిందే!

అయితే అందరూ అలా సర్దుకుంటున్నారా? బలహీనతలకి, కోరికలకి దాసోహమై జారిపోతున్నవారెందరు? మధ్యతరగతి కుటుంబాలకి నిత్యజీవితంలో ఎదురవుతున్న సమస్యలు రోజురోజుకీ ఎలా తీవ్రతరమవుతున్నాయి? వీటికి పరిష్కారం లేదా? ఈ అంశాలకి సజీవ రూపకల్పనచేసి 'వినయ్' నేసిన 'దుప్పటి' సెప్టెంబరు 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.



"అమ్మా... ఈ దుప్పటీ సరిపోవటంలేదే" విసుగ్గా అరిచాడు శ్రీను.

"అబ్బ... ఎలాగోలా సర్దుకోరా! రోజూ వుండే దేగా ఈ తంటా" అంది జగదాంబ లోప ల్నించి.

శ్రీనుకు బాగా కోపంవచ్చింది. మళ్ళీ ఓ సారి తలదాకా లాక్కున్నాడు. పాదాలను దాటి పిక్కలదాకా వచ్చింది ఆ చివర. కాళ్ళతో కిందికి తన్ని కాళ్ళు కప్పుకున్నాడు. తలను దాటి గొంతు కిందకొచ్చింది పై చివర. ఏమీ చేయలేని నిస్సహాయతతో, కోపంతో వాడికి కాస్త దుఃఖం కూడా వచ్చింది.

"వెధవ దుప్పటి... వెధవ దుప్పటి"- కసిగా తిట్టుకున్నాడు. కానీ అంతకన్నా ఏం చేస్తాడు. అందులోనే ముడుచుకుని పడుకు న్నాడు ఆలోచిస్తూ.

అసలు తను పెరిగిపెద్దాడు కాకుండా వుంటే బాగుండేది. చిన్నప్పటిలా ఎంచక్కా అమ్మ పక్కలో పడుకునేవాడు. బామ్మపోయాక ఆ కుక్కిమంచంలో మరెవరూ పడుకోవడానికి వీలుకాదు కనుక తనందులో పడుకుంటాడు. అరుణక్క, విజయక్క ఓ పక్కలో పడుకుంటా రు. సుధన్నయ్యేమో నాన్నతో పడుకుంటాడు. పెద్దన్నయ్య, అమ్మ తనలాగే వేరుగా పడు కుంటారు. తనకు మంచం వదలబుద్ధికాదు. ఇప్పుడు మంచంతో ఇబ్బందేమీలేదుకానీ ఈ దుప్పటితోనే వుందంతా- అలా ఆలోచిస్తూనే నిద్దర్లోకి జారుకున్నాడు.

నిద్దర్లో వాడికో మాంచి కలొచ్చింది. ఆ కల్లోనేమో-

శ్రీను పెద్ద రాకుమారుడు. ఓ పెద్ద బంగ ళాలో, గదిలో, పెద్ద మంచంమీద పడుకున్నా డు. కొత్తబట్టలు వేసుకున్నాడు. తళతళా మెరి సిపోతున్నాయి. కొత్త 'చందమామ' చదివి, పక్కన పెట్టేసి, పడుకుని దుప్పటి కప్పుకుని తలదాకా లాక్కున్నాడు. కాళ్ళుదాటి పైకొ చ్చింది. కాళ్ళతో దాన్ని కిందికి లాగాడు. తల మీంచి కిందికి, గుండెలదాకా వచ్చింది. పీకల దాకా కోపంవచ్చింది. వెంటనే లేచి నిలుచుని, చప్పట్లుకొట్టి "ఎవరక్కడ" అన్నాడు.





"యువరాజా" అంటూ వెంటనే నలుగురు భటులు లోపలికొచ్చారు.

"నాకు మాంచి పెద్ద దుప్పటి కావాలి"

"చిత్తం" కూడబలుక్కున్నట్టుగా ఒకేసారి అని, నలుగురూ వెళ్ళిపోయి నాలుగు నిమిషా ల్లో నాలుగురకాల దుప్పట్లు తీసుకొచ్చారు.

"ఇదిగో యువరాజా... మీకు చక్కగా సరి పోయే కొత్త దుప్పటి" అంటూ ఒక నీలంరంగు దుప్పటి ఇచ్చాడొకడు.

"అబ్బ... ఎంత బావుందీ" అనుకుని అది తీసుకున్నాడు.

"ఇది చూడండి- కుచ్చుల దుప్పటి" అన్నా డింకొకడు.

మొదటిది పక్కకుపెట్టి అటువైపు తిరిగా డు. రంగురంగుల్లో వుందది. అంచులకున్న కుచ్చులు చాలా బావున్నాయి. దానికంటే ఇదే బావుంది, అనుకుంటూండగా-

"ఇది ఉన్ని దుప్పటి యువరాజా! ఈ చలికాలంలో వెచ్చగా వుంటుంది"-- అన్నాడు మూడోవాడు.

అబ్బ... చలపతి మావయ్యావాళ్ళింట్లో రగ్గు కంటే చాలా బావుందిది- అనుకున్నాడు. కానీ దానివైపు చేయిచాచలేదు. మిగిలిన వాటివైపు చూశాడు.

"ఇది కాశ్మీరీ తయారీ ప్రభూ! దీనిముందు గొంగళ్ళన్నీ బలాదూర్" అన్నాడు వాడు.

అది అన్నిటికంటే బావుంది. చేతిలోకి తీసు కున్నాడు. మెత్తగావుంది. మెరిసి పోతూంది. అక్కడక్కడా ఎర్రటిపువ్వులు- చాలా అందంగావుంది.

"నాకిది కావాలి" అన్నాడు శ్రీను.

"చిత్తం" అన్నాడు నాలుగోవాడు సంతో షంగా.

శ్రీను తన మెడలోంచి ఒక ముత్యాలహా రంతీసి, నాలుగో భటుడికిచ్చాడు. అది చూడ గానే వాడిమొహం మరింత వెలిగిపోయింది. ఆ భటుడు ఆ హారాన్ని కళ్ళకద్దుకుని,

"కృతజ్ఞుణ్ని ప్రభూ" అన్నాడు.

మిగతా ముగ్గురు భటులకూ నాలుగోవాణ్ని చూపిస్తూ-

"మీ నలుగురూ ఈ దేశ యువరాజు దు

ప్పటి కోసమే వెళ్ళినా, అందులో వీడొక్కడే కష్టపడి తిరిగి మంచి దుప్పటి తెచ్చాడు. ఈ విషయాన్ని మీ ముగ్గురూ ఇక ముందు గుర్తుంచుకోవాలి. అన్నట్టు, రేపు నేను స్కూలుకెళ్ళడానికి నాకు మంచి స్వెట్టర్ కావాలి. మీ ముగ్గురు కూడా మంచి స్వెట్టర్లు తేకపోతే మీ సంగతి చెబుతాను- జాగ్రత్త. ఇక వెళ్ళండి''- అని గద్దించాడు శ్రీను.

ఆ ముగ్గురూ తలొంచుకుని నడవగా, నాలుగోవాడు సంతోషంగా బైటకు నడిచాడు.

వరువుమీద పడుకుని, శ్రీను కాశ్మీరీ దుప్పటి కప్పుకున్నాడు- ముఖం నిండుగా. కాళ్ళ మీద అలాగే వుంది. ఇంకాస్త లాగాడు. అయినా కాళ్ళుదాటి రాలేదు. ''అబ్బ... ఎన్నాళ్ళకు ఇంత మంచి దుప్పటి కప్పుకున్నాను'' అనుకున్నాడు సంతోషంగా. ఇంతలో చేతికేదో గరుగ్గా తగిలింది. ముఖం మీంచి ముసుగు తీసి చూసేసరికి పాతదుప్పటి కనిపించింది. ఒళ్ళుమండిపోయింది.

''ఎవరక్కడ!'' గట్టిగా అరిచాడు.

మళ్ళీ నలుగురు భటులూ పరుగెత్తుకొచ్చారు.

''దీన్ని తీసుకెళ్ళి తగులబెట్టండి'' అన్నాడు- ఆ పాతదుప్పటిని వాళ్ళమీదికి విసురుతూ. ఆ భటుల చేతుల్లో దుప్పటి దీనంగా చూస్తున్నట్టనిపించింది శ్రీనుకు.

''వెధవ దుప్పటి... పీడాపోయింది'' కసిగా అనుకుని, పడుకోబోతూండగా, ఖంగున నీళ్ళ చెంబుపడిన చప్పుడు వినిపించటంతో, దీనంగా చూస్తున్న దుప్పట్లోంచి గబుక్కున తలతీసి, అలాగే ముడుచుకు పడుకుని కళ్ళు తెరిచాడు శ్రీను.

పైన బూజుపట్టిన పాతయింటి కప్పు కనిపించింది. చుట్టూచూశాడు. తమ ఇల్లే. దుప్పటివంక చూసుకున్నాడు. అదేదుప్పటి, తను రోజూ కప్పుకునేదే. ఎందుకైనా మంచిదని పరీక్షించడానికన్నట్టుగా, ముడుచుకున్న కాళ్ళను నిటారుగా చాపాడు. కాళ్ళు దుప్పటిని దాటి బైటికొచ్చాయి.

''అంతా కలన్నమాట''- నిరుత్సాహంగా అనుకున్నాడు కళ్ళుమూసుకుంటూ. నిద్రరావటంలేదు. అయినా కళ్ళుమూసుకున్నాడు. మిల్లునుండి వచ్చిన తండ్రికి తల్లి ఏదో చెబుతూంది. లీలగా వినిపిస్తున్నాయి మాటలు.

''సుధాగాడికి పరీక్ష ఫీజు కట్టాలట. ఇంక రెండ్రోజులే వున్నాయి'' అంది జగదాంబ వడ్డిస్తూ.

''రెండ్రోజుల్లో నేను మాత్రం ఎక్కణ్నించి తేను! నువ్వే పార్వతమ్మను అడిగి చూడు. ఇవాళ నాలుగో తారీఖుగదా. ఇంకా వారంరోజులైతేగానీ జీతంరాదు'' అన్నాడు వెంకటేశం.

''పార్వతక్కయ్యకు ఇప్పటికే ఇరవై రూపాయలివ్వాలి. మళ్ళీ డబ్బుకావాలంటే ఏమంటుందో?'' అంది జగదాంబ, గరిటతో చారులో ఉల్లిపాయముక్కలేరుతూ.

''ఏదో ఒకటి చేయాలి. నేను మిల్లులో ఎవర్నయినా అడిగి చూస్తాను. అడిగి నోరు ఖాళీచేసుకోవటమే కాని, ఎవరైనా ఇస్తారన్న నమ్మకం మాత్రం లేదు''

''ఏం ఫీజులో, ఏం చదువులో! చారెడు చదువుకి దోసెడు బలపాలన్నట్టువుంది. ఇన్ని కష్టాలుపడి చదివించినా ఏదో మంచి ఉద్యోగం దొరుకుతుందనే ఆశాలేదు'' నిట్టూర్చింది.

''అది ఎవరు మాత్రం చెప్పగలరు? ఎవడి నుదుట ఏంరాసిపెట్టివుందో. ఈ కాస్త గడిస్తే రెండోవాడూ చేతి కందుతాడు. కాస్త తెరిపిన పడొచ్చు''- ఎలక్ట్రిక్ దీపం వంకేచూస్తూ అన్నాడు వెంకటేశం.

''పొద్దున్న కాఫీకి పంచదారలేదు. అరువుకొట్లో లేదట. ఆ వెధవ మిల్లులో పదోతారీకేమిటో. అందరికిలాగే ఫస్టునాడే జీతాలు చేతిలో పెడ్తే పోలా'' అంది జగదాంబ కంచం తీస్తూ.

భార్య అమాయకత్వానికి నవ్వొచ్చింది వెంకటేశంకు-

''ఒసి పిచ్చిదానా... నెలకు పదిహేనురోజులైతేతప్ప మనకొచ్చే జీతం ఏ తేదీకొచ్చినా మళ్ళీ జీతాలొచ్చేదాకా సరిపోదే'' అన్నాడు- దిండు సరిచేసుకుని పక్కమీద నడుంవాలుస్తూ.

జగదాంబకూడా లైటు తీసేసి పడుకుంది. శ్రీనుకు మాత్రం మళ్ళీ నిద్రపట్టటంలేదు. తన పరిధిలో తను ఆలోచిస్తూ నిద్రా ప్రయ

త్నం చేస్తున్నాడు. 'అన్ని రూపాయల జీతం వస్తుంది. ఐనా ఒక్క దుప్పటీ మంచిది కొనరు. సుధన్నయ్యకు ఉద్యోగం రావాలి. అప్పుడు ఒక్కటేం ఖర్మ వదికొనొచ్చు. ఆ పదిట్లో ఓ నాలుగు బ్లాంకెట్లు కూడా కొనుక్కోవచ్చు. ఐనా పది దుప్పట్లేం చేసుకోను. నాలుగు దుప్పట్లలో రెండు బ్లాంకెట్లుంటే సరిపోతుంది. మిగతా డబ్బుల్లో రెండు స్వెట్టర్లు కొనుక్కోవాలి. స్కూల్లో చాలా మంది చలికాలంలో ఎంచక్కా చేతుల్లేని స్వెట్టర్లూ, పొడుగు చేతుల స్వెట్టర్లూ వేసుకుని వస్తారు. తను మాత్రం దుప్పటి కూడా లేకుండా... ఇలా ఆలోచిస్తున్నాడు.

★ ★ ★

నారాయణ బైటపడగానే అరుణ లేచి చకచకా ముస్తాబు మొదలెట్టింది. విజయ బాత్రూంలో స్నానంచేస్తూంది.

"ఓసారి సబ్బియ్యవే" అంటూ తలుపు కింద సందులోంచి చెయ్యిదూర్చింది.

"సబ్బు తోడవదలదు వలదు వలదు.

డబ్బు లేకున్న వదులునే సినిమాల జబ్బు" అంటూ అరుణ చేతిలో సబ్బు పెట్టింది విజయ.

"అక్షర లక్షలు... అక్షర లక్షలు" విజయకు వంతపాడాడు సుధాకర్.

"మళ్ళీ నోరెత్తావంటే అక్షర గుద్దులు వడ్డిస్తాను, గమ్మున నోర్మూసుకోండి" మెల్లిగా కసిరింది తమ్ముణ్ణీ, చెల్లెల్నీ- తల్లికి వినబడకుండా.

గబగబా ముఖం కడిగేసుకుని లోపలికెళ్ళి ముఖం తుడుచుకుంటూండగా,

"అరుణా... పిన్ని దగ్గర కొంచెం పంచదార పట్రావే" అంటూ వచ్చిన జగదాంబ, "ఎక్కడికే ప్రయాణం?" అంది కూతురి ముస్తాబు చూసి.

"అబ్బ... శ్రీనుగాణ్ణి పంపియ్యవే, నాకిప్పుడు టైంలేదు. లలితదగ్గరికి వెళ్ళాలి" అంటూ తొందరగా పౌడర్ డబ్బా అందుకోబోయి, చేజార్చి కింద పడేసింది.

"లలిత దగ్గరికి వెళ్ళటానికి ఈ హడావుడి ఎందుకే! పౌడరంతా ఒలకబోశావు. శ్రీనుగాణ్ణి పంపిస్తే లక్ష్మి పిన్ని ఇవ్వదు. కాస్త వెళ్ళి రావే తల్లీ" అంటూ చిన్న స్టీలు గిన్నె టేబుల్‌మీద పెట్టి, వెనుదిరిగింది జగదాంబ.

లోపలికొస్తూ సంభాషణ విన్న విజయ-

"లలిత దగ్గరికెందుకూ అంటే, ఆ విషయం వెండి తెరపై చూడాలమ్మా" అంది తల్లితో.

"అవునవును... దాన్నడిగితే ఎలా చెబుతూందీ పాపం. మనం కూడా వెండి తెరపై చూడాలి" విజయకు మళ్ళీ వంతపాడాడు సుధాకర్.

తమ్ముడి వంకా, చెల్లెలి వంకా గుర్రుగా చూస్తూ, టేబిల్‌మీది స్టీలుగిన్నెను చటుక్కున అందుకుని పోబోతున్న తల్లి చేతిలో పెట్టి.

"అమ్మా అమ్మా... ఈ ఒక్కసారికీ నువ్వెళ్ళవే. లలిత ఊరికెళ్తానందే. వెళ్ళిపోయిందంటే మళ్ళీ రెండువారాలదాకా కనిపించదు" అంది బతిమాలుతున్న ధోరణిలో

"దానికి నేను చెప్పలేనుగానీ, పొయ్యిమీద పప్పుమాడుతుంది కాస్త చూడరా సుధా! నేనే తీసుకొస్తాను" అంది జగదాంబ.

"ఆడదానిలాగా నేను వండివార్చి పెడతాను, మీరు కాలేజీకి వెళ్ళండి" అని వెక్కిరిస్తూ ముందు గదిలోకి నడిచాడు సుధాకర్.

తలస్నానం చేసిన జుట్టు ఆరబెట్టుకుంటున్న విజయ-

"ఒక్క నిమిషం నువు చూసుకోఅమ్మా... నేను జుట్టు ముడేసుకుని పొయ్యిదగ్గరకొస్తాగానీ" అంది తల్లితో.

తల్లి పక్కింటి పిన్ని దగ్గర పంచదార అరువుకోసం వెళ్ళగానే, మరింత హుషారుగా విజిల్ వేసుకుంటూ వంటింట్లోకి నడిచింది అరుణ. అప్పుడే వంటింట్లోకి వచ్చిన శ్రీను,

"అక్కా... నాకో పావలా ఇవ్వవా" అన్నాడు గారంగా.

"ఇస్తానుగానీ, హెయిర్ పిన్నులెక్కడున్నాయో దొరకటం లేదు. ఒక్క నిమిషంలో వెదికిపెట్టుమరి" అని మళ్ళీ విజిల్‌వేయసాగింది అరుణ.

"మగరాయుడిలాగా ఆ ఈలలేమిటే? నువు సినిమాలకు వెళ్ళేది చాలుగానీ, వాడికి

డబ్బులు ఖర్చుపెట్టడం అలవాటు చేయకు. ఒరేయ్ శ్రీనూ... డబ్బులెందుకురానీకు? వెధవా- పోయి చదువుకో- పో'' అని తమ్ముడిని ముందురూంలోకి తరిమింది విజయ.

"అరుణక్క ఇస్తుంటే మధ్యలో నీకెందుకో" గునుస్తూ వెళ్ళాడు శ్రీను.

విజయ వైపు కోపంగా చూసి,

"నువ్వేమిటే- అందరిమీదా పెత్తనాలు చెలాయిస్తావ్?'' అని ఇంకా ఏదో అనబోయిందల్లా, గుమ్మంలో తల్లి వస్తుండటం చూసి గమ్మున ఊరుకుంది.

హెయిర్ పిన్నులు వెతుక్కుని, తిలకం దిద్దుకుని గబగబా చీర మార్చుకుంది. పర్సు చేతిలో పట్టుకుని, డబ్బులున్నాయో లేవో చూసుకుని బయటపడింది.

గుడ్డులోంచి బైటపడ్డ కోడి పిల్ల గుర్తొచ్చింది అరుణకు. ఇంట్లోంచి ప్రస్తుతం బైటపడిన వైనం అటుంచి, అసలీ వలయంలోంచి తనెప్పుడు బైట పడుతుందో. 'తిండిపోతు'లో శివాజీగణేషన్‌కులాగా తనకూ ఏదో ఒకరోజు సినిమా ఛాన్స్‌రాకపోదు. అప్పుడు చూడాలి మజా, తన చుట్...

"హలో అరుణా'' అన్న పిలుపు విని, మనసునోరు మూసేసి, అసలు నోరు విప్పింది.

"హలో... నువ్వా సంపత్' అంటూ పలకరించింది.

"ఎక్కడికి ప్రయాణం?''

"సినిమాకు. టిక్కెట్లు దొరుకుతాయో లేదో. మా అన్నయ్య ఆఫీస్‌కెళ్ళేసరికి ఆలస్యమయింది.

"పద... పదుస్తూ మాట్లాడుకుందాం"

నడక ఆరంభించారు.

"ఇంతకీ ఏం సినిమా?'' మళ్ళీ అడిగాడు సంపత్.

"కొత్త అల్లుడు''

"నాక్కూడా పనేమీలేదు. కలిసి చూద్దామా?''

"నువ్వు సినిమా చూస్తే నాకేమిటి అభ్యంతరం? నేనేమైనా నీ గార్డియన్‌నా?'' అందేగానీ లోలోపల అన్నయ్యో, తండ్రో ఎదురవుతారని భయం.

"అబ్బే... నన్నే నీ బాడీగార్డ్ అంటావేమోనని భయపడ్డాను'' నవ్వాడు సంపత్.

"సిల్లీ... ఇంతకూ మీ నాటక సమాజం ఎలా నడుస్తోంది?''

"ఏదో పుడ్డుకిబ్బంది లేదనుకో"

"అంత తేలిగ్గా చెప్తావేమిటి? అసలు కోటి విద్యలు కూటికొరకే అన్నారు కదా. మరి నాటకలు దేనికో....''

"అరుణకుమారీ... అది పాతసామెత. మొన్నామధ్య పేపర్లో వచ్చింది చూడలేదా- కలకత్తాలో ఎవడో టీకొట్టువాడు ఒంటరి పక్షి.చచ్చాక వాడి టీకొట్లో వేల రూపాయల నగదూ, లక్షల రూపాయల ఆస్తులను చూపించే బ్యాంకు పాసుబుక్కులూ, డాక్యుమెంట్లూ కనిపించాయట. అదన్నమాట విషయం. మనం చేసే పని మొదట్లో పుడ్డుకోసమే ఐనా, తరువాత దాని పరమార్థం డబ్బు కూడబెట్టడమే. అందుకే మన ఆధునిక సామెత- కూటి విద్యలు కోటి కొరకే''.

—అవును... డబ్బు- డబ్బనేది ఒక తెర ఐతే, దాని వెనక మనిషి ఏంచేసినా బైటకు కనబడనీయని ఉక్కుతెర అది. డబ్బు అనేది బానిస. మనం ఏం చేయమన్నా చేసే విశ్వసనీయమైన బానిస అది- లోలోపలే అనుకుంది అరుణ. ఐతే ఆ డబ్బుకే మనిషి బానిసైతే అది ఎంత చెడ్డ యజమాని అవుతుందో తెలియదు అరుణకు.

ఇద్దరూ థియేటర్‌కెళ్ళేసరికి బుకింగ్ అయిపోయింది. సినిమా మొదటి రోజేమో విపరీతమైన జనం. అరుణ నిస్సహాయతను వ్యక్తంచేసింది. మూడు రూపాయల టిక్కెట్‌కు ఏడు రూపాయల చొప్పున పెట్టి బ్లాక్‌లో కొనుక్కొచ్చాడు సంపత్. సినిమా మొదలయ్యేవరకూ పక్కన కూర్చున్న సంపత్ గురించి భయపడిందిగానీ, ఆ తరువాత సినిమాలో పడిపోయింది. సినిమా అయిపోయిన తరువాత హోటల్‌కు వెడదామని సంపత్‌చేసిన ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరించింది. టికెట్ కొనాల్సిన డబ్బు మిగిలిపోవటంతో రిక్షా ఎక్కేసి ఇంటిదారి పట్టింది.




అరుణ ఇంటర్ ఫస్టియర్‌లో చేరినప్పుడు, అదే కాలేజీలో సెకండియర్ చదువుతున్న సంపత్ నాటకాల ద్వారా అరుణకు పరిచితుడయ్యాడు. అంతర్ కళాశాల నాటకపోటీల్లో బహుమతి సంపాదించి, కాలేజీలో ఒక గుర్తింపు పొందినవాడు సంపత్. అంతర్ కళాశాల సాంస్కృతిక పోటీల్లో గాయనిగా బహుమతి సంపాదించుకున్న అరుణను నాటకాల వైపు ఆకర్షించటానికి ప్రయత్నాలు చేశాడు సంపత్. సహజంగా సినీతార కావాలని ఆసక్తి వున్న అరుణ కూడా ఉత్సాహం చూపించింది. ఫస్టియర్ చివర్లో జరిగిన కాలేజ్ డే ఫంక్షన్‌లో నాటకం కోసం రెండు మూడు రోజులు రిహార్సల్స్‌లో కూడా పాల్గొంది కానీ, నాటకంలో నటించటానికి తల్లిదండ్రులు సుతరామూ ఒప్పుకోకపోవటంతో మానేసింది.

ఇంటర్‌తో చదువుమానేసిన సంపత్ నాటక సమాజంలో చేరి రాణించాడు. అరుణ చదువు మీద శ్రద్ధ చూపక, ఫైనల్లో ఫెయిలై, ఇంట్లో కూచుని మళ్లీ సప్లిమెంటరీ కట్టి, అత్తెసరు మార్కులతో పాసయి, ఎలాగోలా బియ్యేలో చేరింది. పెళ్లిచేసేవరకూ ఖాళీగా వుంచడమెందుకని తప్పితే అరుణను చదివించటానికి ఇంట్లో మరో కారణం లేదు. కాలేజీలో చదువుకోవడం ద్వారానైనా నలుగురి పరిచయాలూ, నాటకాల గురించిన పరిజ్ఞానం వంటివి తెలుసుకునే వీలుంటుందనే అభిప్రాయంతో అరుణ కూడా ఎలాగోలా బియ్యే మొదటి సంవత్సరం గట్టెక్కింది. తమ కాలేజీలో వేసే నాటకాలకు సహాయం చేస్తూండే సంపత్‌తో అరుణకు పరిచయం అలాగే పెంపొందింది. అది అలాగే నిలిచివుంది. ఓ నాటకంలో మటుకు ఒకపాట ప్లేబాక్ పాడింది అరుణ.

సంపత్ నాటకాల ద్వారా మంచి పేరే తెచ్చుకున్నాడు. ముందు ముందు ఇంకా మంచిపేరూ, గుర్తింపూ తెచ్చుకోవచ్చు. తను మాత్రం నాటకాల్లో అవకాశం లేకపోయినా, ఏదో ఒకనాటికి ఎలాగోలాగ సినిమాల్లో చేరటం మట్టుకు ఖాయం. ఒక చిన్న అవకాశం దొరికాలేగానీ, తనుగొప్ప తార అయిపోవటం అంతకన్నా ఖాయం. అప్పుడు ఇలాంటి సంపత్‌లెందరో మొహాలు వేళ్లాడేసుకుని కూచుండగా తను తారాపథంలో వెలిగిపోతుంది. కానీ అన్నయ్యనూ, నాన్ననూ ఒప్పించాలి. అసలు నాన్న ముందుగా ఒప్పుకుంటే అమ్మా, అన్నయ్యలు ఏమీ అడ్డు చెప్పరు. శాస్త్రీయ సంగీతం నేర్చుకోవటానికి అభ్యంతరం లేదు కానీ, స్టేజీపైకెక్కి పాడటానికి అభ్యంతరం ఎందుకో. ఆ అభ్యంతరం లేకపోతే రెయిన్‌బో ఆర్కెస్ట్రాలో తనెప్పుడో చేరివుండేది. నాటకాల్లో నటించటానికి అసలే ఒప్పుకోలేరు. రేపు సినిమా ఛాన్సు వచ్చాక తీరా వీళ్లు ఒప్పుకోకపోతే ... ఏమో, ఎందుకొప్పుకోరు. ఈ దరిద్రం, అప్పులు, కప్పుడు పంచదార చేబదుళ్లు, దానికోసం లక్ష్మి పిన్ని దీర్ఘాలు సహించటం, బ్లాకులో టిక్కెట్ కొనుక్కోవటానికి డబ్బులు తడుముకోవటం - ఇవన్నీ వాళ్లకు మాత్రం ఇష్టం వుంటుందా? తననుకున్నట్టు ఏదో ఒకటి చేయాల్సిందే. లేకపోతే మరో ఆరేడేళ్లలో నాన్న రిటైరైతే, ఇక అన్నయ్య సంపాదనతోనే కుటుంబం ఏమని గడిచేట్టు, తమ అప్పులన్నీ ఏనాటికి తీరేటట్టు.

రిక్షా సాగిపోతుండగా ఇలా సాగిపోయాయి అరుణ ఆలోచనలు. తమ వీధి రాగానే, మలుపు దగ్గరే రిక్షా దిగి, కాలినడకన ఇంటి దారి పట్టింది.

★ ★ ★

ఆ వూళ్లో చాలా సంవత్సరాలుగా టైప్ రైటింగ్ నేర్పటంలో పేరుపడిన ఇన్‌స్టిట్యూట్ అది. దానిపేరు లక్ష్మినారాయణ టైప్ ఇన్‌స్టిట్యూట్. ఒక్క టైప్‌రైటింగ్ మాత్రమేకాక షార్ట్ హాండ్ కూడా చేపపిల్లకు ఈతవచ్చినంత క్షుణ్ణంగానూ నేర్పిస్తారని ప్రతీతి. అందుకు ముఖ్యకారణం ఆ ఇన్‌స్టిట్యూట్ ఓనర్ జనార్ధన్. చేస్తున్నది వ్యాపారమే అయినా విద్యార్థుల భవిష్యత్తు కూడా దృష్టిలో పెట్టుకొని ఆయన ప్రతిరోజూ స్వయంగా కూచొని అజమాయిషీ చేస్తుంటాడు.

జనార్ధన్‌కు చలపతి పరిచయస్తుడు. వయసుల తారతమ్యం వదిలేస్తే వాళ్లిద్దర్నీ స్నేహితులని కూడా చెప్పుకోవచ్చు. అలాంటి చల

వతి స్వయంగా తీసుకువచ్చి చేర్పించటంవల్ల, నారాయణపట్ల జనార్ధన్‌కు ఒక ప్రత్యేకమైన అభిమానం. అందుకు మరో కారణం, చదువులో అంత చురుకుగా లేకపోయినా టైప్‌రైటింగ్‌లో చాలా చురుకుగా వున్న నారాయణ మంచి మార్కులతో లోయర్, హయ్యర్ పరీక్ష పాసవటం, కుటుంబ పరిస్థితుల దృష్ట్యా ఇంటర్‌తో చదువు ఆపేసి, నారాయణ అదే ఇన్‌స్టిట్యూట్‌లో ఇన్‌స్ట్రక్టర్‌గా చేరటం ఆయన అభిమానం మరింత పెరగటానికి దోహదంచేసింది. సహజంగా స్నేహితులు లేకపోవటం వలనా, అవసరానికి మించి ఎవరితోనూ మాట్లాడే అలవాటులేనందునా తన పూర్తి కాలాన్ని ఇన్‌స్టిట్యూట్‌లోనే గడుపుతుంటాడు నారాయణ. ఎన్నడూ ఎలాంటి ఫిర్యాదులూ లేకుండా ఆపనే తన జీవనధ్యేయం అన్నట్టు



పాటుపడే నారాయణ మనస్తత్వం అతనిపట్ల జనార్ధన్‌కుగల అభిమానాన్ని ఇనుమడింపజేసింది.

ఆ ఇన్‌స్టిట్యూట్‌లో రెండు షిఫ్టుల్లో మొత్తం ఆరుగురు ఇన్‌స్ట్రక్టర్లున్నారు. వారిలో ఒకడు నారాయణ. ఎంత కష్టపడి పనిచేసినా అతనికి అందరికిలాగే మూడొందల రూపాయలు మాత్రమే జీతం. అది హెచ్చించాలని వున్నప్పటికీ, ఆ పనిచేసి మిగిలిన ఇన్‌స్ట్రక్టర్ల అసూయకు నారాయణనూ, కోపానికి తననూ గురిచేయటం జనార్ధన్‌కు ఇష్టంలేదు. అలాగని ఊరుకోకుండా తనకు తోచినరీతిలో సహాయం చేస్తుంటాడు. నారాయణ ఉద్యోగాలకు దరఖాస్తు చేసినప్పుడల్లా అవసరమైన పోస్టల్ ఆర్డర్లు, డ్రాఫ్టులులాంటివి కొనివ్వటం, తన ఇంట్లో మిగిలిపోయాయనే మిషతో నారాయణ తమ్ముళ్లు, చెల్లెళ్లకు అవసరమైన నోటుపుస్తకాలూ, పెన్నులూ, పెన్సిళ్లు లాంటివి ఇవ్వటం చేస్తుంటాడు జనార్ధన్.

ఆ టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో టైప్‌రైటింగ్‌గానీ, షార్ట్‌హాండ్‌గానీ నేర్చుకున్న ప్రతి విద్యార్థికీ ఆ సంస్థతో తనకేదో వదలరాని అనుబంధం ఏర్ప డినట్టనిపిస్తుంది. నారాయణకు అంతకన్నా ఎక్కువగా అనిపించటంలో ఆశ్చర్యం లేదు. నారాయణకు గవర్నమెంట్ ఉద్యోగం వచ్చిన విషయం తెలియగానే జనార్ధన్‌కు చాలా సంతోషం కలిగింది.

"చాలా సంతోషం నారాయణా! రికమండేష న్లూ, లంచాలూ లేకుండా ఇంతకాలానికైనా నీకు ఉద్యోగం దొరికినందుకు చాలా సంతో షంగావుంది" అంటూ, కుర్రాణ్ణి పిలిచి, స్వీట్లు తెప్పించి, ఇన్‌స్టిట్యూట్‌లోవున్నవాళ్లందరికీ పంచమని పురమాయించాడు.

నారాయణకు ఉద్యోగం వచ్చిన విషయం తెలియగానే చాలామంది విద్యార్థులు టైపింగ్ ఆపి, వచ్చి అతని చుట్టూ చేరారు.

"ఏ డిపార్ట్‌మెంట్‌లో సార్, ఏ వూళ్లో?"

"టైపిస్ట్‌గానా, స్టెనోగానా"?

"అయితే ఇకమీరు ఇక్కడ మానేసి వెళ్లిపో తారా సార్?"

--రకరకాల ప్రశ్నలు వేస్తూ ఉక్కిరిబిక్కిరి చేశారు.

"మీరు వెళ్లిపోతుంటే బాధగా వుందండీ"

"మీరు వెళ్లొద్దుసార్, ఇక్కడే వుండాలి"

--ఇలా అభ్యర్థించారు కొంతమంది.

వాళ్లందరికీ జనార్ధన్ బదులిచ్చాడు--

"మీరందరూ నారాయణ మీదున్న అభిమా నంకొద్దీ ఇలా మాట్లాడుతున్నారు కానీ, మీకోరిక ఎంత పిచ్చిదో ఆలోచించి చూడండి. ఇక్కడ మనం ఇచ్చే జీతం ఎంత? మూడొందలు. మరి ఈ జీతంతో ముందుముందు నారాయణసార్ ఎట్లా బతకాలంటారు?"

పిల్లలంతా నిశ్శబ్దం అయిపోయారు. చిన్నగా నవ్వి, మళ్ళీ అన్నాడాయనే--

"మీరంతా గొప్ప అభిమానంతో నారాయ ణని వుండమంటున్నారుకదా! అసలు మీరు ఈ ఇన్‌స్టిట్యూట్‌లో వుండేదెన్నిరోజులు? ఇంకో ఆర్నెల్లయితే మీలో సగంమందివెళ్ళిపోతారు. అంతేకదా. అంచేత ఇట్లా ఆలోచించకూడ దు-- అవునా! మీ అందరికీ నారాయణ మీద అంత అభిమానమే వుంటే, మీరంతా ఫస్ట్ క్లాస్‌లో పాసవడానికి కష్టపడండి. అప్పుడు ఒప్పుకుంటాను, మీరు నారాయణ దగ్గరనేర్చు కున్న స్టూడెంట్సని"

చెప్పిన విషయమేదో సీరియస్‌గాకాకుండా నవ్వుతూ చెప్పటం వలన విద్యార్థులెవ్వరూ బాధపడలేదు. సరిగ్గా అర్థంచేసుకున్నారు. అయితే గంట గంటకూ మారే ప్రతి బ్యాచ్ విద్యార్థులూ ఆ రోజంతా నారాయణనూ, జనా ర్ధన్‌నూ విసిగించటం మాత్రం తప్పలేదు.

సాయంత్రం ఏడుగంటలకు ఇన్‌స్టిట్యూట్ నుండి బయలుదేరి, చలపతి ఇంటికి దారితీశా డు నారాయణ. కావటానికి జగదాంబకి పిన్ని కొడుకైనా, ఆమె సొంత తమ్ముళ్ళకంటే ఎక్కు వగా వాళ్ళతో కలిసిపోయినవాడు చలపతి. అందుకు చలపతి అదే ఊళ్ళోవుండటం ముఖ్యమైన కారణం అయితే, అక్షరజ్ఞానం తప్పమరి చదువుకోని వెంకటేశం, పిల్లల చదువుల గురించి చలపతిని సంప్రది స్తూండటం మరో కారణం. తండ్రికి మొద ట్నించీ వున్న అలవాటు మూలంగా కావచ్చు లేదా తమకు అవసరమైనప్పుడల్లా తగిన సలహాలిచ్చి ఆదుకున్నాడన్న అభిమానం వల్ల కావచ్చు, మొత్తానికి నారాయణ కూడా తనుచే సే ఏపనైనా చలపతికి చెప్పకుండాచేయడు.

ఇంటిముందున్న చిన్నగేటు తీసుకుని, లోప లికడుగుపెట్టాడు నారాయణ. ముందుగదిలో కూచుని చదువుకుంటున్నారు పిల్లలిద్దరూ.

"మమ్మీ... నారాయణ బావ కమింగ్" అని కేకేశాడు, చలపతి కొడుకు తరుణ్.

"స్టుపిడ్... నారాయణ బావ కేమ్-- అనాలి" రెండోక్లాసు తమ్ముణ్ణి సరిదిద్దింది ఆరోక్లాసు మాధురి.

"తరుణ్... డాడీ ఏం చేస్తున్నాడు?" అన్న నారాయణకు బదులివ్వకుండా అక్కకు బదు లిచ్చాడు తరుణ్ కోపంగా--

"మా మేడమ్ అట్లాగే చెప్పింది".

"లుక్ బావా... దిస్ ఫూల్ డోంట్ లెర్న్స్ ప్రాపర్లీ అండ్ బ్లేమ్స్ ద మేడమ్" సీరియస్‌గా ఫిర్యాదు చేసింది మాధురి-- చేస్తున్న హోమ్





పక్క తవిన.

అంతలోకే చలపతి భార్య సరోజ వచ్చింది లోపల్నించి.

"ఏమయ్యా నారాయణా... నెలరోజులైంద నుకుంటా నువ్వొచ్చి. ఏమిటి సంగతులు" అంటూ, మాధురి వైపుతిరిగి– "దిస్ ఫూల్ డోంట్ లెర్న్స్– కాదు, దిస్ ఫూల్ డసంట్ లర్న్– అనాలి"– అని కూతుర్ని సరిదిద్దింది.

"మరి మా మేడమ్ అట్లాగే చెప్పింది మమ్మీ" అంది మాధురి.

"లుక్ మమ్మీ... దిస్ ఫూల్ నో లర్నింగ్, కంప్లెయింటింగ్ మేడమ్"– వెంటనే తిప్పికొట్టాడు తరుణ్.

"ఇహ ఇద్దరూ నోర్మూసుకోండి! ఫస్ట్ ఫినిష్ యువర్ హోమ్‌వర్క్" అంటూ నారాయణ వైపుతిరిగింది సరోజ– "మీ మావయ్య సెవెన్ థర్టీకొస్తానని మార్నింగ్ చెప్పి వెళ్ళారయ్యా! నేను వంటచేస్తున్నానుగానీ కిచెన్‌లో కూచుందువురా– మాట్లాడుకుందాం" అంటూ లోపలికి దారితీసింది.

ఆమెవెంట లోపలికి నడిచాడు నారాయణ.

"అమ్మా, నాన్నా బావున్నారా! ఏమిటో మూణ్నెల్లనించీ రావాలనుకోవటమే కానీ, మీ మావయ్యకు తీరిక లేకా, పిల్లల పరీక్షలనీ ఇలాగే గడిచిపోతూంది" అంది సరోజ, లోపలికి నడుస్తూ.

"అమ్మయితే ఎప్పుడూ అంటూనే వుంది అత్తమ్మా, నిన్ను రమ్మని చెప్పమని"

"నాన్నకు ఏ షిఫ్టు"

"రెండోషిఫ్టు" అన్నాడు నారాయణ, వంటింట్లో ఓ స్టూలుమీద కూచుంటూ.

"ఏవిటయ్యా విశేషాలు?" అంది సరోజ, గ్యాస్‌స్టవ్ సిమ్‌లో పెడుతూ.

"గ్రూప్‌త్రీ అపాయింట్‌మెంట్ వచ్చిందత్తమ్మా! మావయ్యకు చెబుదామనొచ్చాను"

వెంటనే ఆశ్చర్యంతో నారాయణ వైపుతిరిగింది సరోజ.

"నీయిల్లు బంగారంకానూ! ఇంతసేపటికటయ్యా ఈ మాటచెప్పేది. ఇప్పటికైనా నేను విశేషాలేమిటని అడిగానుగనుక చెప్పావుగానీ లేకపోతే మీ మావయ్యొచ్చేవరకూ నోరు విప్పేవాడివి కాదనుకుంటా? ఉండు... ముందు నీనోరు తీపిచేయాలి. బీరువాలో స్వీట్లున్నాయో లేవో మరి, లేకుంటే ఇంతపంచదారో, ఓ చాక్‌లెట్టయినా పెట్టాలి" అంటూ, బెడ్‌రూంలోకి దారితీసింది ఓ పళ్ళెంచేతబట్టుకుని.

"స్వీట్లెందుకత్తమ్మా ఇప్పుడు?" మెల్లిగా అన్నాడు నారాయణ, కానీ సరోజ వినిపించుకోలేదు.

పళ్ళెంలో రెండు స్వీట్లుపెట్టుకుని వచ్చి, నారాయణకు అందిస్తూ,

"ఈ గడుగ్గాయిలకంట పడనట్టుంది. ఇంకా నాలుగు ముక్కలు వున్నాయయ్యా" అంది.

మారు మాట్లాడకుండా పళ్ళెం అందుకుని స్వీట్లు తినటానికి ఉపక్రమించాడు నారాయణ.

అంతలోనే చలపతి వచ్చాడు.

విషయం విని చలపతి కూడా చాలా సంతోషించాడు.

అపాయింట్‌మెంట్ ఆర్డర్ తీసి చలపతికి అందించాడు నారాయణ.

"...విథిన్ టెన్‌డేస్ కమెన్సింగ్ ఫ్రమ్ నెక్స్ట్ యిన్‌స్టాన్స్..." చదువుతూ, "నెక్స్ట్ అంటే ఎప్పుడు" అన్నాడు చలపతి.

"మంగళవారం" అందించింది సరోజ.

"ఏదో ఒకవారంలే. తొమ్మిదినాడే వెళ్ళి జాయినవ్వు" అన్నాడు చలపతి.

"జనార్ధన్‌గారేమో మంగళవారం వద్దన్నారు మావయ్యా"

"అంటాడు... ఆయన సంగతినాకు తెలును. ఇంతకీ ఏమన్నాడు?"

"మంగళవారం మంచి రోజుకాదు. అసలు ఎవరూ ఆరోజున చేరరు. అందుకని సీనియారిటీపోయేది కూడా ఏమీ వుండదు– అన్నారు" వివరించాడు నారాయణ.

"ఆమాటకూడా నిజమేనండోయ్" అంది సరోజ.

"నీమొహం నిజం. జనార్ధన్ కాస్త పెద్దాయన. ఆయనకేవో చాదస్తాలుంటాయి. కానీ

ఇవాళరేపు వారవర్జ్యాలు చూసుకుని ఉద్యోగంలో చేరటం పోస్ట్‌పోన్ చేసుకునే వెధవలుంటారనుకోను. మాట వరుసకు వున్నారనుకుందాం. అప్పుడు వీడొక్కడే ముందురోజున చేరినవాడవుతాడు. ఒకరోజు సీనియారిటీతో గవర్నమెంట్ డిపార్ట్‌మెంట్స్‌లో ఎన్ని తమాషాలు జరిగాయో మీకు తెలుసా?''

''ఆ మాట కూడా నిజమేనండోయ్'' అంది సరోజ.

''నువ్వు సోమవారం సాయంత్రం వచ్చినాకు గుర్తుచేయి. మరునాడు నేనుకూడా వస్తాను. ఇద్దరం కలిసి వెళదాం. నేను ఆఫీసులో ఓ గంట పర్మిషన్ తీసుకుంటాను'' నారాయణతో చెప్పాడు.

''ఇవాళ్టికి నువ్వుకూడా ఇక్కడే భోజనం చేద్దువుగానీ, ముఖం కడుక్కుని రావయ్యా బాబూ'' అంది సరోజ.

''వద్దత్తమ్మా... నాన్నకింకా విషయం చెప్పలేదు'' అన్నాడు నారాయణ.

''నాన్నకు చెప్పొచ్చులే. భోంచేసి వెళ్ళు'' అన్నాడు చలపతి.

నారాయణ ఇక మాట్లాడకుండా పెరట్లోకి దారితీశాడు.

భోజనం చేస్తున్నంతసేపూ ఉద్యోగం గురించీ, గవర్నమెంట్ డిపార్ట్‌మెంటుల పనితీరు గురించీ, ఉద్యోగుల రాజకీయాలగురించీ చెబుతూ వున్నాడు చలపతి. ఆయన చెప్పేవన్నీ వింటూ మౌనంగా భోజనం ముగించాడు నారాయణ.

''అన్నట్టు చెప్పటం మరిచాను– ఉద్యోగంలో చేరి రోజులు గడుస్తుంటే చదువుమీద శ్రద్ధకుదరదు. నీ పార్ట్‌వన్ పూర్తయి ఎన్నాళ్లయింది?'' అడిగాడు చలపతి.

''ఏడాదిపైగా అయింది మావయ్యా''

''ఈ ఎక్స్‌టర్నల్ ఎగ్జామ్స్ గురించి నాకంతగా తెలియదుగానీ, మళ్ళీ పార్ట్‌వన్‌రాసే అవసరం వుండదనుకుంటాను. నేను తరువాత కనుక్కుని చెబుతానుగానీ సంవత్సరంలోపల పూర్తిచేసెయ్యి. మళ్ళీ ఓసారి వివరంగా ఎప్పుడైనా మాట్లాడుకుందాం''

''మంచిది మావయ్యా''

''గ్రాడ్యుయేషన్ పూర్తి చేసుకుని వుంటే ప్రమోషన్‌లకు మంచిది. తీరా అవసరమైనప్పుడు చదువుదామంటే కుదరదు కదా. మధ్యలో డిపార్ట్‌మెంట్ పరీక్షలున్నప్పుడు మరో ధ్యాస లేకుండా కాన్‌సెంట్రేట్ చేయడానికి క్కూడా వీలుంటుంది''.

''సరేమావయ్యా'' అంటూ ఇక బయలుదేరడానికి ఉపక్రమించాడు నారాయణ.

''నేను రావటంలేదని అమ్మను ఏమీ అనుకోవద్దని చెప్పు. ఈ వారమో పైవారమో వీలు చేసుకుని వస్తాను. శ్రీను కోసం పిల్లలిద్దరూ పలవరిస్తున్నారు. అరుణనో, విజయనో వెంటబెట్టుకుని రమ్మను'' అని చెప్పింది సరోజ.

★ ★ ★

''పెద్దాడికి గవర్నమెంట్ ఉద్యోగం వచ్చిందండీ''

భార్య మాటవిని, నోట్లో పెట్టుకోబోతున్న ముద్ద ఆపాడు వెంకటేశం.

''ఏ ఉద్యోగం''

''గ్రూప్‌ఫోర్ నాన్నా'' చెప్పేశాడు శ్రీను.

''గ్రూప్ ఫ్రోరా ఆర్లోను వెధవా. అప్పుడు కమలపిన్నివాళ్ళొచ్చినప్పుడు ఇంటర్వ్యూకు వెళ్ళాడు చూడు నాన్నా- అదీ'' వివరించింది విజయ.

తాపీగా ముద్ద నోట్లోకి పోనిచ్చాడు వెంకటేశం. ఇంక ఈ ఇంట్లో రెండు పూటలా ఐదువేళ్ళు నోట్లోకి పోతాయన్నమాట. శుభం- అనుకున్నాడు.

''అసలు మధ్యాహ్నం పోస్ట్‌వాడొచ్చి నారాయణే సంతకం పెట్టి తీసుకోవాలనేసరికి నాకు కాళ్ళు చేతులూఆడలేదు. సరిగ్గా మీరటు మిల్లుకుపోయారు. ఇటు పోస్టు వాడొచ్చాడు. వాడిని కాసేపు బతిమాలుకుని, మెయిన్‌రోడ్లో టైప్ ఇన్‌స్టిట్యూట్లో ఇమ్మని చెప్పగా ఏకళనున్నాడో పాపం, అక్కడే ఇచ్చేశాట్ట.మనవాడువెంటనే పరిగెత్తుకుని వచ్చి నాకు సంగతి చెప్పి, మళ్ళీ వెళ్ళిపోయాడు... '' ఆనందంతో జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించసాగింది జగదాంబ.




"మనూళ్ళోనే పోస్టింగు రావటం బలే లక్కు నాన్నా" అన్నాడు సుధాకర్.

"ఏదో దేవుడు చల్లగా చూసి మనకు అనుకూలంగా ఇప్పించాడు" పైకి చూస్తూ అంది జగదాంబ.

"అన్నయ్యొస్తే కంగ్రాట్స్‌చెబుదామనిఇప్పటిదాకా కూర్చుని వెళ్ళాడు మనోహర్. మా ఫ్రెండ్సంతా పార్టీ అడుగుతున్నారు నన్ను"

"పార్టీయా నీ పిండాకూడా, పెద్దాణ్ని చూసైనా బుద్ధి తెచ్చుకోరా. వాడికే స్నేహితులున్నారో ఏమో, ఇంతవరకూ మనింటికి ఎవరైనా వచ్చారా అసలు వాడికోసం. చదువేదో ఏడ్చి నువ్వు కూడా ఓ ఉద్యోగం చూసుకో. అప్పుడు పార్టీలే ఇచ్చుకుంటావో, నీమొహమే ఇచ్చుకుంటావో" సుధాకర్ని కసిరింది తల్లి.

"మనం ఉద్యోగం చేయాలంటే ఈ డిగ్రీలెందుకే. అసలు ఉద్యోగానికి దరఖాస్తు కూడా పెట్టుకోనక్ఖర్లేదు. హుఁ... మన సంగతి నీకేం తెలుసు?" నాటకఫక్కీలో అని లేచి నిలబడ్డాడు షుధాకర్.

"అసలు మనకు ఉద్యోగమే అక్కర్లేదు. కదన్నయ్యా" అంది విజయ.

చెల్లెలి మాటల్లోని వ్యంగ్యం గ్రహించినా గ్రహించనట్టుగా-

"అదీసంగతి... కాస్త అమ్మకు అర్థమయ్యేట్టు వివరించవే" అంటూ సుధాకర్ బైటకెళ్ళిపోయాడు.

అంతలో నారాయణ వచ్చాడు.

"ఇంతసేపు ఇన్స్టూట్లోనే ఉన్నావా?" ఆప్యాయంగా పలకరించాడు వెంకటేశం.

"లేదు నాన్నా.చలపతి మావయ్య దగ్గరికెళ్ళి చెప్పి వస్తున్నాను" బట్టలు మార్చుకుంటూ, లోపల్నుంచే జవాబిచ్చాడు నారాయణ.

"జీతం ఎంతుంటుందీ?"

"ఐదొందల యాభై దాకా వస్తుంది"

"ఎప్పుడు చేరుతున్నావు?"

"వాళ్ళు మంగళవారం నుండి పదిరోజుల్లో చేరమన్నారు. మంగళవారం రోజునే వెళ్ళి జాయినవుతాను" పెరట్లో ముఖం కడుక్కుంటూ బదులిచ్చాడు.

"చూసిచూసి మంగళవారంరోజునేమిట్రా, శుక్రవారం పూట చేరు" మధ్యలో కలిపించుకుంది జగదాంబ.

"సీనియారిటీ పోతుందమ్మా?" అంది విజయ.

"చలపతి మావయ్య కూడా మంగళవారం రోజునే చేరమన్నాడమ్మా" అన్నాడు నారాయణ లోపలికొచ్చి ముఖం తుడుచుకుంటూ.

"వాడో అప్రాచ్యుడు. వాడికిలాంటి విషయాలేం తెలుసనీ. వెధవ సీనియారిటీపోతే పోయిందిగానీ మంగళవారం పూట చేరకురా పెద్దాడా- నా మాట విను"

"నీమొహం... నీకు తెలియని విషయాల్లో నువు కల్పించుకోకు" అని భార్యను కసిరి, నారాయణ వైపు తిరిగాడు వెంకటేశం.

"సుధాగాడికి ఈ టైప్ ఇన్స్టిట్యూట్‌లో వచ్చే అవకాశం ఉందిట్రా. కనీసం ఈ చదువు పూర్తయి, మళ్ళీ కాలేజీకి వెళ్ళేవరకైనా ఆసరాగా ఉంటుంది". అంటూ వంటిల్లంతా కలయజూసి, "అన్నట్టు వీడేడీ" అన్నాడు.

"చిన్నన్నయ్యా, నాన్న పిలుస్తున్నాడు" కేకేశాడు శ్రీను.

"కనీసం లోయర్ ఐనా పాసవకుండా వాడేం నేర్పుతాడని? మనం అడగటం కూడా బావుండదు నాన్నా" అన్నాడు నారాయణ.

తనకు భోజనం వడ్డించబోతున్న తల్లిని వారిస్తూ, తను చలపతి ఇంట్లో తినొచ్చిన విషయం చెప్పి, వంటింట్లోంచి పక్కగదిలోకి నడిచాడు.

అంతలో తమ్ముడి కేకకు సణుక్కుంటూ వచ్చాడు సుధాకర్.

"వీడికసలు ఏదైనా నేర్చుకుని బాగుపడదామన్నధ్యాసే లేదు"- అంది జగదాంబ సుధాకర్ని చూస్తూనే.

"ఏరా... టైపు నేర్చుకుని పాసయి ఉంటే, అన్నయ్య ఉద్యోగం నీకొచ్చేదిగదా. నామాట వినకపోతివి. ఆ రేడియో రిపేరింగైనా సరిగ్గా నేర్చుకుంటున్నావా?"

"మొత్తం నట్లుఊడదీసేవరకూ వచ్చింది నాన్నా మిగతాపని కూడా వచ్చేస్తుందనుకో"




వెక్కిరించింది విజయ.

"నీకెందుకే నోర్మయ్" తలవంచుకుని అన్నాడు సుధాకర్.

"దానికి అక్కర్లేకున్నా నీకైనా ఉందా లేదా" చిరాగ్గా అన్నాడు వెంకటేశం.

"నేర్చుకుంటున్నా నాన్నా మూణ్నాలుగు రోజులకోసారి పోతూనే ఉన్నాను. రోజూ పోయి అక్కడ కూర్చోవటానికి మనం వాళ్ళకు డబ్బులేమీ ఇవ్వటం లేదు కదా" మెల్లిగా అన్నాడు.

"ఆమాటనకురా, నాకు ఒళ్ళు మండుతుంది. టైపుకైతే డబ్బులక్కర్లేదని పెద్దాడంటే, ఇదీ నీస్నేహితుడిదో, తాత చుట్టందో, దీనికీ డబ్బులక్కర్లేదని అన్నది నువ్వే"

"వాడికేవిటి, కాలేజి పూర్తయితేగానీ తెలిసిరాదు ఉద్యోగం సంగతి. రేడియో విప్పి కూచేవాలో, మెడకో రేడియో కట్టుకుని అడుక్కుతినాలో అప్పుడు తెలిసొస్తుంది. నీతోటివాళ్ళంతా పెద్ద కాలేజీకి పోతున్నారు. అదే చదువు మూడు సార్లు తప్పికూచున్నావు- సిగ్గయినా లేదురా నీకు'' కోపంగా అంది జగదాంబ.

కోపంగా తలెగరేస్తూ ముందుగదిలోకి నడిచాడు సుధాకర్.

భర్త భోజనం పూర్తవడంతో జగదాంబ వంటిల్లు సర్దటం మొదలెట్టింది. వెంకటేశం కూడా ముందుగదిలోకి నడిచాడు. విజయ, శ్రీను మధ్యగదిలోకెళ్ళారు. అక్కడ వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చునుంది అరుణ.

"ఒసే... స్వప్నసుందరీ, కాస్త లేవే తల్లీ, పక్కలేసుకోవాలి. అనలే చాలా రాత్రయింది వాళ'' అంది విజయ అరుణను తట్టి లేపుతూ.

అందరూ నిద్రకుపక్రమించారు. శ్రీను తన నుక్కిమంచంలో పడుకుని, కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డాడు.

తనకు ఎక్స్‌కర్షన్‌కు యాభై రూపాయలు కావాలంటేలేవు. పెద్దన్నయ్యకు వచ్చేనెల నుండీ రెండొందల యాభై రూపాయల జీతం ఎక్కువొస్తుందిట. అంటే వచ్చేనెల మళ్ళీ ఎక్స్‌కర్షన్ వచ్చినా, తనకు యాభై రూపాయలు ఇచ్చినా, ఇంట్లో మరో రెండొందలు మిగుల్తాయి. అమ్మో... నెలకు రెండొందలు, అంటే చాలా డబ్బులన్నమాట. అవన్నీ గల్లాపెట్టెలో వేసి, దాచిపెట్టమని అమ్మకు చెప్పాలి.

అమ్మయ్య! ఈ నెలైపోతే తనకు చిన్న దుప్పటి బాధ తీరిపోతుంది. అన్నయ్య కొచ్చే ఎక్కువ జీతంతో ఎంచక్కా మంచి దుప్పటి కొనుక్కోవచ్చు. సంవత్సరం తరువాత అంటే వచ్చే చలికాలంలో రగ్గు, స్వెట్టర్ కొనుక్కోవాలి. స్వెట్టర్ వేసుకుని స్కూల్‌కుపోతే, అందరూ తనచుట్టూ మూగుతారు అబ్బ తన గురించీ, తన స్వెట్టర్ గురించీ అంతా చెప్పుకుంటారు.

అసలీ సుధన్నయ్యను టైప్ నేర్చుకోమంటే నేర్చుకోలేదుగానీ, విజయక్కలాగా టెన్త్ పూర్తవకముందే తనూ మొదలెట్టాలి ఎంచక్కా. లోయర్, హైయర్ రెండూ ఫస్ట్‌క్లాస్‌లో పాసవ్వాలి. తను నేర్చుకునేసరికి టైప్ ఫీజులు చాలా పెరిగిపోతాయి కాబోలు, విజయక్క చెప్పింది మరి. తనను ఇప్పుడే నేర్చుకోనిస్తే బావుణ్ను- ఇలా ఆలోచిస్తూ మెల్లిగా నిద్రలోకి జారుకున్నాడు శ్రీను.




బైటపడ్డ సుధాకర్‌కు ఏమీ తోచలేదు. ఎక్కడికి వెళ్ళటమో తెలియలేదు. అలాగే నడుచుకుంటూ వెళ్ళి సెంటర్‌లో నిలబడ్డాడు. వచ్చే పోయేవాళ్ళనూ, వాహనాలనూ చూస్తున్నాడు. తనలాగా ఖాళీగా నిల్చున్న వాళ్ళు ఎవరూలేరు, బస్‌కోసం వెయిట్ చేస్తున్న వాళ్ళు తప్ప. అందరూ హడావిడిగా అటూ, ఇటూ వెళుతున్నారు. అసలీ మనుషులకు ఇంత తొందర దేనికో అన్ని విషయాల్లోనూ.

తను ఇంటర్ మొదటిసారి తప్పినప్పుడు




ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు, నాలుగు రోజులుతిట్టి ఊరుకున్నారు. అప్పటికి అరుణక్క కూడా ఓసారి తప్పింది కనుక తనను అంతగా పట్టించుకోకుండా వదిలేశారు. కానీ రెండోసారీ, మూడోసారి కూడా తప్పటంతో అందరికీ అలుసైపోయింది. ఖాళీగా ఇంట్లో కూర్చోవటమన్నది అందరికీ లోకువ చేసేస్తూంది. అందుకే రెండోసారి పరీక్ష ఫెయిలైన దగ్గర్నించీ టైప్ నేర్చుకోమని పోరు మొదలెట్టారు. రోజూ ఖచ్చితంగా టైముకుపోయి నేర్చుకోవటం తనవల్లకాదు. అలాగని ఎగవేయటానికీ వీలులేదు. స్వయంగా అన్నయ్యే అక్కడుంటాడు. అందుకే బాగా ఆలోచించి రేడియో మెకానిజం నేర్చుకుంటాననిచెప్పి ఇంట్లో వాళ్ళ నోళ్ళు మూయించగలిగాడు.

రేడియోషాప్ తన ఫ్రెండ్ సురేష్ వాళ్ళదే కనుక డబ్బులడిగే ప్రశ్నేలేదు నేర్పటానికి ఎటొచ్చీ సురేష్ తండ్రి నాగరత్నయ్యే, మహానుభావుడు, ఆ రేడియో మెకానిజం నేర్చుకుంటే ఏదో లక్షలూ, కోట్లూ సంపాదించవచ్చునన్నంత ఇదిగా చెబుతుంటాడు. తనెటూ డబ్బులివ్వని బేరమే కనుక రోజూ పోకపోతే అదే మహాభాగ్యమన్నట్టు సంతోషపడతాడని తనుకున్నాడు కానీ ముసలినక్క తనకు నిజంగానే నేర్పించాలని చూస్తున్నాడు. అదో పెద్ద తలనొప్పయింది. వరుసగా రెండ్రోజులు వెళ్ళేసరికి బోరు కొడుతుంది. ఇక చదువు పూర్తిచేసి కాలేజీకి వెళ్ళటమంటే సరేసరి. వెధవ ఇండియా. హాయిగా ఏ అమెరికాలోనో, ఏ దుబాయ్‌లోనో ఏ మిలియనీర్ ఇంట్లోనో పుట్టివుంటే హిప్పీలాగా దేశదేశాలూ తిరిగివచ్చే జన్మ, చివరకిలా అయిపోయింది- ఆలోచిస్తూ నడక సాగించాడు.

ఆ క్షణంలోనే కాదు, ప్రతి క్షణంలోనూ అది గమ్యంలేని నడకే. అదుపులేని మనసు. కడలి అల- ఎక్కడికిపోతాయో, ఎందుకు పోతాయే? - ఆ ఆవేశమూ, శక్తీ- వృథా.

ఎక్కడో మొదలైన ఆ నడక సాగిసాగి ఓచోట అంతమయింది. ఆచోటు సుధాకర్ స్నేహితుడు మనోహర్ ఇల్లు. సుధాకర్ పిలవగానే చదువుకుంటున్నవాడు లేచొచ్చాడు.



"ఏరోయ్... సినిమాకా?"

"మన దరిద్రపు మొహానికి అనుకున్నప్పుడు సినిమాకు వెళ్ళే అదృష్టం కూడానా?"

"నీమొహానికేంగానీ లక్షరూపాయలిచ్చినా అయ్యో పదిలక్షలిస్తే బావుణ్ణని ఏడుస్తావ్" అన్నాడు మనోహర్ లోపలికి దారితీస్తూ.

ఫ్లాస్కులోంచి టీ పోసిచ్చాడు.

"ఇంకా టైముందిలే సినిమాకు. పావు గంటలో ఈ ఫిగర్ గీయడం అయిపోతుంది. ఏం సినిమాకు వెళ్ళాలో ఆలోచించు" అన్నాడు ప్రాక్టికల్ బుక్‌లో ఫిగర్‌గీస్తూ.

"నీకేంరా హాయిగా చదువుకుంటున్నావు. స్వంత రూం, నైట్‌డ్రెస్, ఫ్లాస్కు, దాంట్లో టీ, టేబుల్ ల్యాంప్- ఇవన్నీ వుంటే నీకు అట్లాగే మాట్లాడబుద్దేస్తుంది. లేకుంటే నువ్వూ నాలాగే అనేవాడివి"

"ఒరేయ్... చదువుకోవడానికి ఇవన్నీ కాదురా ముఖ్యం. పుస్తకాలు చేతిలోవుండి, మనసు పుస్తకాలమీదుండాలి అంతే. అయినా నిన్ను నా రూంకొచ్చి చదువుకోమని ఎన్నిసార్లు చెప్పలేదు నేను"

"సర్లేరా... నీలాంటివాడికి చెప్పినా అర్థంకాదు ఇలాంటివన్నీ. లేనివాడికే తెలుస్తుంది బాధ" నిట్టూర్చాడు సుధాకర్.

"ఒరే ఫూల్... నేనేదో నోట్లో బంగారు చెమ్చాతో పుట్టినట్టూ, మా నాన్నేదో లక్షాధికారి అయినట్టూ మాట్లాడతావేంరా. మా తాతయ్య కాలంలో కట్టించిన ఇల్లు కనుక కాస్త విశాలంగా వుంది. నేను ఒక్కణ్ణే కొడుకుని కనుక ఓ రూం నాకు చదువుకోవటానికి వుంది. ఇవి లేకున్నా చదువుకోవచ్చు రా నాన్నా"

"మరి యం.బి.బి.యస్. సంగతేమిటంటావ్? అది కూడా మామూలు విషయమేనా"

"కాదు. సరే... మరి నువ్వు గ్రాడ్యుయేషన్ ఏదో ఓ డిగ్రీ అయినా చదువగలవు కదా: మరి ఆ విషయం ఏమంటావ్? సగం నీళ్ళున్న గ్లాసునిచూసి, సగం ఖాళీ వుందనే రకంరా నువ్వు. దాంతో ఏం సాధిస్తావు చెప్పు"

"ఒరే డబుల్ ఫూల్... సగం ఖాళీ వుందని గుర్తించినప్పుడే కదా, దాన్ని నింపాలనే ఆలోచన వచ్చేది" ఎక్కడో విన్నమాటను తెలివిగా

తిప్పికొట్టాననుకుంటూ అన్నాడు సుధాకర్ సిగరెట్ అంటిస్తూ.

"చాల్లేరా సినిమా డైలాగులు. నగం ఖాళీ గురించి ఏడవటంతోనే నీ టైమంతా సరిపోతుంది, ఇంకా నింపటందాకానా..." అంటూ సుధాకర్ అంటించిన సిగరెట్‌కేసి చూసి- "ఒరేయ్ వెధవా ఇప్పుడు మా అమ్మగానీ ఇటొచ్చిందనుకో, నేను రాత్రిపూట తాగే సిగరెట్లకూడా ఎసరొస్తుందిరా నాయనా. కాస్త దాన్ని బయట తగలెట్టు. కావాలంటే నేను ఇంకోసిగరెట్ కొనిస్తాగానీ" అన్నాడు మనోహర్ తన సరంజామా అంతా సర్దిపెట్టి, లేచి నిలబడుతూ.

గబగబా నాలుగు దమ్ములులాగి సిగరెట్ బైట పడేశాడు సుధాకర్.

బట్టలు మార్చుకుంటూ-

"అబ్బ... ఈ ఫిగర్స్ గీయటం నావల్లకావటంలేదురా బాబూ. సాయంత్రం నుంచీ కూచుంటే రెండు ఫిగర్స్ కూడా పూర్తవలేదు. ఇలా లాభంలేదుకానీ ఇక విజయనే ఆశ్రయించాలి" అన్నాడు మనోహర్.

"అది నీకైనా సరే... ఖచ్చితంగా డబ్బులు వసూలు చేస్తుంది. నేను గీసి పెడతానులేరా తీరిక చూసుకుని" ఎక్కడ సరేనంటాడోనని లోలోపల ఏడుస్తూ అన్నాడు సుధాకర్.

"నిన్ను నమ్ముకుంటే ఇక ఇంతే సంగతులు. నా ఫైనలియర్ పూర్తయిపోతుంది. నీకు రేడియో విప్పే పని వున్నప్పుడు చెబుతాను గానీ ఇది మాత్రం విజయకే"

విజయలాగా చక్కగా డ్రాయింగ్స్ వేయటం చేతనైతే, ఇలా మెడికోలకు గీసిచ్చి డబ్బులు సంపాదించుకున్నా బావుండేది- అనుకున్నాడు.

మనోహర్ తయారవటంచూసి తనూ లేచాడు.

★ ★ ★

"చిన్నన్నయ్య లేడన్నయ్యా" అన్నాడు శ్రీను, గుమ్మంలో మనోహర్‌ని చూస్తూనే.

"వాడు లేకపోతే పోనీలే. ఇంతకూ ఏమిటంత దీక్షగా కూచుని రాస్తున్నావ్?" అన్నాడు మనోహర్ లోపలికొస్తూ.

"సైన్స్ నోట్స్‌లో బొమ్మలన్నయ్యా! సుధన్నయ్య వచ్చేటప్పటికల్లా కొంచెం నాకు గీసిపెట్టవా అన్నయ్యా" బతిమాలుతున్నట్టు అన్నాడు శ్రీను.

అంతలో లోపల్నించి విజయొచ్చింది-

"ఎవర్రా శ్రీనూ వచ్చింది?"- అంటూ.

మనోహర్‌ని చూసి, పలకరించిన తరువాత సుధాకర్ గురించి ఆరా తీసి, ఒకటి రెండు మాటలైనాక అసలు విషయం చెప్పాడు మనోహర్.

"ఓ వారం రోజులు అర్జెంటుగా చదువుకోవాల్సినదేమైనా వుందా విజయా?" అడిగాడు మనోహర్, ప్రస్తావనగా.

"ఏమిటి సంగతి... ఫిగర్స్ గీయటమేనా?" నవ్వుతూ అడిగింది విజయ.

"సరేలే... నువ్వు నా ఫిగర్స్ గీసిపెడతావని నేననుకుంటూ వుంటే, నువ్వే విజయక్క దగ్గరికొచ్చావా?" నీరసంగా అన్నాడు శ్రీను.

"నీ ఫిగర్సెంతసేపు శ్రీనూ, అయిదు నిమిషాల్లో గీసిస్తాను. మావి అలా కాదుకదా" అనునయించాడు మనోహర్.

"నీ ఫిగర్సేంట్రా గాడిదా? నువ్వేమైనా మెడికోననుకుంటున్నావా- హాయిగా కూచుని, మరొకరితో పనిచేయించుకోవటానికి" శ్రీనుని కసిరింది విజయ.

"మనోహరన్నయ్య వేసిస్తానంటే మధ్యలో నీకెందుకు?" కోపంగా అన్నాడు శ్రీను.

"ఇది మరీ అన్యాయం విజయా! నేనేదో సోమరిపోతునన్నట్టు చెబుతున్నావ్"

"నిన్ను నేనెందుకంటాను స్వామీ! సరేగాని... ఒరే శ్రీనూ- "హోమ్ వర్కంతా గమ్మున కూచుని చేసేసి, పరీక్షలనాటికి తయారుగా వుండాలి. అంతేగానీ, మనోహరన్నయ్యా బొమ్మలు గీసిపెట్టు, విజయక్కా లెక్కలు చేసిపెట్టు అంటూ పిచ్చి వేషాలు వేసావో ప్రైవేట్ చెప్పేస్తాను గుండు మీద. అదిగో మళ్ళీ నోరు తెరుస్తున్నావ్... మూసేయ్ ముందు. అర్థంకానివి ఏవైనా వుంటే అడగాలి. అంతేగానీ ఇలాంటి వేషాలు వేయొద్దు" అని, మనోహర్ వైపు తిరిగి "నువ్వు నాకు తెలియకుండా వాడికిలాంటి అలవాట్లు చేసావో జాగ్రత్త. నా




సంగతి తెలుసుకదా! నువ్వు లోపలికి రా. అమ్మా, అరుణక్క వంటచేస్తున్నారు. అక్కడ మాట్లాడుకుందాం'' అంది విజయ, లోపలికి నడుస్తూ.

విజయ మాటలకు లోలోపల నవ్వుకుంటూ, పైకి మాత్రం భయపడినట్టు నటించాడు. శ్రీనువైపు తాను నిస్సహాయుణ్ణన్నట్టు చూసి, నిట్టూర్చి, విజయ వెనకాల లోపలికి నడిచాడు మనోహర్. అరుణతోనూ, జగదాంబతోనూ కాస్సేపు మాట్లాడి, మళ్ళీ తన విషయం పైకి తీశాడు మనోహర్--

''ముందు నా సంగతి చెప్పు విజయా... నీకు టైముందా లేదా?''

''డబ్బులొచ్చే పనుండగా వేరే పనేముంది? ఇప్పుడెటూ ఎగ్జామ్స్ ఏవీ లేవుకూడానూ'' తేలిగ్గా ఒప్పుకుంది విజయ.

మనోహర్ ఫైల్లోంచి ఫిగర్స్, రికార్డు షీట్లూ తీస్తుండగా మళ్ళీ అంది--

''అప్పుడెవరో ఓ జిడ్డు మహానుభావుడిలాగా మొత్తం గీయటం అయినాక గీచి, బేరాలు పెడితే ఒరిజినల్స్‌తో సహా చింపి కుప్పపెడతాను- జాగ్రత్త. అయినా మీకిదేం రోగం, ప్రొఫెషనల్స్‌కైతే పది రూపాయలిస్తారు, మాకు ఎనిమిదివ్వటానికే గింజుకుంటారు?''

''అబ్బా... ఆ ఎబ్రాసిగాడి సంగతి వదిలెయ్ విజయా! నా ఫ్రెండ్స్ రికార్డులు కూడా నేనే తీసుకొచ్చి, నేనే డబ్బులిచ్చానుగానీ, ఎవరినైనా మనింటికి తీసుకొచ్చానా? వాడు నా ఫ్రెండ్‌నని సుధాగాడికి చెబితే వాడు నమ్మి, ఆ పని నీకప్పగించాడు కానీ, మధ్యలో నా తప్పేమైనా వుందా?'' బతిమాలుతున్నట్టుగా వివరించాడు మనోహర్.

''అది కరెక్టే అనుకో, మరి రెండ్రూపాయల సంగతేమిటి'' మళ్ళీ సాగదీసింది విజయ.

''అది కాదు విజయా... ప్రొఫెషనల్స్ గురించి అందరికీ తెలుసు. వాళ్ళే కాలేజీకి వచ్చి అడుగుతుంటారు కూడా. వాళ్ళను కాదని మనకే ఇవ్వాలంటే రెండ్రూపాయలు తక్కువైతే అదో అట్రాక్షన్... అవునా! అయిదు ఫిగర్స్ అయితే పదిరూపాయలు మిగులుతాయికదా. ఓ సినిమాకెళ్ళొచ్చు హాయిగా- అన్న ఫీలింగొకటి వుంటుంది కదా వాళ్ళకు. అలాగైనా కనీసం నా ఫ్రెండ్సంతా నా దగ్గరకొస్తారు... వస్తున్నారు. కావాలంటే నా ఫిగర్స్‌కు తీసుకో పది రూపాయలు'' వివరించాడు మనోహర్.

''అదే ఒద్దన్నాను. నీకేమైనా డబ్బులెక్కువున్నాయా వాళ్ళకన్నా లేక నేనేమైనా ఆశపోతులాగా కనిపిస్తున్నానా? ఏదో ఉండబట్టలేక అడిగాను కానీ నీ పుణ్యమా అని నేనూ, అరుణక్కా నెలనెలా కాస్తోకూస్తో పాకెట్‌మనీ సంపాదించుకుంటున్నాంకదా''

''అసలు నా ఫిగర్స్‌కు కన్సెషనివ్వాలి నువ్వు'' అన్నాడు మనోహర్.

''ఇదిగో కన్సెషన్లు, గిన్సెషన్లు పెట్టావంటే మెదడు మోకాళ్ళలో గీసిస్తాను- జాగ్రత్త''

''పోన్లే మనోహర్... నీ ఫిగర్స్ నేను గీసిస్తాను. నీ ఇష్టమొచ్చినంత కన్సెషన్ తీసుకో'' అంది అరుణ.

కొంచెం ఇబ్బందిగా మొహంపెట్టాడు మనోహర్. అందుకు రెండు కారణాలు- అరుణ తనకొచ్చే డబ్బులన్నీ తనే ఖర్చుపెడుతుంది విజయ అలాకాదు, ఇంట్లోకి ఖర్చుపెడుతుంది. కనుక విజయ గీసే బొమ్మలవల్ల ఆ కుటుంబానికి అంతో ఇంతో చేదోడు వుంటుంది. ఈ మాట తనకు తెలిసినా పైకన లేడుతను. ఇక మరొకటి- విజయైతే అన్నరోజుకు ఖచ్చితంగా గీసి పెడుతుంది. అంతేకాక చాలా నీట్‌గా వుంటుంది విజయ వర్క్.

''నా ఫిగర్స్ మాత్రం విజయనే గీయనీయక్కా'' మొహమాటంగా అన్నాడు మనోహర్.

''అక్కా అక్కా అంటూ మస్కాకొట్టడమే కానీ, నీకు విజయపట్ల మహాపక్షపాతం''

''అబ్బ...! నన్ను వదిలేయ్ అక్కా అయినా అసలు మీరందరూ విజయతో పోట్లాడే వాళ్ళే కదా! తనకు నేనొక్కణ్ణయినా సపోర్ట్ వుండొద్దా'' అన్నాడు మనోహర్ మాట మారుస్తూ.

''సరేలే... నీ సంగతే చెప్పాలి. మా విషయాల్లో కల్పించుకున్నంత వరకే మేం దాంతో పోట్లాడతాం. అసలు అందరికంటే ఎక్కువ దాన్నేడిపించేది నువ్వే కదా'' అంది అరుణ.

''మీ ఇద్దరూ సోదికాస్త ఆపేయండి. స్వా

మీ- నువ్వా ఫిగర్సేవో నా ముఖానకొట్టి, ఎప్పటి వరకు కావాలో చెప్పు'' అంది విజయ విసుగ్గా.

మొత్తం ఫిగర్స్ తీసి, మనోహర్ విజయకు వాటిగురించి వివరిస్తుండగా సుధాకర్ వచ్చాడు. అన్నీ విజయకు అప్పగించేసి, ఎప్పుడు కావాలో చెప్పి, బయలుదేరగానే మనోహర్‌తో బైటకు దారితీశాడు సుధాకర్.

మనోహర్ ఇచ్చిన రికార్డ్‌షీట్స్ భద్రంగా పెట్టి, ఫిగర్స్ పరిశీలించసాగింది విజయ.

కాలేజీ విద్యార్థులందరికీ రికార్డ్స్ ఫిగరింగ్‌కు మార్కులుంటాయి. అయితే సాధారణంగా బి.ఇడి చేసేవాళ్ళూ, మెడిసన్ చదువుతున్నవాళ్ళూ రికార్డ్సపట్ల ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు. సహజంగానే అందరికీ నీట్‌గా బొమ్మలు గీయటంరాదు. అలాంటివాళ్ళలో కొందరు ఆర్టిస్టులను ఆశ్రయిస్తుంటారు. ఇందులోనూ కమర్షియల్ డ్రాయింగ్‌కాక కేవలం ఈ ఫిగర్స్ మాత్రమే గీసే వాళ్ళు కొందరుంటారు. వీళ్ళే ప్రొఫెషనల్స్. దాదాపుగా ఈ ప్రొఫెషనల్స్ జీవనాధారం ఇదే. ఇలాంటివాళ్ళంతా ఆయా కాలేజీల్లోని స్టాఫ్‌లో కొందర్ని మంచిచేసుకుని, వాళ్ల ద్వారా విద్యార్థులకు పరిచయమై వారానికోసారో, నాల్రోజులకోసారో ఓ పద్ధతిప్రకారం కాలేజీకి వెళ్ళి, విద్యార్థులందరి దగ్గరా పని సేకరించుకుని, అవసరాన్నిబట్టి పూర్తిచేసి ఇస్తూవుంటారు. వీళ్లలో కొందరు ఎంత ఎక్స్‌పర్ట్లుంటారంటే, తీరిక సమయంలో ఆయా డిగ్రీకి, ఆయా సంవత్సరం సిలబస్‌ని బట్టి గీయవలసిన ఫిగర్స్ గీసిపెట్టుకుంటారు. అవసరమైన వాళ్ళు అడగ్గానే, ఫైల్లోంచి తీసి ఇచ్చి, డబ్బులు తీసుకోవటమే. ఏ ఫిగర్ ఎలా గీయాలి, ఎలాగీస్తే ఎక్కువ మార్కులొస్తాయనే విషయంలో, ఆయా ప్రొఫెసర్లకున్నంత అవగాహన వీరికుంటుంది.

ఇదే బి.ఇడి చేసేవాళ్ళకు ఫిగర్స్‌తోపాటు కొన్ని బోధనాంశాల మోడల్స్ తయారు చేయాల్సి ఉంటుంది. పూరి గుడిసె, అంబులెన్సు, నాగలి, రాకెట్- ఇలాంటి మోడల్స్ ఎలా తయారుచేయాలో కూడా కొందరు విద్యార్థులకు తెలియదు. అవసరమైన సామగ్రి ఎక్కడ దొరుకుతుందో తెలియదు. అవన్నీ తెలునుకుని ఊరంతా తిరిగి, అవసరమైనవన్నీ సమకూర్చుకుని, ఆ మోడల్ తయారుచేయాలంటే ప్రొఫెషనల్‌కు ఇచ్చే డబ్బుకన్నా ఎక్కువ ఖర్చవటమే కాకుండా, చాలా సమయం వృధా అవుతుంది. ఎంతో శ్రమపడాల్సి వస్తుంది. అంత శ్రమపడినా అందులో పరిపూర్ణత ఉండదు. మార్కులు వేసే ప్రొఫెసర్లు విద్యార్థి పడిన శ్రమను గుర్తించరు. అదే ప్రొఫెషనల్‌కు పురమాయిస్తే, అవసరమైనరోజుకల్లా తయారుచేసి ఇచ్చేస్తాడు. అది బాగుండకపోవటమనే ప్రశ్నే ఉండదు. ఇక మరికొందరైతే, క్రితం సంవత్సరం విద్యార్థులు తయారుచేసిన మోడల్స్‌ని, స్టాఫ్‌కి తృణమో ఫణమో ఇచ్చి, దానిమీద పాత విద్యార్థి పేరున్న మేరకు తొలగించి, కొత్తవాళ్ళకు అందిస్తుంటారు. ఇవన్నీ తెలిసినా ప్రొఫెసర్లెవరూ పట్టించుకోరు. ఎంత బాగుందో చూసి, మార్కులేయటం వరకే వాళ్ళపని. అందుకే మెడిసన్ చదివేవాళ్ళు కూడా చాలామంది, గంటలకొద్దీ టైం ఫిగర్స్ గీయటంలో వృధాచేయటంకన్నా, పదిరూపాయలు పడేస్తే సరిపోతుందని సరిపెట్టుకుంటుంటారు. అలా మిగిలిన సమయం చదువుకోటానికి ఉపయోగించుకుంటే, చేసిన ఖర్చు గురించి బాధ కూడా అనిపించదు.

మెడిసిన్‌లో చేరిన మొదటి సంవత్సరంలోనే ఈ విషయం మనోహర్‌కు తెలిసింది. అయితే రెండో సంవత్సరంలో టైం మిగుల్చుకోవచ్చుననే అభిప్రాయంతో ముందు ఎవరికో అప్పగించాడు తనపని. రెండోసారి గుర్తొచ్చింది మనోహర్‌కు. విజయ, అరుణలు తమ రికార్డ్స్ చక్కగా గీసుకునేవారని. ఆ ఆలోచన రావటంతో తిన్నగా విజయ దగ్గరికెళ్ళి, విషయం వివరించి, తీరికున్నప్పుడల్లా ఇలా గీయటం ద్వారా తృణమో ఫణమో సంపాదించుకోవచ్చునని చెప్పాడు. ముందు భయపడింది విజయ. కానీ మనోహర్ దగ్గరుండి గీయించటంతో కాస్త ధైర్యం వచ్చింది. మరోసారి అతనిచ్చిన ఫిగర్స్ కొన్ని తను గీసి, మరికొన్ని అరుణకిచ్చింది. మూడోసారి మనోహర్ తన ఫ్రెండ్స్ ఫిగర్స్ తీసుకొచ్చాడు. ఇక అప్పట్నించీ విజయకూ, అరుణకూ అదో వ్యాపకమైపోయింది. అరుణ తన సినిమాల ఖర్చులకూ, మేకప్ ఖర్చులకూ ఇంట్లో అడిగే అవసరం తప్పుతుందనే ఉద్దేశంతో తప్ప సిన్సియర్‌గా గీయదు. పైగా




ఇలాంటి చిన్నచిన్న మొత్తాలు సంపాదించ టంవల్ల అరుణకు అంతగా ఆసక్తి లేదు. అంచేత ఎక్కువగా బద్ధకిస్తుంటుంది. అందు కే విజయకూడా అరుణ గీయగలిగినన్ని మాత్రమే ఆమెకిస్తుంది. ఇక తన చదువుకూ, ఇంట్లో పనులకూ ఆటంకం కలగకుండా యధాశక్తి గీస్తుంది.

అరుణ తను సంపాదించిన డబ్బులు ఇంట్లో ఇవ్వదు. ఇవ్వమని తను అడిగితే, ఆ గీయటమైనా మానేస్తుంది కానీ ఇవ్వదని తల్లికి తెలుసు. పైగా దీనిమూలంగా సినిమాలకూ, షికార్లకూ డబ్బులడగటం తగ్గిపోయింది కనుక అదే పదివేలని ఊరుకుంటుంది జగ దాంబ. విజయ మాత్రం తనకొచ్చే డబ్బులన్నీ ఇంట్లో అవసరాలకే ఖర్చుపెట్టేస్తుంది. తన సొంత ఖర్చంటూ అసలు దేనికీ ఒక్కపైసా కూడా ఖర్చుపెట్టుకోదు. అంచేత విజయను కూడా వివరాలడగదు తల్లి. మొత్తానికి ఇంట్లో పెద్దల ప్రమేయం లేకుండానే ఏడాదిన్నరగా ఈపని నడుస్తూ ఉంది.

మనోహర్ ఇచ్చిన ఎనిమిది ఫిగర్స్‌లోంచి, కాస్త సులువుగా ఉన్నాయనుకున్న రెండు ఫిగర్స్ తీసి అరుణకిచ్చింది విజయ-

"తల్లీ... ఆదివారం సాయంత్రంనాటికల్లా కావాలన్నాడు మనోహర్. సోమవారం సబ్మిట్ చేయాలట. నీవల్ల కాకపోతే శనివారం సాయంత్రమే కాస్త నాతో ఆ సంగతి ఏడుప్ గాని, అట్టేపెట్టి కూచోకు " అంది.

"పోవే... నీది మరీ చాదస్తం. ఆదివారం సాయంత్రం అంటే ఇంకా నాలుగు రోజు లుంది. రెండు ఫిగర్స్- ఎంత, గంటలో గీసి పారేయనూ" తేలిగ్గా తీసేసింది అరుణ.

"అదే నేననేది. గంటలో గీస్తే పారేయటాని కి తప్ప రికార్డ్సుకు పనికిరావు. పైగా నీ గంటకు ఇరవైనాలుగురోజులని నాకు తెలును. గానీ కాస్త పూర్తిచేసేయ్. అన్నట్టు మరో సంగతి, వచ్చేవారం నాలుగు కొత్త సినిమాలు రిలీజవు తున్నాయ్. ఆ విషయం కూడా దృష్టిలో పెట్టు కో" అంది అరుణను ఉడికిస్తూ, నవ్వుతూ.

"నువ్వు నా తరవాత పుట్టావ్ గనుక బతికి పోయానుగానీ, నాకన్నా పెద్దదానివ య్యుంటేనా, నన్ను చంపుకు తినేదానివే" అంటూ చెల్లెలి నెత్తిన మొట్టికాయ వేయబో యింది అరుణ.

మొట్టికాయ తప్పించుకుని,

"పోవే సినిమాపక్షీ" అంటూ, లోపలికి పారి పోయింది విజయ.

★ ★ ★

"ఏవండీ... ఇల్లు అద్దెకుందాండీ"

అడిగిన కుర్రాణ్ని ఓసారి ఎగాదిగా చూసి,

"ఉంది" అంది. ఆ ఇల్లుగలావిడ.

"ఒకసారి ఇల్లు చూపిస్తారాండీ?" వినయం ఒలకబోస్తూ అన్నాడు ఆ యువకుడు.

"ఏమయ్యా... వచ్చిందగ్గర్నించీ చూస్తున్నా ను, 'ఇల్లు', 'ఇల్లు' అని అడుగుతున్నావు. నీకు ఎంత పెద్ద ఇల్లు కావాలి, ఎంత మందుంటారు?" దబాయించిందావిడ.

"పొరపాటండీ... నేను ఒక్కణ్ణేనండీ! నాక్కా వలసింది ఒకే ఒక్క చిన్నగదండీ. కాకపోతే లాడ్జింగులో అడిగినట్టు 'గదుందాండీ' అనడి గితే బాగోదని, 'ఇల్లుందాండీ' అని అన్నానన్న మాట. అంతేనండీ"

అతనివైపోసారి ఉరిమిచూసి, లోపలికెళ్ళి తాళం చెవి తీసుకొచ్చి, మిద్దెమీదున్న గది చూపించిందావిడ.

ఓసారి గదంతా కలియచూసి,

"అద్దె ఎంతండీ?" అన్నాడు.

"తొంభై రూపాయలు. కరెంటుకు పదిరూ పాయలిచ్చుకోవాలి. రాత్రి తొమ్మిదిలోపున ఇంటికొచ్చేయాలి. తొమ్మిదిన్నర లోపున లైటా ర్పేయాలి. ఇష్టమైతే నాలుగునెలల అద్దె అడ్వాన్సుగా ఇచ్చివెళ్ళు. ఇల్లు కడిగించి పెడ తాను" గడగడా చెప్పేసిందావిడ.

"అంటే, నెలకు వందన్నమాట. ఏమండీ... నేను చిన్నప్పట్నించీ లెక్కల్లో చాలా పూర్‌వీకవ నండీ! మీరేమీ అనుకోకుంటే వందంటే ఒకటి పక్కన ఎన్ని సున్నాలుంటాయండీ" అమాయ కంగా అన్నాడు.

"ఏమయ్యా- వేళాకోళంగా వుందా? నువ్వ సలు గది అవసరముండే వచ్చావా?"

"అబ్బెబ్బే... మీరలా కోపగించుకోకూడ దండీ. నేనసలు ముందుగా నాకే అవసరమని

గది చూశానుగానండీ, టాటాగారికో, బిర్లాగారికో ఓ చిన్నగది అవసరమున్నప్పుడు మీ అడ్రస్ చెబుతానండీ తప్పకుండా. మరి వెళ్ళొస్తా నండీ... ఈలోగా నాకోసం ఓ గది చూసుకోవాలి మరి'' అంటూ గబగబా మెట్లు దిగటం ప్రారంభించాడు, వెనకనించి ఆవిడ విప్పిన పురాణం వినిపిస్తుంటే నవ్వుకున్నాడు.

మరి నాలుగు వీధులు తిరిగాడతను. 'టూలెట్' బోర్డులున్న దగ్గర అడుగుతూ, లేనిదగ్గర ఏమైనా ఖాళీలున్నాయోమోనని ఆరాతీస్తూ తిరుగుతూనే వున్నాడు. చాలావరకు చిన్నగదులు ఖాళీగా వున్నవి కనిపించలేదు. కనిపించినచోట అద్దె కుదరకపోవటం, కరెంటు వాడుకో వద్దనటం కొన్నిచోట్ల కులాలపట్టింపు- ఇలా వుంది పరిస్థితి.

దాదాపు సాయంత్రం ఐదు కావస్తూండగా మళ్ళీ ఓ ఇరానీ టీ తాగి, ఈసారి బైటకొచ్చి సిగరెట్ వెలిగించుకుని, పొగపీలుస్తూ, వదులుతూ, వీధులవెంట వేగంగా నడకసాగించాడు. అరగంటవరకూ కనీసం ఒక్క బోర్డుకూడా కనిపించలేదు. ఆరైపోతే మళ్ళీ అదోసమస్య. ''ఏమయ్యా... ఇల్లు వెతకటానికి వేళాపాళా లేదా? ఇంత రాత్రిపూట కాకపోతే, పొద్దున వచ్చి అడగొచ్చుకదా?'' అంటారు ఏదో సంతర్పణలో అన్నంకోసం వెళ్ళినవాణ్ని చూసినట్టు చూస్తూ. ఆ అనుభవం మొదటిరోజునే ఎదురవటంతో ఆరు, ఆరున్నరమధ్య తన అన్వేషణ ముగించేయటం అలవాటుచేసుకున్నాడు.

ఇలా ఇంకా ఎన్నిరోజులు తిరగాలి. ఎన్నిరోజులు ప్లాట్‌ఫాంమీద పడుకోవాలి. ఎన్నిరోజులు రైల్వేస్టేషన్ క్లోక్‌రూంలో తన సూట్‌కేస్ వుండనిమ్మని అక్కడి క్లర్కుని బతిమాలాలి. ప్లాట్‌ఫాంమీద పడుకోవటం, అయిదింటికే లేచి, క్లోక్‌రూంలో సూట్‌కేస్ తీసుకుని, ''మళ్ళీ వస్తావా నాయనా'' అన్నట్టు చూసే ఆ క్లర్కు ముఖంకేసి చూసి, చిరునవ్వు నవ్వి అది తీసుకుని బాత్‌రూంలోకెళ్ళటం, స్నానం అదీ కానిచ్చి, మళ్ళీ క్లోక్‌రూంలో సూట్‌కేస్ పెట్టుకుని, టికెట్ లేకుండా తీసుకుంటున్నందుకు క్లర్కుని బతిమాలటం ఇలాగే గడిచిపోతుంది. ముందురోజున అర్థరూపాయి ఎక్కువియ్యటంతో ఆ క్లర్కు ముఖం కాస్త వికసించింది. కానీ ఈరోజు కూడా ఇయ్యాల్సొచ్చింది. ఆ విషయం అటుంచితే స్నానంచేసి తుడుచుకున్న టవల్ అదే తడితో సూట్‌కేస్‌లోపెట్టటంతో గబ్బువాసన భరించలేక ఈరోజు దాన్ని ఆరపెడితే గంటన్నరయింది. అంతవరకూ సరే. ఉన్న మూడు జతలబట్టల్లో ఇది రెండోది. మరునటి రోజుక్కూడా పనికొస్తుంది. మూడో జత ఓ రెండు రోజులొస్తుంది. ఆ తరువాత ఎలాగ? డ్రైక్లీనింగ్‌కి వేయాలంటే చాలా ఖర్చు. మామూలు లాండ్రీలో వేద్దామంటే వాడు మూడురోజులకిస్తాడు గనుక ఈరోజైనా వేస్తే మూడో జత మాసేనాటికి అది అందుతుంది. కానీ వాడు ఇవ్వకపోతే... తన ముఖమే తెలీదంటే.. పోయందంటే... అప్పుడేం చేయాలి... మనసొప్పుకోవటం లేదు. బట్టలు ఎక్కడ ఉతుక్కోవాలనేది ఒక సమస్యైతే, బకెట్‌కూడా లేకుండా ఎలా వుతకాలనేది మరో సమస్య. ఆ తరువాత వాటిని ఎక్కడ ఆరేసుకోవాలి- అదో సమస్య. మూడురోజుల్లో ఇల్లు దొరక్కపోతే ఇవన్నీ అటుంచి ఈ హొటల్ భోజనానికి అవుతున్న ఖర్చొకటి. వంటచేసుకుంటే అందులో సగంకూడా ఖర్చవదు. అక్కడికీ ధైర్యంచేసి, ఆ హొటల్లో ముప్పై టికెట్లుకొన్నాడు కనుక ఖర్చు కొంత తగ్గినట్టే. మళ్ళీ పది, పదకొండురోజులకు మరో సెట్టు కొనాలి. గదిదొరకటమే ఇంత సమస్యైతే తను రచనలుచేసేదెప్పుడు, ఎడిటర్లని కలిసి మాట్లాడేదెప్పుడు, అవన్నీ పబ్లిష్ అయి, తనకు పారితోషికాలు అందేనాటికి తన దగ్గరున్న డబ్బు సరిపోతుందా- ఆలోచనలతోపాటు సాగిపోతున్నాడు, చురుగ్గా వీధులను పరిశీలిస్తూ.

ఓచోట వీధిమలుపులో కిళ్ళీ కొట్టుదగ్గర ముగ్గురు నలుగురు కుర్రాళ్ళు నిలబడి సిగరెట్లు పీలుస్తున్నారు అటూ ఇటూ చూస్తూ. వాళ్ళంతా దాదాపు తన వయసువాళ్ళే కావడంతో దగ్గరికెళ్ళి పలకరించాడు గిరీశం.

''బ్రదర్... ఇక్కడ ఓ గదేమైనా అద్దెకు దొరుకుతుందా?''

''గదా... ఏమో తెలీదు గురూ'' అన్నాడు ఒకతను.

''ఒరే... పక్కవీధిలో ఇస్త్రీషాప్‌పక్కన ఏదో కడుతున్నాడు కదరా, ఈపాటికి ఇచ్చేసి

 

వుంటారా?" మరొకతను తనపక్కవాణ్ని అడిగాడు.

"అవున్రేయ్... ఇచ్చారో లేదో మనకు తెలీదు. కానీ చెబితే పోలా"

ఇలా మాట్లాడుకుని వాళ్ళంతా పక్కవీధిలో కడుతున్నట్టు తాము చూసిన ఇల్లు గురించి చెప్పి, అక్కడికెల్లా పోవాలో గుర్తులు చెప్పారు గోరీశంకు. వాళ్ళకు "థాంక్స్" చెప్పుకుని అటు నడిచాడు, ఇల్లు పూర్తయిందో లేదో, అందులో ఒక గది ఖాళీగా వుంటే, తనకు ఇస్తే....అనుకుంటూ నడక సాగించాడు.

వాళ్ళు చెప్పిన గుర్తుల ప్రకారం వెళ్ళాడు గానీ అక్కడ కొత్తగా కట్టిన ఇల్లేదీ వున్నట్టు అనిపించలేదు. వాళ్ళంతా తనను ఆటపట్టించారా అనుకుంటూ, అటూ ఇటూ పరిశీలనగా చూశాడు. రోడ్డుమీద అక్కడక్కడా ఇసుక, సిమెంటూ, ఇటుక బెడ్డలూ కనిపించాయి. అయితే కట్టేవుంటారు- అనుకుంటూ ఆ ఇంటిముందు నిలబడి, ఒకసారి లోపలికి చూశాడు. ఎవరో కుర్రాడు చాపమీద కూచుని, చుట్టూ పుస్తకాలు పరుచుకుని చదువుకుంటున్నాడు.

"బాబూ... ఇక్కడ ఒక గదేమైనా ఖాళీగా వుందా?"

చదువుకుంటున్నవాడల్లా తలెత్తి, అడిగిన తనివైపు చూసి,

"అమ్మా... గది ఖాళీగా వుందా అని ఎవరో అడుగుతున్నారు" అని గట్టిగా కేకేసి, లేచి గుమ్మందాటి బైటనిలుచుని, గోరీశంను పరీక్షగా చూస్తూ నిలుచున్నాడు.

అయితే లోపల్నించి ఆ కుర్రాడి తల్లి రాలేదు. ఒకమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి ఇంకా గుమ్మందాటి రాకముందే-

"ఏవండీ... ఒక గదేమైనా ఖాళీగా ఉందాండీ" అడిగాడు గోరీశం. ఆ అమ్మాయి ఏదో అనబోతూ గోరీశంకేసి చూసి, ఆశ్చర్యంగా "మీరా!?" అంది.

అప్పుడా అమ్మాయి ముఖంకేసి పరీక్షగా చూసి,

"ఇది మీ ఇల్లా! అరె... నాకు తెలీదు" అన్నాడు గోరీశం.

"లోపలికి రండి" అంటూ, తమ్ముడికేసి తిరిగి, "ఒరేయ్ శ్రీనూ... లోపలికెళ్ళి నాన్నను రమ్మను. అలాగే ఓ స్టూల్, కుర్చీయో పట్రా" అంటూ గుమ్మంలోంచి పక్కకు తొలగింది.

గోరీశం క్షణంపాటు ఏదో ఆలోచించి, గుమ్మంలోకి వస్తూ, "కొంచెం మంచినీళ్ళిస్తారా" అనగానే తలూపుతూ లోపలికి నడిచింది. మంచి నీళ్లతో తిరిగి వచ్చేలోగా విజయకు తమ పరిచయం అంతా గుర్తుకు వచ్చింది.

స్నేహితురాలింట్లో బారసాల అవుతూంది ఆరోజు తప్పకుండా రావాలని ఆ అమ్మాయి చెప్పటంతో పొద్దున తల్లికి చెప్పి, స్కూలుకు బయలుదేరింది తను. స్కూలైపోయింతరువాత స్నేహితురాలింటికి వెళ్ళి, ఆరున్నరకే తిరుగు ముఖంపట్టి, ఇంటి వైపు వస్తూండగా ఓ సందు మలుపులో ముగ్గురు కాలేజీ కుర్రాళ్ళు అడ్డగించి, అల్లరిచేయటం మొదలెట్టారు.

"మిస్ అంటే మిస్సు కాదురా, చూస్తుంటే కిస్ చేయాలనిపించటం లేదూ" అన్నాడొకడు, దారికడ్డంగా చెయ్యిపెడుతూ.

తను కదలటానికి వీల్లేకుండా ముగ్గురూ నిలుచున్నారు రోడ్డుమీద.

విజయ స్వతహాగా ధైర్యంగలది. ఐతే అది తనకు తెలిసిన ప్రదేశంకాదు. ఇళ్ళన్నీ దూర దూరంగా అక్కడొకటీ, అక్కడొకటీ విసిరేసినట్టుగా ఉన్నాయి. అప్పుడే చీకట్లు కమ్ముకుంటున్నాయి, వీధిలైట్లు లేవో లేక ఇంకా వెలిగించలేదోగానీ ఆ చివర ఏముందో కూడా కనిపించటంలేదు. అందుకే గిరుక్కున వెనక్కి తిరిగింది, ఆ వీధి దాటితే మళ్ళీ తన స్నేహితురాలి ఇల్లు వచ్చేస్తుంది- అనుకుంటూ.

కానీ అందులో ఒకడు వెంటనే ఒక గంతులో విజయముందుకు వచ్చి, రెండు చేతులూ బారచాపి నిలుచున్నాడు.

"చూస్తే చదువుకున్నవాళ్ళలాగా వున్నారు. ఇలాంటి పనులు చేస్తున్నారేం- మర్యాదగా నన్ను పోనీయండి"

"మర్యాదగానే పోనిస్తాం. జస్ట్ వన్‌కిస్, ఒకే ఒక్క ముద్దు పెట్టుకోనియ్! ముగ్గురం మూడు

ముద్దులు పెట్టుకుని వదిలేస్తాం''

"కాదూ కూడదని మొండికేశావో లేక అరిచి గోలచేశావో, నీ అరుపులు వినిపించి, ఎవరో ఒకరు పరుగెత్తుకొచ్చేలోపల బ్లౌజ్ చించేసి, ఓణీ లాక్కుని పారిపోతాం. అంతే...''

"వచ్చినవాళ్ళు నిన్నెవరో రేప్ చేశారను కుంటారు, ముద్దుతోపోని మర్యాద, అప్పుడు గోవిందా'' అంటూ ఒకడు దగ్గరకు రాబోయా డు.

విజయ ఒకసారి పరిసరాలు గమ నించింది. వాళ్ళు అనుకున్నట్టు ఏదైనా చేసి, అరనిమిషంలో పారిపోగలరు ఆ లోపల ఎవ రూ వచ్చి తనను రక్షించే అవకాశంలేదు. తన స్నేహితురాలి ఇంటివైపు ఒకడు నిలుచుని ఉన్నాడు. తను వెళ్ళాలనుకున్నవైపు ఇద్దరు న్నారు. మూడోబాట ఎటువెళుతుందో తెలీదు. తనకాప్రదేశం అంతగా తెలీదు. మూడో మార్గంగుండా వెళ్ళి కాస్తదూరం పరిగెత్తగ గితే ఆలోపల ఎవరో ఒకరు [illegible]. ఈ ముగ్గురు వెధవలూ అవ [illegible]శం దొరికింది గనుక తనను అడ్డగించారు [illegible]నీ మరో మని షిముందు తెగించేంత [illegible]ం ఉండదు- ఇదంతా అరక్షణంలో ఆలోచించింది విజయ.

చటుక్కున అటువైపు [illegible] గంతువేసి, పరుగు లంకించుకోబోయిం[illegible]

కానీ, హఠాత్తుగా ఎవరిమీదోపడిపోయి, మరుక్షణంలో నిలదొక్కుకుంది.

ఆ కాలనీ కొత్తగా ఏర్పడుతోంది. ఇంకా పూర్తికాని ఇళ్ళూ, ఇంకా జనం వచ్చి చేరని ఇ ళ్ళూ చాలా ఉన్నాయని తెలిసి, అక్కడ తన గదివేట సాగిద్దామని అటొచ్చిన గౌరీశంకు విజయ ఆ మలుపులో [illegible] తటస్థపడి ఢీకొ ట్టింది.

హఠాత్తుగా మనక [illegible]ళ్లో పైన పడింది ఏమిటో తెలియక క్షణంపా[illegible] ఉక్కిరిబిక్కిరైన గౌరీశం, తేరుకుని ఏదో అనే[illegible]గా విజయే అంది గబగబా-

"ఎవరో ముగ్గురు పోకిరీ[illegible]వలు అల్లరిచే స్తూ వెంటపడుతున్నారం[illegible]

విజయ మాటపూర్తయ్యేలోగా ఆ ముగ్గురూ రానేవచ్చారు.

గౌరీశం విజయ జబ్బపట్టుకుని, తన వెన క్కినెట్టాడు.

గౌరీశంను చూడగానే ఇద్దరు వెనక్కి తగ్గా రు కానీ, ఒకడికి మొండి తెగింపు వచ్చేసింది-

"ఒరేయ్... మర్యాదగా వెనక్కి చూడ కుండా వెనక్కి వెళతావా, తన్నులు తింటావా?'' అన్నాడు గౌరీశం దగ్గరికొస్తూ.

"అరే... అంత తొందరపడతారేంటీ! నేనూ మీలాంటివాణ్నే. మనం కాస్త సామరస్యంగా మాట్లాడుకుంటే బాగుంటుందికదా'' అన్నాడు గౌరీశం- వాళ్ళ ఆలోచనాధోరణిని పక్కకు తిప్ప డానికి.

"మా ముగ్గురికి నువ్వు నాలుగోవాడివి అంతే కదా, మరి పక్కకు జరుగు'' అన్నాడు వాడు ముందుకు వస్తూ.

ఈ మాట వినగానే విజయ గతుక్కుమంది.

"తొందరెందుకు బ్రదర్... ఇంత హడావిడీ చేసి, ఈ రోడ్డుమీద ఏదోచేసి సాధించేదే ముంది. అసలీపిల్ల మా ఏరియాలోదే. నేనే ఎన్నాళ్ళనుంచో ఛాన్స్‌కోసం చూస్తున్నాను''

"అయితే నువ్వనేదేమిటి- ఏం చేద్దా మంటావ్?'' కొంచెం సందేహంగా అన్నాడొక డు.

ఒంటరిగావున్న ఆడపిల్లల్ని అల్లరిపెట్టి, ఏడిపించటమేతప్ప రేప్‌లు చేయాలనే ఆలో చనగానీ, అంత ధైర్యంగానీ, దుర్మార్గంకానీ వాళ్ళలోలేదు. వాళ్ళను చూసినక్షణంలోనే, పరి సరాల్నిబట్టి ఆ విషయం గ్రహించాడు గౌ రీశం. ఇకవాళ్ళు తను మాట్లాడేది ప్రశాంతంగా వింటారు, అనుకుంటూ-

"కరాటే గురించి విన్నారా మీరు. మెడ మీద అరచేత్తో ఒక దెబ్బవేస్తే స్పృహ తప్పి పోతుంది''

"అబ్బా... అవన్నీ ఒద్దు గురూ, ఈలోగా...

"నేనూ అదే అంటున్నాను. ఈ అరచేత్తో అదే దెబ్బ మరికాస్త పవర్‌ఫుల్‌గా వేసాననుకో, కోడి మెడ విరిగినట్టు విరుగుతాయి ముగ్గురి మెడలూ'' అన్నాడు గౌరీశం, ప్రశాంతంగా షర్ట్ స్లీవ్స్ పైకి లాక్కుంటూ.

"ఒరేయ్... నీకు కరాటే వస్తే భయపడతా







# మీ పాపాయికీ
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు. ప్రొటీన్లు,
కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళ్లలో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్
రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలూ,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్ని అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీది
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK.SWAMY/FSL/5112/TEL

మనుకున్నావా? అది పారిపోయినా, నీ ముఖం పచ్చడి చేస్తాను" అంటూ ఒకడు ముందుకు రాబోయాడు.

అరచేత్తో వాడి రొమ్ము మీద చెయ్యేసి ఆపుతూ,

"మర్యాదగా చెబుతున్నాను. అనవసరంగా పుత్తూరు వెళ్ళి, లాభం లేదనిపించుకుని తిరిగి రావాల్సొస్తుంది. సామరస్యంగా అర్థంచేసుకోండి. పోనీ మరో మార్గంచెబుతాను, ఓ పదిపైసలుంటే ఇటియ్యి" అన్నాడు గౌరీశం తాపీగా.

"ఎందుకురా... అది తీసుకునిపోతావా" అంటూ వాడు గౌరీశం మీదకు రాబోతూంటే, మిగతా ఇద్దరూ కొంచెం వెనక్కిలాగారు.

విజయకు పూర్తిగా ధైర్యం వచ్చింది. ఏమవుతుందో అనుకుంది.

"సరే... అయితే నాజేబులో వుందేమో చూస్తాను" అంటూ ఎడంచెయ్యి ఎడం జేబులో పెట్టి, ప్యాంటులోంచి పది పైసల బిళ్ళ తీశాడు.

ఆ పదిపైసల బిళ్ళ రెండు వేళ్ళ మధ్యా పట్టుకుని వాళ్ళకు చూపించి, దాన్ని రెండు అరచేతుల మధ్య అడ్డంగా పెట్టాడు. గట్టిగా అదమటం మొదలెట్టాడు. ముఖంలో కండరాలు ఉబ్బుతున్నాయి. గట్టిగా శ్వాసిస్తున్నట్టు అనిపిస్తుంది. పళ్ళు బిగపట్టి, రెండు చేతుల పిడికిలినీ మరింత బిగించి, చటుక్కున పది పైసల నాణం తీసి చూపించాడు. అది మధ్యకు వంగిపోయి, అప్పచ్చిలా అణిగిపోయి ఉంది. దాన్ని చొక్కా జేబులో వేసుకుంటూ—

"చూశారుగా ఈ చేతుల్లో బలం. అడుగు ముందుకు వేస్తే, రేపు పెళ్ళయినాక ఎందుకూ పనికిరాకుండా ఇస్తాను ఒక కిక్" అంటూ విజయవైపు తిరిగి, "ముందుగా హెచ్చరించకుండా ఎవణ్ణీ తన్నొద్దని మా గురువుగారి ముందు ప్రమాణం చేశాను కనుక బతికిపోయారు ఈ ముగ్గురూ" అని జేబులోంచి సిగరెట్ తీసి, అంటించుకుని, "పద" అంటూ విజయ చేయి పట్టుకుని ముందుకు అడుగువేశాడు. ఆ ముగ్గురిలో ఎవ్వరూ కదిలి ముందుకు రాలేదు.

ఆ ఇల్లు అటు పక్కకు మరో రోడ్డులోకి తిరగగానే విజయచెయ్యి వదిలేసి, ఏమీ మాట్లాడవద్దన్నట్టు పెదాలమీద చూపుడు వేలుంచి సైగ చేశాడు. విజయకు జరిగిందంతా తమాషాగా అనిపిస్తుంది. ఇద్దరూ వీధి చివరకొచ్చిన తరువాత ఇక ఉండబట్టలేక అడిగింది-

"మీరు మా వీధిలో ఉంటారా, ఎప్పుడూ చూసిన గుర్తు లేదు"

"మీ వీధిలో అనలేదు, మీరు నా ఏరియాలో ఉంటారన్నాను. ఈ సిటీ అంతా నా ఏరియానే" అన్నాడు గౌరీశం నవ్వుతూ.

"మీరు రౌడీ అంటే నమ్మబుద్ధికావటంలేదు"

"చంపారు పొండి. మీరు నన్ను కూడా రౌడీ అనుకుంటున్నారా?"

"సారీ... నేను అలా అనుకోలేదుగానీ, మీరే "ఏరియా" అని మాట్లాడుతుంటే అలా అనిపించింది" నొచ్చుకున్నట్టుగా అంది విజయ.

"వాళ్ళని బెదరగొట్టటానికి అలా అన్నానుగానీ, నాకు ఏరియాలూ లేవు, నేను గుండానీ కాదు— మీరెటు వెళ్ళాలి" అన్నాడు గౌరీశం.

చెప్పింది విజయ.

"రిక్షాలో వెడతారా లేకపోతే నన్ను తోడు రమ్మంటారా, 'ఇలాగే మాట్లాడుకుంటూ వెళదాం"

"అబ్బే ఫరవాలేదండీ... మెయిన్ రోడ్ వరకూ మీరు రాగలిగితే సంతోషం. ఒక్కదాన్నీ వెళ్ళగలను. అసలు ఇటువైపు నేనెప్పుడూ రాలేదు గనుక ఇలా వీలుచూసుకుని వాళ్ళెవరో దారికడ్డం వచ్చారుగానీ, లేకపోతే ఎప్పుడూ ఇలా జరగలేదు"

"మీకు మంచి ధైర్యం ఉందే. వెరీగుడ్ కీపిటప్" అన్నాడు గౌరీశం.

మెయిన్ రోడ్‌పైకొచ్చాక గౌరీశంకు "థాంక్స్ చెప్పి తనదారి పట్టింది విజయ.

వెళ్ళిపోతున్న విజయను చూస్తూ నిలబడ్డాడు గౌరీశం. కాస్సేపటికి, వాళ్ళింటి దగ్గర గదేమైనా ఖాళీవుందేమో అడిగితే బాగుండునని తట్టింది కానీ అప్పటికే ఆ అమ్మాయి

కనుమరుగైపోవటంతో, ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.




మొన్ననే ఈ అమ్మాయినడిగితే నిన్నా ఇవాళా తిరిగే బాధ తప్పేది కదా- అనుకుంటూ శ్రీను తెచ్చిన స్టూల్‌మీద కూర్చున్నాడు గౌరీశం గదిని కలయచూస్తూ. అంతలోనే అనిపించింది- ఖాళీ ఉండగానే ఏమైంది అసలది గదో, ఒక పోర్షనో, నిజానికి ఖాళీ ఉందో లేదో, అద్దెఎంతో ఏమిటో- అని.

అంతలో ఓచేతిలో స్టూలూ, మరో చేత్తో గ్లాసులో నీళ్ళూ పట్టుకుని వచ్చింది విజయ. గౌరీశం నీళ్ళు తాగుతుండగా వెంకటేశం వచ్చాడు. పరిచయ కార్యక్రమాలైపోయాక అన్నాడు వెంకటేశం—

"ఏంబాబూ... గదికోసం తిరుగుతున్నావా నువ్వు?"

"అవునండీ... దొరుకుతుందా"

"ఉందనుకో... కానీ ఇలాంటి విషయాలన్నీ నాకు తెలీవయ్యా. మా విజయే చూసుకుంటుంది" అన్నాడు వెంకటేశం లేచి నిలబడుతూ.

విజయంటే ఎవరో, ఆవిడేం అడుగుతుందో అనుకున్నాడు గౌరీశం.

విజయ చప్పున తండ్రితోపాటు లోపలికెళ్లింది.

వెంకటేశం ఇలాంటివేమీ పట్టించుకోడు, నారాయణా అంతే.

సుధాకర్‌కు అలాంటిబాధ్యతలు అప్పగించరు. అరుణకు అలాంటి విషయాల మీద ఆసక్తిలేదు. ఇంటి వ్యవహారాలన్నీ విజయపైనే వదిలేయటం రెండేళ్ళుగా ఇంట్లోవాళ్ళకు అలవాటైపోయింది. వయసుకు చిన్నదైనా విజయ చాలా చురుకైనది. ఏపైసా ఎట్లా ఖర్చుపెట్టాలో తూచి, తూచి ఖర్చు పెడుతుంది. వచ్చే సంపాదనను పొందిగ్గా అన్ని అవసరాలకూ సర్దడం విజయ చాలా తెలివిగా చేస్తుంది. పైగా పెద్దవాళ్ళనైనా సరే అదిలించి, భయపెట్టి, నోరుమూసుకునేట్టు చేస్తుంది. విజయ పెత్తనం గురించి అరుణా, సుధాకర్ ఒకటిరెండు సార్లు పోట్లాడటంతో ఓసారి తల్లి చెప్పగా నారాయణ ఆ ఇద్దరినీ గద్దించాడు. అంతటితో అదీ అయిపోయింది. ప్రతివిషయంలో మంచి చెడులు ఆలోచించి, తల్లితోనో, తండ్రితోనో చర్చించే నిర్ణయం తీసుకుంటుంది విజయ. అందువల్ల కూడా వాళ్ళకు విజయ ఆలోచనా విధానం తెలిసి, విజయ చెప్పే ఆలోచనలు విని, ఇక నిశ్చింతగా వదిలేస్తారు ఆ విషయాన్ని.

"అదేమిటి నాన్నా... నామీద నెట్టేసి వచ్చేశావు. ఆయనతో నేనేం మాట్లాడాలి" అంది వంటింట్లో తండ్రితో.

"నేను మాట్లాడాననుకో, ఏదో ఒకటి చెప్పటం మరిచిపోతాను. పైగా మనం ఎప్పుడైనా ఇళ్ళు అద్దెకిచ్చాం గనుకనా"

"నువ్వేమంటావమ్మా?"

"పిల్లాడు బుద్ధిమంతుడని నువ్వే అన్నావు కదా. కాస్త వెనకా ముందూ సంగతులు విచారించి, బాగుంటుందనుకుంటేనే చూడు. కుదిరితే మనకూ సంతోషమేకదా"

"ఎవరోఒకరు నాతోరండి, నేనొక్కదాన్నే ఉంటే బావుండదు" అంది విజయ.

విషయం విన్న అరుణ విజయతో నడిచింది. గదితాళం చెవి తీసుకొని ఇద్దరూ ముందు గదిలోకి నడిచారు.

"ఇది మా అక్క అరుణ. వీడు మా తమ్ముడు శ్రీను. ఇక నాపేరు విజయ" పరిచయం చేసింది విజయ.

విజయంటే ఈ అమ్మాయేనా అనుకుంటూ ఆశ్చర్యపోయాడు గౌరీశం.

"నా పేరు గౌరీశం" తన పేరూ చెప్పుకు

న్నాడు.

బైటనుండి ఇంటివెనకవైపుకు వెళ్ళారు. ఆ గదిలో ఒక చిన్న షెల్ఫుంది గోడకు. ఒక వైపు అటక, రెండు కిటికీలు.

"లెట్రిన్, బాత్రూం అదిగో ఆ మూలనున్నాయి. మేం కూడా అవే వాడుకుంటాం. మీరెటూ ఒక్కరే అన్నారు కనుక అడ్జెస్ట్ చేసుకోగలిగితేసరి" చెప్పింది విజయ.

"ఫర్వాలేదండీ... ఇంతకూ అద్దె విషయం చెప్పలేదు"

"అది చెప్పేముందు మీకు మరో విషయం చెప్పాలి. ఈ ఇల్లు మాదని మీరనుకుంటున్నారేమోగానీ కాదు. మేమూ అద్దెకే ఉంటున్నాం. వాస్తురీత్యా ఇక్కడో గది ఉండాలని ఎవరో చెబితే ఈ ఇల్లుగలాయన హఠాత్తుగా ఈ గది కట్టించాడు. అదీ మమ్మల్నే తీసుకోమన్నాడు గానీ,. అనవసరంగా అద్దె ఎక్కువెందుకని మేం తీసుకోలేదు. ఎనిమిదేళ్ళుగా ఉంటున్నాం గనుక మేం ఎవరికైనా అద్దెకిచ్చుకోవచ్చుగానీ, ఆ అద్దె విషయంలో తన పూచీ లేదనీ మొత్తం అద్దెమట్టుకు మేమే తనకివ్వాలనీ చెప్పాడు. అందుకే గది ఇంటికానించి కట్టినా ఈ గదికీ, మా ఇంటికీ. మధ్య తలుపు వద్దని మేమంటే మా మాటకొద్దీనూ, గుమ్మం కట్టించే ఖర్చు కలిసివస్తుందనీనూ మానేశాడు"

క్షణంపాటు ఊపిరి పీల్చుకుని మళ్ళీ చెప్పింది-

"ఆయన ఊరికాచివర ఉంటాడు. పైగా ఆయన ప్రమేయం కూడా లేదు. మేం కూడా ఈ గది కట్టడం మొదలైన దగ్గర్నించీ ఎవరికైనా ఇవ్వాలా వద్దా, ఇస్తే ఎవరికివ్వాలి- అని తర్జనభర్జనలు పడి, చివరకు ఇచ్చేయాలని మొన్ననే నిర్ణయించుకున్నాం. ఇంకా వెల్లవేయించే పనొకటి మిగిలిపోయింది. మీరు తరవాత రావచ్చు. ముందే వచ్చినా ఒక్కరోజు ఇబ్బందిపడితే సరిపోతుంది. మేం రెండొందల ముప్పై రూపాయలిస్తున్నాం ఇంతవరకూ. ఇక నుండీ రెండొందల డెబ్బై అయిదు. అంటే మిగతా నలభై అయిదు రూపాయలు మీరిస్తేచాలు. ఇక ఎలక్ట్రిసిటీ, మీరు కాల్చుకునేదాన్ని బట్టి ఇద్దరుగానీ"

విజయ చెప్పిందంతా వినగానే ఒకసారి హాయిగా ఊపిరిపీల్చుకున్నాడు గౌరీశం.

ఇంటాయన ఎలాంటివాడో తెలియకున్నా ఆయనతో సంబంధంలేదంటున్నారు. వీళ్ళు చూస్తే మంచివాళ్ళలాగానే ఉన్నారు. ఇక తనకూ ఇంతకన్నా తక్కువలో ఎక్కడా దొరకదు. కరెంటుకు ఐదు రూపాయలనుకుంటే నెలకు యాభై- ఇలా అనుకుని,

"సరేనండీ... నాకిష్టమే. నేను ఎప్పుడు చేరొచ్చు. ఇంకా ఏమైనా చెబుతారా?" అన్నాడు.

"మీరు ఎప్పుడు చేరతానన్నా ఫర్వాలేదు.... మీ గురించి చెప్పండి"

తనగురించి అంతా చెప్పేశాడు గౌరీశం-

".... అద్దె తప్పకుండా నెలనెలా ఇస్తాను. నమ్మితే ఇవ్వండి లేకపోతే మీఇష్టం"

డబ్బు విషయంలో విజయ సంగతి తెలుసు కనుకా, గౌరీశం తనను రక్షించినవైనం కూడా చెప్పింది కనుకా ఇప్పుడు విజయ సంగతి అడకత్తెరలో పడినట్టయిందనుకుంది అరుణ. ఆ కుర్రాడికి గది దొరకనట్టే అనుకుంది.

విజయ కాస్సేపు ఆలోచించి చివరకు తన అభిప్రాయం చెప్పింది-

"విషయమేమిటో మీకు ముందే చెప్పాను గదా. మీరు అద్దె ఇవ్వటం ఆలస్యమైతే మాకు ఇబ్బందవుతుంది. నలభై అయిదు రూపాయలు మేమే ఇచ్చుకోగలిగితే మాకు మళ్ళీ అద్దెకివ్వాల్సిన అవసరమేలేదు. అంచేత మీకూ మాకూ ఇబ్బంది లేకుండా ఒక మాట చెబుతాను. ఎలాగూ నెల అద్దెముందుగానే ఇవ్వాలి. కరెంట్ బిల్ కలిపి యాభై అనుకోండి. దాంతోపాటు అడ్వాన్సుగా ఒక యాభై ఇవ్వండి. అది మా దగ్గరుంటుంది. అంటే మీరు అద్దె ఇవ్వటం ఒక నెలరోజులు లేటయినా ఇబ్బందుండదు. అలాగని అంతలేటు కానీయకండి. తరువాత మీకే ఇబ్బందవుతుంది" చివరిమాట నవ్వుతూ చెప్పింది.

చెల్లెలి తెలివికి ఆశ్చర్యపోయింది అరుణ.

గౌరీశం ఒప్పుకున్నాడు, జేబులోంచి యాభై రూపాయలు తీసిస్తూ-




"మిగతా యాభై రేపిస్తాను. మీరు నమ్మగలిగితే మీకు ఇబ్బందేమీ లేకుంటే ఇవాళే వచ్చేస్తాను, మరో రోజు ప్లాట్‌ఫాంపైన పడుకునే అవసరం తప్పుతుంది" అన్నాడు.

"మీరు రోజూ ప్లాట్‌ఫాంమీద పడుకుంటున్నారా, అదేమిటి?" ఆశ్చర్యంగా అంది విజయ.

"ఎలాగూ మీ ఇంట్లోనే అద్దెకుంటున్నాను కదా. అదంతా ఎప్పుడైనా తీరిగ్గా చెబుతాను ఇంతకూ ఏమంటారు?"

"ఒక్కరోజు కోసం నమ్ముతానులెండి. మీరు స్టేషన్‌కెళ్ళొచ్చేసరికి గది కడిగేస్తే ఆరిపోతుంది వచ్చేయండి. మీకు వార, వర్జ్యాల పట్టింపులేమీలేవా? మా కలాంటిదేమీ లేదనుకోండి...."

"అద్దెకు గది దొరికిన రోజుకంటే మంచి ముహూర్తం ఏముంటుందండీ, మరి నేను ఓగంటలో వచ్చేస్తాను" అన్నాడు గౌరీశం ఇక వెళ్ళటానికి ఉపక్రమిస్తూ.

అరుణ ఒక క్షణం ఆలోచించి అంది-

"మీరు హొటల్లో భోంచేస్తారనుకుంటాను, ఇవాల్టికి తిన్నగా వచ్చేయండి- మా ఇంట్లోనే భోంచేద్దురుగానీ"

"అబ్బే... ఫర్లేదండీ, మంత్లీ కూపన్‌లున్నాయి" మొహమాటంగా అన్నాడు.

ఇక విజయ కల్పించుకుని అంది-

"మా అన్నయ్యలు కూడా పరిచయమైనట్టుంటుంది వచ్చేయండి, ఒక్క రోజుకు ఫర్వాలేదు. పైగా మా అరుణ బ్రహ్మాండంగా వంట చేస్తుంది".

సరేననిచెప్పి గౌరీశం వెళ్ళిపోయాడు.

★ ★ ★

నారాయణ ఇంట్లోకొస్తూనే విజయను పిలిచి, జీతం అందించాడు-

"ఆఫీసులో కొలీగ్సుకు మొదటిజీతం వచ్చినరోజునే పార్టీఇవ్వమని చలపతి మావయ్యా చెబితే ఇచ్చానే, కానీ నలభైరూపాయలవుతుందని అనుకోలేదు"- అంటూ ఐదు వందల నోట్లు, ఒక పదినోటూ ఇచ్చాడు.

ఏవిషయమైనా ఒకరు చెబితేకానీ చేయడు నారాయణ. అయినా గవర్నమెంట్ ఉద్యోగంలో చేరిన మొదటిజీతంలో అందరికీ ఏమైనా కొనితెస్తాడని శ్రీనూ, సుధాకర్, అరుణా పదిరోజుల్నించి చెప్పుకుంటూ ఎదురు చూస్తున్నారు. కానీ మొత్తం జీతం తన చేతిలో పెట్టేసరికి విజయ కూడా ఆశ్చర్యపోయింది. తనంత తాను ఒకపైసా అయినా ఖర్చుచేయని అన్నయ్యని గురించి సంతోషపడింది కానీ, ఆ వెంటనే అలాంటి అన్నకు తోడుగా రాబోయే వదినగానీ గయ్యాళిదైతే ఎలా ఉంటుందో అనుకుని నిట్టూర్చింది.

"ప్రతినెలా ఇట్లా ఏదో తారీకునే వస్తుందా అన్నయ్యా జీతం" అంది.

"లేదు... ఫస్టునే ఇస్తారట. కొత్తగా చేరినవాళ్ళం గనుక ఈసారి లేటయినట్టుంది"

"అన్నయ్యా... ఓ ఇరవై రూపాయలు పెట్టి స్వీట్సు తెస్తాను. ఎంతైనా ఇది కూడా మొదటి జీతంలాంటిదే కదా"

"నీఇష్టమే... నాకేం తెలీదు" అన్నాడు నారాయణ యథాప్రకారంగా.

సుధాకర్ని వెంటబెట్టుకుని బజారుకు బయల్దేరింది విజయ. బైటకడుగుపెట్టగానే విషయం విన్న సుధాకర్ నీరుగారిపోయాడు-

"అన్నయ్య మొదటి జీతంతో మాస్ కొనిస్తాడనుకున్నాను, కనీసం ఒక టీషర్టుకైనా డబ్బులియ్యమనవే"

"ఇంకా నేనే నయం. అన్నయ్యసలు స్వీట్లు కూడా తేలేదు. నేను అన్నయ్యనడిగి తెద్దామని బయల్దేరాను"

"సర్లేవే ... నీ పెత్తనం, ఈ ఒక్క నెలా ఎక్కువొచ్చిన రెండొందల యాభై రూపాయలూ అందరమూ ఏదో ఒకటి కొనుక్కుంటామని నువ్వడిగితే అన్నయ్య కాదంటాడా? మధ్యలో నీదే పిసినారితనం కానీ" కాస్త కోపంగా అన్నాడు సుధాకర్.

"ఎక్కువొచ్చిన డబ్బులేం ఖర్మ, మొత్తం జీతం కూడా ఏం చేస్తామన్నా అన్నయ్యేమీ అనడు. నాక్కాస్త బుద్ధీ, జ్ఞానం వుందిగనుక నేనే అడగలేదు" విసురుగా అంది విజయ.

"అబ్బ ... పోనీవే! నాకొక్క పాతిక రూపాయలుఇయ్యి- చాలు. అన్నయ్యకు ఉద్యోగం

వచ్చిందని మా ఫ్రెండ్సంతా పార్టీ అడుగుతు న్నారు'' బుజ్జగింపుగా అడిగాడు.

''నీకసలు బుద్ధిలేదు చిన్నన్నయ్యా! ఈ డబ్బులు ఎక్కువొస్తాయని ఖాతాలవాళ్ళకూ, అప్పులవాళ్ళకూ అందరికీ తెలుసు. ఈ డబ్బు లు ఎట్లా సర్దాల్రా బాబూ అని నేను తలబాదు కుంటున్నాను. నీకసలు ఇంటి పరిస్థితులు తెలియవే, పట్టించుకోవే నాకర్థంకాదు''

''ఎన్ని డబ్బులొచ్చినా ఇంతే! అసలు మన కెన్నడు సరిపోతాయిగనుక'' గొణుక్కుంటున్న ట్టుగా అన్నాడు సుధాకర్.

''అదే విషయాన్ని కాస్త స్థిమితంగా కూచుని ఆలోచించు. ఖర్చు పెట్టుకోవాలని నీకేమిటి, నాకూ వుంటుంది. మరి ఆ రేడియో మెకా నిజం ఏదో కుదురుగా నేర్చుకుని సంపాదించు కుంటే ఎంత బాగుంటుంది. నువ్వు ఇంట్లోకి ఇవ్వకపోతే మానె, నీ ఖర్చులన్నీ మహారాజులా గడుపుకోవచ్చుగదా''

అంతలో కిరాణాకొట్టు రావడంతో సంభా షణ ఆగిపోయింది. విజయ లెక్క చూసి, డబ్బులిచ్చేవరకూ మౌనంగా నిలబడ్డాడు సు ధాకర్- ఎటో చూస్తూ.

''చిన్నన్నయ్యా ... మన చదువులకోసం నాన్న పెద్దన్నయ్యా ఎంత కష్టపడుతున్నారో తెలుసా? వాళ్ళిద్దరూ సంపాదిస్తున్నవాళ్ళు, మరి వాళ్ళే ఇష్టానుసారంగా ఖర్చుపెడితే మన గతి ఏమయ్యిండేదో ఊహించు. పెద్దన్నయ్యా సినిమాకు వెళ్ళాలంటే- విజయా, పదిరూపా యలున్నాయా- అనడుగుతాడేకానీ, ఓ పది రూపాయలియ్యవే, సినిమాకెళ్ళాలి- అని ఎన్న డూ అడగలేదు. నీకంటే చిన్నదాన్ని నేన్నీకు చెప్పాలా ... నువ్వే గ్రహించుకో అన్నయ్యా''

ఇంతలో స్వీట్‌షాపొచ్చింది. కిలో ఇరవై ఎనిమిది రూపాయలనడంతో ముప్పావుకిలో స్వీట్సు తీసుకుంది విజయ. ఇద్దరూ బైటికొ చ్చారు. చిల్లరలోంచి తొమ్మిది రూపాయలు తీసి, సుధాకర్‌కిచ్చింది విజయ. అయి ష్టంగానే అవి జేబులో పెట్టుకున్నాడు.

''నాన్న జీతం వచ్చాక ఆర్రూపాయలిస్తాను నీకు. లేకపోతే నెలాఖర్లో తీసుకో. మళ్ళీ ఈనెల్లో మాత్రం నన్ను డబ్బులడగొద్దు- నీ ఇష్టం. ఏం- చేసుకుంటావో'' ఖచ్చితంగా చెప్పింది.

''కిరాణా ఖాతా నాలుగొందల నలభై ఇచ్చే సానా, స్వీట్సుకు, నీకు కలిపి ముప్పై రూపాయ లయిందా, ఈనెల టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో ఫీజు నలభైహేను రూపాయలు, పార్వతమ్మ పిన్నికి ముప్పయ్యారు రూపాయలియ్యాలి. కూరగా యల ఖాతా డెబ్బై, ఎనభై దాకా అయిన ట్టుంది. నీ పరీక్షఫీజుకోసం నాన్న మిల్లులో ఎవరిదగ్గరో తీసుకున్న డబ్బులు ఇంకా ఇవ్వలే దు. పైగా నాన్న జీతంలోంచే ఇంటి అద్దె ఇవ్వాలా! ఈ చిల్లరప్పులన్నీ తీర్చటానికి అప్పుడే వెయ్యి రూపాయలు వడ్డీకి తీసుకొ చ్చాం. అదింకా సగం తీర్చాలి. వడ్డీ ఒకటి, బట్టల కొట్లో ఇంకా నూటరవైదాకా ఇవ్వాలి. మళ్ళీ దసరా, దీపావళీ రాబోతున్నాయి. ఇవ న్నీ పక్కనపెట్టు- పెద్దన్నయ్య టైప్ ఇన్‌స్టిట్యూ ట్‌లో వున్నన్నిరోజులంటే నడిచింది. ఇప్పుడు కాస్త మంచి ఆఫీసుకెళ్తున్నాడు. చూసేవాళ్ళ కైనా బాగుండాలి. అన్నయ్యకు బట్టలు తీయాలి. ఇవన్నీ నీకు పట్టదు. అసలు నెల నెలా డబ్బులు రాగానే నాతో కూర్చుని లెక్క రాయి. నీకే తెలుస్తుంది. ఉన్నఫళంగా నీక్కూడా అయిందొదల రూపాయల జీతం వచ్చే ఉద్యోగం దొరికినా మనకు సాఫీగా సాగ దు... ఏమిటో, నేనిలా వాగటమే కానీ నువ్వు వినిపించుకుంటావన్న ఆశ మాత్రంలేదు'' ఇల్లు రాగానే ఆపేసింది.

చెల్లెల్ని కొరకొరా చూస్తూ, విసురుగా ఇంటి వెనుక వైపు నడిచాడు, గౌరీశం దగ్గరకు. విజయ లోపలికెళ్ళిపోయింది.

నాలుగు స్వీట్సు ఓ పళ్ళెంలో పెట్టి సుధా కర్‌కూ, గౌరీశంకూ ఇచ్చిరమ్మని శ్రీనుని పుర మాయించి పాకెట్ తల్లికందించింది విజయ.

''నాక్కూడా ఇయ్యవే ... నేనూ అక్కడే తింటాను'' అని అక్క ఇచ్చిన స్వీట్లుకాక, దెబ్బలాడి మరో రెండు ముక్కలు తీసుకుని, పళ్ళెంతోసహా తుర్రుమన్నాడు శ్రీను.

గౌరీశం రాకతో ఇంట్లోకే కొత్తమనిషి వచ్చిన ట్టయింది వాళ్ళకు. గౌరీశం కాస్త సరదాగా వుండటంవల్లా, దాదాపురోజంతా గదిలోనే కూచుని రాసుకోవటం వల్లా సుధాకర్‌కు అత నితో స్నేహం కుదిరింది. అతను ఇంట్లోచేరిన




మూడో రోజుకల్లా అందరూ ఏకవచనంతో సంబోధించుకునేంతవరకూ వచ్చేసింది.

గౌరీశం చేస్తున్న పనివల్ల సుధాకర్‌కు క్రేజ్ కూడా కలిగింది. ఒక టైం అనిగానీ, ఒకరి అజమాయిషీ అనిగానీలేదు. తన ఇష్టం వున్నప్పుడు రాసుకుంటాడు. ఇష్టం వున్నప్పుడు లైబ్రరీకెడతాడు. వండుకోవటం ఇష్టం లేకపోతే హోటల్‌కెళతాడు. సాయంత్రాలు పత్రికాఫీసులకెళ్ళి, ఒక్కోసారి అట్నించటే సెకండ్ షో సినిమాకెళ్ళి వస్తాడు. ఎంత హేపీ జీవితం- ఇదీ సుధాకర్ అభిప్రాయం.

గౌరీశం రాసే వ్యాసాలూ, ఆర్టికల్సూ చదివి, అతను ఎలా రాస్తున్నాడో, లైబ్రరీల్లో ఏం చదివి రాస్తున్నాడో గమనించాలనీ, నేర్చుకోవాలనీ ఓ వారంరోజులు ఉత్సాహపడ్డాడు సుధాకర్. ఆరకంగా రోజూ గౌరీశంతోపాటు లైబ్రరీకెళ్ళే అలవాటు ఏర్పడింది. అయితే అక్కడ గౌరీశం చదివే పుస్తకాలు, మేగజైన్లూ, రెండో రోజే సుధాకర్‌కు దూరమైపోయాయి. అయినా సరదాగా మాట్లాడుకుంటూ వెళ్ళటానికీ, ముఖ్యంగా సిగరెట్లు తాగటానిక్కూడా ఇంట్లోనే ఓ తోడు దొరకటంతో సుధాకర్‌కు సంతోషంగా వుంది.

ఇంట్లో ఎవరి ముందూ కాల్చకపోయినా, సుధాకర్‌కు సిగరెట్టు తాగే అలవాటుందని అందరికీ తెలుసు. గౌరీశంకున్న ఏకైక అలవాటూ అదే. అంచేత గౌరీశంతో కూడి అతను కొత్తగా చేసుకునే దురలవాటు ఏమీలేదు. పైగా అక్కరకొచ్చేదో రానిదో ఏదో ఒకటి చదవటానికి లైబ్రరీకెళ్ళటంలాంటి మంచి అలవాటొకటి గౌరీశం మూలంగానే అయింది. అంతేకాక అతని స్నేహంలో ఎంతోకొంత తెలివితేటలూ, లోకజ్ఞానం కూడా అబ్బవచ్చుననే అభిప్రాయంతో గౌరీశంతో స్నేహం విషయంలో సుధాకర్ని ఎవరూ అభ్యంతరం పెట్టలేదు.

వీళ్ళ పెరటి తలుపుతీస్తే గౌరీశం గది కనిపిస్తుంది. ఆవిధంగా అరుణ, విజయ పెరట్లో పనిచేస్తున్నంతసేపూ ఏదో ఒక సంభాషణ జరుగుతూ వుంటుంది. ఎక్కువగా గౌరీశం రాస్తున్న విషయాల గురించీ, పత్రికల గురించీ, ఆ తరువాత స్కూలు, కాలేజీ సంగతులూ, రాజకీయాలు ఇలాంటివి. జగదాంబ కూడా సుధాకర్ గురించీ, ఇంటి సంగతులగురించీ చెబుతూంటుంది. అప్పుడప్పుడూ కాఫీ, టీలు ఇవ్వటం రూపంలో ఆదరిస్తుంది. అరుణ వంటలు బాగా చేస్తుంది. ముఖ్యంగా పిండివంటలలాంటి ప్రత్యేకమైనవి చేయాలంటే ఇక అరుణే పూనుకోవాలి. రెండుసార్లు అరుణ చేసిన వంటలు గౌరీశంకు కూడా రుచిచూపించటంతో, అతనికీ వాళ్ళవల్ల ఒక అభిమానం ఏర్పడింది.

అందరితో ఎంతసరదాగా మాట్లాడుతూ, ఎంత కలుపుగోలుగావున్నా, గౌరీశం చదువుకుంటున్నప్పుడూ, ముఖ్యంగా రాసుకుంటున్నప్పుడూ మాత్రం సీరియస్‌గా పనిలోపడిపోతాడు, చుట్టుపక్కల జరిగేదేదీ పట్టించుకోడు. ఈ లక్షణంవల్ల పెద్దవాళ్ళక్కూడా అతను బుద్ధిమంతుడన్న అభిప్రాయం కలిగింది.

"ఔనుగానీ... నిన్నోవిషయం అడగనా నేను?" ఓసారి సీరియస్‌గా అన్నాడు శ్రీను.

"ఏమిటో అంతగొప్ప సంగతి, తొందరగా అడిగెయ్, మళ్ళీ మరిచిపోతే ఇబ్బంది" నవ్వుతూ అన్నాడు గౌరీశం.

"నువ్వు మా అరుణక్కముందూ, సుధన్నయ్యముందూ, నాముందూ కూడా సిగరెట్ తాగుతావుకదా, మరి మా విజయక్కవస్తే మాత్రం ఎందుకు చటుక్కున పడేస్తావ్"

"చాలా పెద్ద ప్రశ్న అడిగావు. మరి నువ్వు మీ ఇంటిలో ఎవ్వరికీ భయపడవ్‌కదా, మీ విజయక్కను చూడగానే తోకముడుచుకుంటావ్- ఎందుకు?"

"నా సంగతంటే వేరు... అది రాక్షసి, తంతుందని భయం"

"నేను కూడా అంతే అనుకో"

"నేనేం చిన్నపిల్లాణ్నికాదులే, నువ్విలా అంటే నమ్మటానికి, అసలు సంగతి చెబుతావా, చెప్పవా" మళ్ళీ అడిగాడు శ్రీను.

కాస్సేపు ఆలోచించి చెప్పాడు గౌరీశం--

"అసలు సంగతేమిటంటే, సిగరెట్ తాగటం మంచి అలవాటుకాదుకదా. సిగరెట్ తాగటం తప్పుకదా. మీ విజయక్కను చూస్తే, తప్పు పనిచేస్తుంటే ఏమిటో గిల్టీగా అనిపిస్తుంది శ్రీనూ. గిల్టీ - అంటే ఏమిటని మళ్ళీ

"ఎందుకంటే, ఇప్పుడు నువ్వడిగే ప్రశ్నలున్నాయి చూడూ, వాటికి సమాధానం చెప్పటం కూడా ఒక పెద్ద కథరాయటంతో సమానమన్న మాట"

"అదినరే... మరి నాకు కూడా కథలు రాయాలనిపిస్తూంది. మరి ఎలాగంటావ్, సిగరెట్ తాగాననుకో, మా అక్క చంపేస్తుంది కదా"



అడగకు"

"అడగనుగానీ, సిగరెట్ కాల్చటం తప్పని తెలుసుకదా, మరెం...కు తాగుతారు నువ్వూ, మా సుధన్నయ్యా?"

"ఇవ్వాళ నా మూడంతా చెడగొడదామని కంకణం కట్టుకున్నట్టున్నావ్, శ్రీనూ. సరే... చెబుతాను విను- మీ సుధన్నయ్యెందుకు తాగుతాడో నాకు తెలియదుగానీ, నాలాంటి రచయితలున్నారు చూడూ, మరి పుంఖాను పుంఖంగా రచనలు చేయటానికి ఆలోచన్లు రావాలని సిగరెట్లు తాగుతారన్నమాట అదీ సంగతి"-- అంటూ సిగరెట్‌తీసి అంటించుకున్నాడు గౌరీశం.

"మరిప్పుడు నువ్వేమీ రాయటంలేదు కదా, ఇప్పుడెందుకు తాగుతున్నావ్?"



"చూడు నాయనా... సిగరెట్టు తాగనివాళ్ళంతా కథలు మానేసి, నవలలు రాస్తున్నదందుకే. అంచేత, నువ్వేం చేయాలంటే ఒక భయంకరమైన నవలరాసి, తెలుగు పాఠకుల్ని ఆదుకోవాలన్నమాట. కథలు రాసే సంగతి, నువ్వు నా అంత పెద్దాడివైన తరువాత ఆలోచిద్దువుగాని" భారంగా నిట్టూరుస్తూ చెప్పాడు గౌరీశం.

శ్రీను వెనకే గౌరీశం దగ్గరికి రాబోయిన విజయ, అరుణలు, శ్రీను ప్రశ్న వినిపించగానే కిటికీపక్కన నిలబడి, ఆ సంభాషణంతా నవ్వుకుంటూ వినసాగారు. ఇక చాటుగా వద్దుకానీ,

ముందుకెళదాం - అన్నట్టు సైగచేసింది అరుణ. తనని చూస్తే సిగరెట్ పారేస్తాడు, పోనీపాపం, నేన్రాను - అన్నట్టు సైగచేసి, వెనుదిరిగింది విజయ.

అరుణ- "శ్రీనూ... ఏంచేస్తున్నావిక్కడ?" అంటూ ప్రవేశించింది గౌరీశం గదిలోకి.

"ఏంలేదక్కా" అన్నాడు శ్రీను మళ్ళీ అడగబోయిన మరో ప్రశ్నను విరమించుకుంటూ.

"అయితే వాణ్ని కూచోబెట్టుకుని సిగరెట్ల గురించి చెబుతున్నావా?" చిరుకోపం నటిస్తూ అంది అరుణ.

"ఐతే, అప్పట్నుంచీ కిటికీవక్కన నిలుచుని వింటున్నావన్నమాట"

"నేనొక్కదాన్నేకాదు, విజయకూడావింది"

విజయ పేరు వినగానే చటుక్కున సిగరెట్ని గదిమూలకు గిరాటేశాడు గౌరీశం.

"అది లోపలికెళ్ళిపోయిందిగానీ, వాడన్నది నిజమేనన్నమాట" అంది అరుణ.

వెంటనే లేచి, వడేసిన సిగరెట్ తెచ్చుకుని కూచుంటూ-

"ఏమిటి నిజం?" అన్నాడు గౌరీశం.

"అదే, విజయంటే భయంకానీ, నేనంటే లేదు" ఉడికిస్తూ అంది అరుణ.

"అది భయంలేకపోవటంకాదు. మనిద్దరమూ కాస్త దగ్గరిస్నేహితులమన్నమాట"- రహస్యం చెబుతున్నట్టుగా వివరించాడు- "మనం సినిమాల గురించి మాట్లాడుకుంటామా, అదే విజయతో ఐతే సినిమా కబుర్లు చెబుతామా చెప్పు. ఇది కూడా అంతేనన్నమాట"

"నువ్వు బలేమాటకారివి. నీతెలివితేటలన్నీ మన పత్రికలవాళ్ళు ఎప్పుడు గుర్తిస్తారో, నువ్వు పెద్దరచయితవైపోయి, అప్పుడీ చిన్నగదిఖాళీ చేసి, వేరే పెద్దబంగళాలోవుంటే, రచయిత గౌరీశం ఇంతకుముందు ఈ గదిలోనే వుండేవాడు తెలుసా- అని చెప్పుకుంటాం, ఆరోజెప్పు డొస్తుందో"

"దానికంత దూరమెందుకు? నేను ఈనెల అద్దె ఇయ్యలేదనుకో, వచ్చేనెల్లోనే చెప్పుకోవచ్చు"

తరువాత, సినిమాల మీదకు మళ్ళింది సంభాషణ. అరగంటసేపు కూర్చుని వెళ్ళిపోయింది అరుణ.

★ ★ ★

ఖర్చుపెట్టడానికి, ఉన్నవాళ్ళలాగా సరిపోయినంత డబ్బులేక, పెట్టకుండా వుండటానికి లేనివాళ్ళలాగా సరిపుచ్చుకోలేకా మధ్యతరగతి వాళ్ళు అప్పులపాలుకావటం సహజం. ఈ నిజాన్ని అబద్ధం చేయాలన్న ఆసక్తీ, చేయగలంత దమ్మూ వున్నవాళ్ళు ఎంతో అరుదుగా వుంటారంటే కూడా నమ్మబుద్ధికాదు. ఇది ఈ యుగధర్మం. ఒకవైపు ఆశ, తమ పిల్లలు మంచి చదువులు చదువుకోవాలి, కనీసం వాళ్ళైనా తమకన్నా సుఖంగా బతకాలి, తమ కూతుర్లకు మంచి స్థితిలోవున్న వరుణ్ని చేయాలి, ఇంతేకాదు, ఫలానావారు పెళ్ళి ఎంత బ్రహ్మాండంగా చేశారో- అని పదిమందీ చెప్పుకోవాలి. ఫలానా ఆయన అల్లుళ్ళంతా డాక్టరు, ఇంజనీరులాంటివాళ్ళేకానీ సామాన్యులుకాదని అందరూ అనుకోవాలి. ఈ అత్యాశలు ఒకవైపు చుట్టుముట్టి, పక్కవాడితో పోల్చుకుని అంత ఎత్తుకు ఎగరాలనే కోరిక. ఆ కోరికలు రగిలించే వరులగొప్పతనంపట్ల అభిలాష. ఉట్టికెక్కలేనయ్యలు స్వర్గానికి ఎగరబోయి కాళ్ళు విరగ్గొట్టుకునే అశక్తత లోకం పోకడగా, ప్రపంచపు తీరుగా యుగధర్మంగా చెలామణీ అవుతూంది. ఈ ధర్మానికి బలైపోతున్న అమాయకులను ఆదుకోవటానికి - సంభవామి యుగే యుగే - అన్న ఆ కృష్ణుడు రాడేమీ అని ఎదురుచూసే గీతా పారాయణపరులు కూడా ఎవ్వరూలేరు. ఈ ధర్మాన్ని తప్పి చరించడానికి వెంకటేశం అధర్మపరుడేమీకాదు కూడానూ.

తమ కన్యను తామే, తమ స్వహస్తాలతో, ఎదురుడబ్బులిచ్చి మరీ దానంచేసే తండ్రులు భారతదేశ జనాభాలో ఆడపిల్లల తండ్రుల లెక్క ఎంతవుందో అంతమందీ వుంటారు. అందులో ఓ అంకెను తగ్గించాలనే అభిప్రాయంగానీ, ఆలోచనగానీ వెంకటేశంకు లేదు.

ఏడాదిగా అరుణకు పెళ్ళి సంబంధాలు చూస్తూనే ఉన్నారు. అంత సులభంగా కుదురుతుందన్న ఆశ ఎవరికీ లేకపోవటంవల్ల సంబంధాలు వెతకటంలో అంత ఆసక్తి చూప




సంబంధం కుదరటంతో హడావిడి మొదల యింది. ముఖ్యంగా అబ్బాయికి అరుణ అందం బాగా నచ్చి, తల్లిదండ్రులతో మంకు పట్టుపట్టి కూర్చోవటంతో, వాళ్ళు కట్నంతోసహా లాంఛనాలన్నీ కలిపి పదివేలకు ఒప్పుకున్నారు. పెళ్ళికొడుకు ప్రమేయం కట్నం తగ్గటంలో ఉందని తెలిసిన తరువాత అతని దగ్గర తమ కూతురు సుఖపడుతుందనే నమ్మకం కుదిరింది. అబ్బాయికి ప్రభుత్వోద్యోగం ఉంది. ముఖ్యంగా ఇంత తక్కువ కట్నంతో పెళ్ళికుదరటం కష్టమే. పైగా, కొంపదీసి అరుణ చదువుతున్న బియ్యే పూర్తయితే, అంతకన్నా ఎక్కువ చదువుకున్న వాడు కావాలి. అప్పటికి, మళ్ళీ అంత చదువుకున్న కుర్రాడు ఎంత కట్నం అడుగుతాడో తెలీదు. ఇవన్నీ ఆలోచించి ఎలాగోలా ఈ సంబంధం ఖాయం చేసుకుని, అరుణ బాధ్యత వదిలించుకోవటమే మంచిదని నిశ్చయించుకున్నారు. ఇక ప్రయత్నాలు మొదలైనాయి.

ఏ సమస్యకు పరిష్కారం కావాలన్నా ఏ కష్టంలో సలహా ఇవ్వాలన్నా వెంకటేశంకు గుర్తొచ్చే ఏకైక వ్యక్తి చలపతి. మొదట్నించీ ఈ సంబంధం విషయంలో వివరాలు కూడా చలపతికి పూసగుచ్చినట్టు తెలియజేస్తూనే ఉన్నారు. ఈ సంబంధం వదులుకోవద్దని చలపతి కూడా చెప్పటంతో ఇక పెళ్ళికి నడుంబిగించాడు వెంకటేశం. మొదటి ప్రయత్నంగా వెయ్యి రూపాయలకు తాకట్టు పెట్టిన బంగారు గొలును అమ్మేద్దామని నిర్ణయించుకున్నాడు. అప్పటికి తీరిన అప్పుపోను, దాన్ని అమ్మితే ఓ వెయ్యి రూపాయలొస్తాయి. కానీ పెళ్ళికి మళ్ళీ ఎలాగూ బంగారం కొనాల్సివస్తుంది కనుక, అదే గొలుసును మార్పిస్తే మంచిదని విజయ చెప్పటంతో అదీ నిజమేనని ఊర్కున్నాడు. మిల్లులోవాళ్ళు వెంకటేశం అవసరం గుర్తించి, తమలో తాము నడుపుకుంటున్న చిట్టీలో చేర్చుకున్నారు. ఆ రకంగా నాలువేలపైన డబ్బొచ్చింది. మూడేళ్ళపాటు నెలకు నూటా ఇరవై రూపాయలు తీర్చాలి. అది ఎటూ సరిపోదు. నిశ్చయతాంబూలాలకే ఏడెనిమిది వందలు ఖర్చయింది. నెలలోపునే ముహూర్తం నిర్ణయించుకున్నారు. పనులన్నీ వారంలోపున మొదలెడితే కానీ తెమలవు. ఇక కొడుకుని వెంటబెట్టుకుని, భార్య సమేతంగా చలపతి ఇంటికి వెళ్ళాడు వెంకటేశం. అది ముందే ఊహించాడు చలపతి. అప్పటికే తన ప్రయత్నాలు తాను చేశాడు.

"ఏదో ఒరకంగా నువ్వే ఆదుకోవాల్రా తమ్ముడూ! లేకపోతే ఈ కార్యం గడిచి గట్టెక్కటం మావల్లకాదు"

"అవున్లే వదినా... అయినవాళ్ళమన్నాక ఇలాంటప్పుడు కాకపోతే ఇంకెప్పుడు పనికొస్తారు" అంది సరోజ.

"నీకు తెలియందేముంది బావా– సిటీల్లో సంసారాలు. ఎంత సంపాదించినా లోటేకానీ మిగులనేదిలేదు. నాది సొంత ఇల్లంటూ ఒకటి వదిలేస్తే మిగతా విషయాలన్నీ నువ్వూ, నేనూ ఒకటే. అసలా మాటకొస్తే నీవి అవసరార్థపు అప్పులైతే, నావి ఆడంబరాలకోసం చేసినవి"

భర్త మాటలు వినగానే సరోజకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇంతకూ ఈయన చెప్పబోతున్నదేమిటి? తనూ చేతులెత్తేస్తే వాళ్ళు చాలా కష్టాల్లో పడతారు పాపం, అనుకుంది.

"నువ్వే అలాగంటే ఎలారా చలపతీ! నా జీతంలో నేను తీర్చలేకపోవచ్చు. కానీ వీడికి ఉద్యోగం వచ్చాక కొండంత ఆసరాగా ఉంది. పైగా మా విషయం నీకు వేరే చెప్పుకోవాలా ఏమిటి?"

"బావా... నేనూ నీలాగే ఉన్నానని అన్నాను గానీ, తూనా బొడ్డని అన్నానా. అట్లా మాట్లాడతావేం బావా! ఇంతకూ విషయమేమిటంటే, మనకు ముందూ వెనకా ఏదైనా ఉంటేనే రూపాయి అప్పుపుట్టటం కష్టం. అలాంటిది నోటిమాట హామీగా ఇంత డబ్బు కావాలంటే ఎలాగా– అని నేను సంబంధం మాట్లాడుకున్నప్పట్నించీ మధనపడుతూనే ఉన్నాను. ఇంతకీ ఎంత అవసరముంటుందో ఏమైనా ఆలోచించారా?"

వెంకటేశం కొడుకు వైపు చూశాడు. ఇక తప్పనిసరిగా నారాయణ మాట్లాడాడు–

"నాన్న మిల్లులో నాలుగువేలు తెచ్చాడు కదా మావయ్యా! ఇక ఓ ఎనిమిదివేలు సరిపోతుందనుకుంటాను, ముందు వడ్డీకడుతూ

మెల్లిగా అప్పుతీర్చొచ్చు"

ఆ మాట వినగానే పెద్దగా నవ్వుతూ, వెంకటేశంకేసి తిరిగాడు చలపతి–

"వచ్చిన జీతం తెచ్చి చేతిలో పోయటంవరకూ తప్ప, వ్యవహారంలో వీణ్ని నమ్ముకుంటే అంతేనంగతులు బావా!"

తనన్నదాంట్లో తప్పేముందో అని ఆలోచించసాగాడు నారాయణ. నిజానికి తన ఇల్లు సుఖంగా గడిచిపోవాలనే తలంపు తప్ప మరేదీ ఆలోచించడు. అందుకు తనవంతు కర్తవ్యం తను నెరవేరుస్తూనే ఉన్నాడు. చలపతి ఏదో ఓ రకంగా ఆదుకోకపోడని తెలిసినా, అతనికి తన పట్ల ఉన్న అభిమానంకొద్దీ, తను అడిగితే ఇక కాదనడని భావించి అతన్నికూడా మాట్లాడమని దార్లో తల్లిదండ్రులు చెప్పటం మూలానా, తండ్రి తనను మాట్లాడమన్నట్టు చూడటంవల్లా ఆ మాత్రం నోరు విప్పాడు. లేకపోతే అదీ మాట్లాడేవాడుకాదు. ఇంతకూ వడ్డీతోపాటు అప్పుకూడా కడితే మరి ఇల్లుగడవటం ఎలా అని అనుకున్నాడు–తనన్న మాటల్ని నెమరేసుకుంటూ.

"అసలు వీడికి మాట్లాడటమేరాదు. లోకవ్యవహారం అసలు తెలియదు. అసలిలా కూర్చోవటం వాడికే ఇబ్బంది. వీడిబదులు విజయను వెంటబెట్టుకొస్తే అది నాలుగు మాటలైనా మాట్లాడేది. ఈమధ్య ఏడాది, రెండేళ్ళుగా మీరు అన్నీ దానిమీదే వదిలేస్తున్నారట. సుధాగాడొచ్చి వాళ్ళత్తమ్మ దగ్గర రెండు మూడుసార్లు ఏడ్చిపోయాట్ట" నవ్వుతూ అన్నాడు చలపతి.

"విజయకున్న తెలివికి, కుదురుకు తనను చేసుకునేవాడు పువ్వుల్లో పెట్టి పూజించుకోవచ్చు. ఎలాంటి మొగుణ్నయినా చక్కదిద్దుకుంటుంది" అంది సరోజ మెచ్చుకోలుగా.

"ఇంతకూ విజయ ఏమందో చెప్పు అక్కా? దానికేదో మంచి ఆలోచన వచ్చివుండకపోదు–ఏంబావా?" మళ్ళీ అడిగాడు చలపతి.

"దానికి తోచినంతలో అది చెప్పిందనుకో. విజయన్నదేమంటే పదిహేను వేల చిట్టీఏదైనా ఉంటే, నువ్వు ఇప్పించగలిగితే, వడ్డీల బాధలేకుండా ఉంటుందని అంది. నీకు ఆ మాటే చెప్పమందిగానీ, నువ్వేమంటావోనని చూస్తున్నాను" చెప్పాడు వెంకటేశం.

చలపతి నారాయణవైపు చూస్తూ అన్నాడు–

"చూశావురా నారాయణా... నువ్వేమో ఎనిమిదివేలు చాలంటివి, అదీ వడ్డీకని. ఐదు రూపాయల వడ్డీ అయినా నెలకు నాలుగొందలు. ఈ లెక్కన అసలెప్పుడు తీరుతుంది? కొంచెం లోకవ్యవహారంకూడా తెలుసుకోరా బాబూ!" అంటూ వెంకటేశంవైపుతిరిగి, "సరిగ్గా నేనూ అదే అనుకున్నాను బావా! నీకు మాత్రం తెలియందేముంది– వాళ్ళడిగింది పదివేలుకాక మనకు చేతిలో ఐదారువేలైనా లేకుండా కష్టమే అవుతుంది"

"ఇప్పటికిప్పుడు చిట్టీ ఎవరిస్తారంటావు?"

"వ్యవహారం ఎప్పుడూ పీకలమీదికొచ్చేవరకూ కూర్చోకూడదు బావా! మీ పెళ్ళిమాటలు మొదలైనప్పుడే చిట్‌ఫండ్స్‌లో తెలిసినాయనకు నేను చెప్పివుంచాను. పదహారువేల చిట్టీ ఒకటుంది. మొదలై రెణ్నెల్లయింది. మూడో నెల కంపెనీవాళ్ళే తీసుకుంటారు. అది మనకిప్పిస్తానని ఆయనన్నాడు. ఈ రెండు నెలలూ ప్లస్ మూడోనెలా కలిపి పన్నెండొందలు కట్టేస్తే, ఐదు పర్సెంటు కమీషన్ తీసుకుని ఐతే, నెలనెలా పాటపాడినాక అందరికివచ్చే కమీషన్‌మాత్రం మనకురాదు. ఎప్పుడు పాట ఎంతకు పోయినా మనంమాత్రం నాలుగొందలూ కట్టెయ్యాలి. ఇక మీరు ఆలోచించండి... చేతికి పధ్నాలుగు వేలొస్తాయి"

వెంకటేశంకూ, జగదాంబకూ ప్రాణం లేచొచ్చింది. నారాయణ ఆఫీసునుండి తేవలసిన సర్టిఫికెట్లూ వగైరా చెప్పి, ఎవరైనా ఒకరు గ్యారంటీ ఇవ్వాలనీ, తను ఇవ్వటానికి తన ఆఫీసు రూల్సు ఒప్పుకోవనీ చెప్పాడు చలపతి. మళ్ళీ ఆలోచనలో పడ్డారు. పెళ్ళి వ్యవహారాలూ, బంధువులగురించీ కాసేపు మాట్లాడుకున్నారు. భోజనం చేసిగానీ వెళ్ళేదిలేదని సరోజ పట్టుబట్టడంతో ఇక వుండిపోయారు. చివరకు వెళుతున్నప్పుడు చెప్పాడు చలపతి–

"కొనాల్సినవన్నీ మనకు తెలిసినవాళ్ళ దగ్గర తీసుకుందాం. ముఖ్యంగా బట్టలు. నాకు విమల్‌షేర్ కూపన్స్ వున్నాయి వాటిమీద కొంటే కొంత చౌకలో వస్తాయి. ఏమైనా పనులక




వసరం పడితే సరోజని ఎప్పుడంటే అప్పుడు తీసుకెళ్ళండి. ఇకపోతే గ్యారంటీ విషయం తొందరగా కానిచ్చెయ్యండి, ఏ పని మొదలెట్టాలన్నా ముందుగా డబ్బు చేతిలో వుండాలి''

ముగ్గురూ వెళ్ళిపోయారు. పిల్లలిద్దరూ అప్పటికే పడుకున్నారు. ఇక భర్త తిరిగ్గా కూచోగానే అంది సరోజ-

"అదేమిటండీ... మీరు వాళ్ళను ఆదుకుంటారనుకున్నానుగానీ, ఇలా చేశారేమిటి?''

"నేనిప్పుడు ఆదుకోవటంకాక ఏంచేశాననుకుంటున్నావు?'' ఆశ్చర్యంగా అన్నాడు చలపతి.

"అదికాదు- మనం ఈజీగా ఐదారువేలైనా ఇవ్వొచ్చువాళ్ళకి. వాళ్ళగురించి మనకు తెలియందీ కాదు. కనీసం మీరు కడుతున్న చిట్టీ ఇచ్చినా, నెలనెలా పాటమీది కమీషన్ వాళ్ళకు కొంతకాలం మిగిలేది కదా. అందులో మనకు నష్టం కూడా లేదు''

"సరోజా... ఇలాంటి వ్యవహారాలు ఇంతవరకు ఫ్రెండ్స్‌తోనేతప్ప బంధువులతో జరగలేదు కనుక నీకు తెలీదు. అంచేత వివరంగా చెబుతాను. మనకు అకౌంట్లో ముప్పైవేలపైనే వుంది. ఐదారువేలేం ఖర్మ, వాళ్ళకు అవసరమైనదంతా ఇవ్వొచ్చు. కానీ ఒకవిషయం గుర్తుంచుకో- నీదగ్గర వందరూపాయలున్నాయనుకో, అందులోంచి ఒకరూపాయో, రెండ్రూపాయలో అప్పుగా ఇయ్యి స్నేహితులకు. అదైనా వాళ్ళు తిరిగి ఇస్తారనే ఆశ పెట్టుకోవద్దు. ఏ కారణంతోనైనా వాళ్ళు ఇవ్వలేదనే అనుకో, అది పెద్దనష్టం కాదు. అయినవాళ్ళతో డబ్బు వ్యవహారాలు పెట్టుకుంటే వున్నసంబంధాలు చెడిపోతాయి. వాళ్ళు నిజంగా కష్టంలో వుండి తీర్చలేకపోయినా డబ్బుండీ తీర్చటంలేదని మనం అనుకోవచ్చు. మనకు నిజంగా అవసరముండీ మనం అడిగినా, కాబూలీవాళ్ళలా పీడిస్తున్నామని వాళ్ళు అనుకోవచ్చు. అంచేత నేను చెప్పినట్టు వందరూపాయల్లోంచి ఒకటో రెండో ఇచ్చామనుకో, ఆవిషయం పట్టించుకునే పనుండదు. అదీగాక మన డబ్బు ఎవరికో ఇచ్చాక మనకే అవసరమొచ్చిందనుకో, అప్పుడు మన సంగతి?''

నములుతున్న పాన్ ఉమ్మేసి వచ్చి, మళ్ళీ చెప్పాడు చలపతి-

"మనం కడుతున్న చిట్టీ వాళ్ళకిమ్మన్నావు. మరి మనకు అవసరమైనప్పుడెట్లా అనేది ఒకటి. అంతకన్నా ముఖ్యం, అక్కడ ఆక్షన్‌లో పోటీలుపడి పాడిన తరువాత వస్తుందో రాదో తెలియదు. వచ్చినా చేతికి ఎంతొస్తుందంటావ్? అంతకన్నా ఫైవ్‌పర్సెంట్ కమీషన్ వాడికిచ్చి, నికరంగా డబ్బు తీసుకుని, కమీషన్ వదులుకోవటం పెద్దనష్టమా చెప్పు?''

"అవునండోయ్... ఆమాటా నిజమే. కాకపోతే మారిటీ మీరిస్తే బాగుండేదికదా, పాపం వాళ్ళెన్ని అవస్థలుపడతారో''

"తమ అవసరంకోసం తాము అవస్థపడటం తప్పదు. ఆమాత్రం కూడా వాళ్ళు చేసుకోకపోతే ఎట్లా? ఉదాహరణకు చెబుతున్నాను- నన్ను చెడుగా అనుకోకు. మన పెళ్ళికి ముందు మా వూళ్ళో మా అన్నయ్య ఒక పెద్దమనిషికి మారిటీ ఇచ్చాడు. మూణ్నెల్లకు ఆయన గుండెపోటొచ్చిపోయాడు. వాళ్ళకు వెనకాముందూ ఆధారంలేదు. ఆయన కొడుకులు తర్వాతెప్పుడో ఇస్తారో లేదో వేరేవిషయం... ముందుగా మా అన్నయ్యమాత్రం వుట్టిపుణ్యానికి అప్పుతీర్చాల్సి వచ్చింది. అన్నీ ఇలాగే జరుగుతాయని కాదు, మన జాగ్రత్తలో మనం వుండాలి''

"మీరు చెప్పేది బానేవుంది. ఇక అందరూ ఇలాగే అనుకుంటే ఒకరికొకరు చేసుకునేదేముంది?''

"నాగురించి బాగా తెలిసి కూడా నువ్విట్లా అనటం తప్పు సరోజా. నేను ఈ డబ్బు యిప్పించటం ఎంత గొప్ప సహాయమో లోకం గురించి తెలిసినవాడెవడికైనా సులువుగా అర్థమవుతుంది. కొనాల్సినవన్నీ మనకు తెలిసినవాళ్ళదగ్గర చౌకలో ఇప్పిస్తానన్నాను. బట్టలకు మన డిస్కౌంటు కూపన్లిస్తానన్నాను. నిజానికి అది మనకు నష్టమేనా కాదా? ఇక మా అక్కయ్య సొంత అన్నదమ్ములెవరూ చుట్టంచూపుగా రావటంతప్ప ఏమీ చేయరు. నేనే ముందు నిలబడాలి. ఎంతలేదన్నా, పెళ్ళి ప్రెజెంటేషన్‌కాక వెయ్యిరూపాయలైనా అవుతుంది. పైగా ఒక విషయం బాగా గుర్తుంచు

కో, సహాయం చెయ్యటమంటే ఒక్క డబ్బు ఇవ్వటమేకాదు, అవసరమైన సమయానికి అవసరమైన సలహా ఇచ్చేవాడు కూడా వుండ టు ఒక్కోసారి''- లేచి పాన్ ఉమ్మేసి, నోరు కడుక్కుని వచ్చాడు.

''అసలు నీకన్నా విజయ నయం సరోజా! చిట్టీ ఇప్పించమని మామయ్యనడగండి- అని చెప్పిందట అది. ఎవరు ఏ సహాయం చేయగ లరు, ఎవర్ని ఏ సహాయం అడగాలి- అనేది తెలియటం కూడా ఒక తెలివే''

''సరే పోనీండి... పాపం అన్నయ్య అమా యకుడు కనుకా, వాళ్ళు పడుతున్న కష్టాలు చూస్తున్నాం కనుకా నాకు వాళ్ళమీద జాలే స్తుందండీ. ఇక నారాయణకొచ్చే కట్నం విజ యకిచ్చి, రెండు పెళ్ళిళ్ళూ ఒకేసారి చేస్తే ఆ సమస్యైనా తీరిపోతుంది వాళ్ళకు''

అట్నుంచి సంభాషణ పెళ్ళిళ్ళూ, కట్నా లూ, తమ బంధువుల పెళ్ళిళ్ళలో జరిగిన విశేషాలూ చర్చించుకోవటంలోకి తిరిగింది.




ఇంటిల్లిపాదీ కూచుని కాసేపు చర్చించుకు న్నారు ఎవరు మారిటీ ఇస్తారు, ఎలా చేయాలీ అని.

''మన రాఘవయ్య మావయ్యనడిగితే ఇవ్వ నంటారా?'' సుధాకర్ సూచించాడు.

''పేరుకు మేనమామలేగానీ, వాళ్ళు ఏమీ చెయ్యరులేరా'' ఖండించాడు వెంకటేశం.

''అసలు మన చలపతి మావయ్య కావా లని తప్పించుకున్నట్టు అనిపిస్తూందిగానీ, మావయ్య తలుచుకుంటే అదో పెద్దపనా?''
అంది అరుణ.

''చలపతి మావయ్య చెయ్యగలిగినంత చేశా డుకదా! అన్నీ ఆయనమీదనే తోసేస్తేమాత్రం ఎట్లా చెప్పు. ఎవరి సంసారాలు వాళ్ళకు, ఎవరి కష్టాలు వాళ్ళకు'' అంది విజయ.

''అదీ నిజమేనే. అసలీరోజుల్లో ఆమాత్రం సాయంచేసే వాళ్ళు మాత్రం మనకెవరున్నా రు? అక్కడికీ వాడు మనకన్నా ముందుగానే పూనుకుని, ఆలోచించి పెట్టాడు'' వెంకటేశం అన్నాడు నిట్టూరుస్తూ.

''ఒక ఐడియా'' అన్నాడు సుధాకర్, ''జనా ర్ధన్‌గారినడిగితే...?''

''జనార్ధన్‌గారినా... ఏం బావుంటుందిరా, నీమొహం'' అన్నాడు నారాయణ.

''బావుండటమేమోకానీ, అసలాయన ఏమంటాడో?'' వెంకటేశం సందేహం వెలిబు చ్చాడు.

''లేదు నాన్నా... మనకు తెలిసినంతవరకూ మనను నమ్మినా, మారిటీ ఇయ్యగలిగినా ఆయ నొక్కడే'' ఏదో ఆలోచిస్తూ అంది విజయ.

''అబ్బ... ఇన్నాళ్ళకైనా నేను చెప్పింది ను వ్వొప్పుకున్నావే'' గర్వంగా అన్నాడు సుధాకర్.

''నీదొక సొద మధ్యలో, నువ్వు కాస్త ఆగురా'' విసుక్కుంది అరుణ.

చివరకు జనార్ధన్‌ను అడగాలని నిర్ణ యించుకుని, మరునాడు తొమ్మిదికల్లా టైప్ ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళారు నారాయణా, వెంక టేశం.

''ఏమిటీ... అప్పుడే పెళ్ళి పత్రికలు పంచే వరకూ వచ్చిందా?'' అన్నాడు జనార్ధన్, తండ్రీ కొడుకుల్ని చూడగానే.

ఇన్‌స్టిట్యూట్ లోపలున్న చిన్నగదిలోకి వెళ్ళి కూర్చున్నారు, మెల్లిగా విషయం వివరించాడు వెంకటేశం.

''పెద్దవాళ్ళు- మీముఖం చూసి ఒప్పు కుంటున్నానుగానీ, నిజానికసలు మీ నారా యణ చేసిన పనికి ఒప్పుకోవాల్సింది కా దండీ'' అన్నారు జనార్ధన్, నారాయణవంక గుర్రుగా చూసి.

ఒప్పుకుంటున్నానని ఆయనవగానే ఇద్దరికీ సంతోషం వేసిందిగానీ నారాయణేం చేశాడో అర్థంకాక ఇద్దరూ తెల్లమొహాలు వేశారు.

"నారాయణేం చేశాడనేగదా మీరు అనబో యేది... చెబుతాను. ఇన్నేళ్ళుగా నాదగ్గర పని చేస్తున్నాడా, నాగురించి తెలిసుండాలి కదా! నేనేదో డబ్బులకోసమే ఇన్స్టిట్యూట్ పెట్టుకుని కూర్చున్నట్టు చేశాడండీ మీ కుమారుడుగారు. అసలు మామూలు స్టూడెంట్స్ ఫీజు ఆలస్యంగా ఇచ్చినా, ఎప్పుడైనా తక్కువిచ్చినా, ఎగ్జామినేషన్ ఫీజులు తక్కువిచ్చి ఎగవేసినా, తెల్లకాగితాలు కొనుక్కోకుండా ఇన్స్టిట్యూట్లోవి వాడుకున్నా నేను ఎన్నడైనా పట్టించుకున్నానా... అడగండి ఒకసారి" కోపంగా అన్నాడాయన.

అప్పటికి విషయం అర్ధమై ఏదో అనబోయాడు నారాయణ. అతన్ని వారిస్తూ, మళ్ళీ ఆయనే చెప్పాడు వెంకటేశంతో.

"అలాంటిది, ఏదో గవర్నమెంటుద్యోగం, బోడి ఉద్యోగం ఒకటి రాగానే ఈనెల టైప్ ఫీజట విజయ చేతికిచ్చి పంపించాడు. ఇంత మంది ఇన్స్ట్రక్టర్ల తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ ఫ్రీగానే నేర్చుకుంటున్నారు కదా. నా దగ్గర ఉద్యోగం మానేసినంత మాత్రాన ఇహ ఫీజులివ్వాలా. అసలు ఎప్పుడొస్తాడా దులిపేద్దామని అనుకుంటున్నానుగానీ, మూడుసార్లూ నేను ఎవరితోనో మాట్లాడుతుండగా వచ్చి, ఇలా కనిపించి, అలాపోయాడు. నోట్లో నాలుకలేదన్నట్టుంటాడు కానీ ఎంత అసాధ్యుడండీ"

"పోనియ్యండి, ఆ విషయం. అయిపోయింది గదా" వెంకటేశం అన్నాడు.

"ఎలా పోనియ్యాలండీ. నెలనెలా ఆపిల్ల ఫీజు తీసుకొచ్చి ఇస్తుంటే నాకు ఎలా అనిపిస్తుంది. చూసేవాళ్ళేం అనుకుంటారు చెప్పండి. చేసినన్ని రోజులూ రాత్రనకా పగలనకా పనిచేయించుకుని, ఇప్పుడేమో ముప్పైపదిహేను రూపాయలకు కక్కుర్తిపడుతున్నాడని నా గురించి అనుకోరూ"

"ఏదో మీరు మంచివారు కనుక అలా అన్నారు కానీ, ఈ రోజుల్లో మీలా ఆలోచించేవారు ఎవరున్నారు చెప్పండి" అనునయిస్తున్నట్టుగా అన్నాడు వెంకటేశం.

"సరే... ఇక అసలు విషయానికి వద్దాం. నిజానికి నేనే ఓ అయిదు వేలు సర్దుబాటు చేసి, మీరిచ్చినప్పుడు తీసుకోవచ్చు. కానీ మా పిల్లలు పెద్దవాళ్ళయిపోయారు. లేనిపోని రాద్ధాంతాలు చేస్తారు. కనీసం ఈ రకంగానైనా ఆదుకుంటున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది. కానీ ఒక విషయం..." అని ఆగాడాయన ఆలోచిస్తూ.

మళ్ళీ ఏమైనా తిరకాసుందా అని అనుకున్నాడు వెంకటేశం.

"ఏమీలేదు... నేనిలా షూరిటీ ఇచ్చిన విషయం మీ చలపతికి తప్ప ఎవరికీ తెలియనీయకండి. ముఖ్యంగా మావాళ్ళకు. అందరూ వచ్చి పీకల మీద కూర్చుంటారు. ఇప్పుడైనా అసలు తీర్చుకునేది మీరే గనుక, నారాయణ గవర్నమెంట్ ఉద్యోగంలో వున్నాడు గనుకా నాకు యేపేచీ లేదు గనుకా, ముఖ్యంగా, మా నారాయణ చెల్లెలి పెళ్ళి గనుక, ఏదో శుభకార్యానికి ఆదుకున్నట్టుంటుందనీ ఒప్పుకుంటున్నాను"

వెంకటేశం లేచి, జనార్ధం రెండుచేతులూ పట్టుకుని కృతజ్ఞతతో చెప్పుకున్నాడు-

"నిజంగా చెబుతున్నాను. బయలుదేరినప్పుడు నాకు నమ్మకంలేదు. కానీ మీరు ఒక్క మాటలో ఒప్పుకున్నారు. ప్రమాణపూర్తిగా చెబుతున్నాను. మీకు ఒక్క మాట రాకుండా ప్రతి నెలా ఖచ్చితంగా తీర్చేస్తాం. మీ రుణం ఎలా తీర్చుకుంటామో మరి"

వెంటనే జనార్ధన్ నొచ్చుకుంటున్నట్టుగా అన్నాడు-

"అయ్యో, అవేం మాటలండీ. ఏదో భగవంతుడు నన్ను చల్లగా చూస్తున్నాడు గనుక నేనిలావున్నాను. అంతే. ముఖ్యంగా మీ నారాయణ మొహం చూసిమాత్రమే ఒప్పుకున్నాను. నేను కూడా అసలు ఎవరి విషయాల్లో తలదూర్చను"

"ఇక వస్తామండీ" బయలుదేరారు.

"మీకు ఎప్పుడు అవసరమో ఓ పావుగంట ముందు చెప్పి పంపండి. నేను సాయంత్రం చలపతితో మాట్లాడతాను. మీరు మాత్రం నేను చెప్పింది గుర్తుంచుకుని, ఎవరితోనూ అనొద్దు"

తండ్రీ కొడుకులిద్దరూ తేలికైన మనసుతో బైటపడ్డారు. నారాయణ అట్నుంచటే ఆఫీ

నుకు వెళ్ళగా, వెంకటేశం భగవంతుడికి కృత జ్ఞతలు చెప్పుకుంటూ ఇంటి దారిపట్టాడు.

★ ★ ★

పెళ్ళిపనులు మొదలైనాయి. బట్టలలిస్టులు, పనుల లిస్టులు, పిలవాల్సిన వాళ్ళ లిస్టులు, సరుకుల లిస్టులు తయారు చేయటంలో పడిపోయారు. అరుణ ఓసారి రేడియోలో పాటపాడింది. అప్పుడు చెక్కు సంతకం కాకపోవటం వలన వాళ్ళు క్రాస్ చేసి పోస్టులో పంపించారు. ఆవిధంగా అరుణ పేరున నామకార్థం ఒక అకౌంటుంది బ్యాంకులో. తెచ్చిన డబ్బులన్నీ ఇంట్లో వుంచటం మంచిదికాదని బ్యాంకులో వేసేశారు. గౌరీశం కూడా తన పనులు కాస్త పక్కన పెట్టుకుని బైటి పనుల్లో సహాయంచేశాడు. చుట్టుపక్కల ఆడవాళ్ళ సహాయంతో జగదాంబ, అరుణ ఇంట్లో పనులు చేయసాగారు. వెంకటేశం వారం రోజులపాటు లీవ్ పెట్టాడు. నారాయణ మూడురోజులు మాత్రమే లీవ్ తీసుకున్నాడు. మధ్యలో సరోజ కూడా వచ్చి చేయికలిపింది. చలపతి లీవ్ లేకుండానే పనుల్లో పాల్గొంటున్నప్పటికీ రెండురోజులు లీవ్ పెట్టకతప్పలేదు. పిలవాల్సిన వాళ్ళను గురించి పెళ్ళి పత్రికలు ఇచ్చివచ్చే పని సుధాకర్ పాలపడింది. ఇక చేయటానికి ప్రత్యేకమైన పని ఏదీ లేకున్నా అందరికన్నా ఎక్కువ హడావుడీ శ్రీనుదే.

ఓరోజు విజయ తలిదండ్రుల్ని కూర్చోబెట్టి సరుకులు లిస్టు తయారు చేసింది.

"విజయా... అసలు సరుకులన్నీ చాలా ఎక్కువవుతాయేమోనే. అరుణను పిలువు. దానిక్కాస్త తెలును, అదైనా చెబుతుంది" అంది జగదాంబ.

"అయితే ముందు బియ్యం సంగతి చూడు, మూడున్నర సంచులు ఎంత ఎక్కువో" అంది విజయ నవ్వుతూ.

"అదే కదా, నేను చెబుతున్నదీ. అన్నీ తగ్గించెయ్యి మరి"

"అది కాదే... పెళ్ళైపోయాక మన సంగతేమిటి. నెలకు అయిదొందల పైన అప్పులు తీర్చేయాలా. అంటే అన్నయ్య జీతం అటు పోతే ఇక నాన్న ఒక్కడి జీతం మీదనే ఇల్లు గడవాలి"

"నిజమే కానీ, ఇంతకన్నా ఏం చేస్తాం చెప్పు" నిట్టూర్చాడు వెంకటేశం.

"అది కాదు నాన్నా నా ఉద్దేశమేమిటంటే, హఠాత్తుగా అంత తక్కువ డబ్బుతో మనకు చాలా కష్టమవుతుంది. ఇప్పుడిదే సరుకులతో మనకు మూణ్నాలుగు నెలలకు అవసరమైన బియ్యం, పప్పులూలాంటివి తీసుకుంటే, చాలా చౌకలో వస్తాయి. అదీకాక అవసరమైన కంటే కొంచెం డబ్బులు ఎక్కువే చేతిలో వుంచుకున్నాంకదా. అంచేత పెళ్ళిఖర్చులకూ ఇబ్బందికాదు. ఆ తరువాత మూణ్నాలుగు నెలల్లో ఏదైనా మార్గం ఆలోచించుకోవచ్చు"

"నిజమే సుమా... ఏమిటో నీపాటి ఆలోచన మాకు లేకపోయె. అయినా, నీ వయసులో మేం పెళ్ళిళ్ళు చేసుకుని అత్తారింటికి వచ్చామా, ఇక మా మాట విని చచ్చినవాళ్ళు కూడాలేరు, ఆ కాలంలో" అంది జగదాంబ.

"అందుకే, మన ఇంటి దగ్గర నాన్న మిల్లులోనూ వున్న చిల్లర అప్పులన్నీ కూడా తీర్చేయించింది. ఇక ఇప్పట్లో ఒక పైసా కొత్త అప్పు తెచ్చినా మనం తీర్చలేము"

"ఈ సామానులన్నీ పెద్ద బజారు నుండీ తేవటానికి ఇక ఆటోయే గతి, ఎన్నిసార్లు తిరగాలో"

"పెద్ద బజారెందుకు నాన్న మన ఖాతా షాప్ వుందిగదా"

"ఇవి కూడా వాడి దగ్గరెందుకే. బోల్డు ధరలెక్కువ" అన్నాడు వెంకటేశం.

"అది కాదు నాన్న, పెద్దబజారు ధరలకే ఓ పది పైసలు అటూ ఇటూగా వేసుకుని ఇమ్మంటే మన పావతను ఇస్తాడు. పైగా అరువొకచోటా, నగదొకచోటా తెచ్చుకుంటే బాగుండదు. మనం ఇన్నేళ్ళుగా ఎప్పుడెలా డబ్బులిచ్చినా ఊరుకుంటున్నాడు కదా"

"పనిలోపనిగా సబ్బులూ, పేస్టులలాంటివి కూడా తీసేసుకో ఒకేసారి" అన్నాడు వెంకటేశం.

"వద్దు నాన్నా... మూణ్నెలపాటు ఖాతామానేసి, హఠాత్తుగా వెళితే బాగుండదు. అతను




చేతివేళ్లు ఐదూ ఒక్కటిగా కలిస్తే
అవుతుంది పిడికిలి. అందులో వుంది గొప్పబలం. ఇలాగే...

# జండూ పంచారిష్ట

## ఐదు ఆయుర్వేద టానిక్‌ల అద్భుత మిశ్రణం. మీ జీర్ణశక్తిని పెంపొందింపజేస్తుంది.

ఎక్కువగా, జబ్బులకు కారణం జీర్ణశక్తి లోపించడమే. వాటి లక్షణాలు వేరువేరైనా, ఫలితం ఒక్కటే — జీర్ణశక్తి క్షీణించడం, ఆరోగ్యం చెడిపోవడం.

జండూ పంచారిష్ట ఐదు మహాత్వపూర్ణమైన ఆసవములు, అరిష్టముల మిశ్రమం — అశ్వగంధారిష్ట, లోహాసవము, దశమూలారిష్ట, కుమారీ ఆసవము మరియు అంగూరాసవము. జండూ పంచారిష్టలో ఈ ఐదింటి మిశ్రమం జరిగినపుడు ఒక విశిష్టమైన, శక్తివంతమైన టానిక్ తయారవుతుంది. ఇది మీ జీర్ణశక్తిని పటిష్ఠం చేస్తుంది. జండూ పంచారిష్ట ఆకలిని అధికం చేస్తుంది కూడా.

మీకు తెలిసిందే కదా ఆరోగ్యమే మహాభాగ్యం!




**జండూ పంచారిష్ట**
ఐదు ఔషధములతో
కూడిన జీర్ణకారి టానిక్

ZP/16/173 TEL

కూడా వెనకా ముందూ కావచ్చు. నెలనెలా ఇలాంటి చిన్న చిన్నవీ, అలాగే మంచినూనె ఒకసారే తీసుకుంటే ముక్కపట్టిపోతుంది గనుక అలాంటివీ తీసుకుంటూ, ఖాతా అట్లాగే ఉండనిస్తేనే మంచిది".

"సరేనే... నీ ఇష్టం. నీకేది మంచిదనితోస్తే అట్లాగే కానియ్"

సుధాకర్ పెద్ద బజార్లో రెండు మూడు దుకాణాలు తిరిగి తెచ్చిన లిస్టుకు ఐదు పది పైసలలెక్కన ముందు!గా తనే తగ్గించి మరో లిస్టు తయారుచేసింది విజయ. అది చూడ గానే ఖాతాషావువాడు ఏడుపుముఖంపెట్టాడు.

"అబ్బే... మాక్కూడా ఈ ధరలకు రావు తల్లీ" అన్నాడు.

"నిజానికి నీకు ఇంతకన్నా తక్కువకే వస్తాయి. నాకు తెలుసుగానీ, ఇంతకూ నువ్విస్తావా - పెద్దబజార్లో తెచ్చుకోమంటావా?"

"నువ్వేదో న్యూస్ పేపర్లో ధరలు చూసిరా నుకొచ్చినట్టున్నావ్ విజయా! ఈ ధరలకొస్తే ఇంతేసంగతులమ్మా... నా మాటవిను"

"నేను వినను. ఏదో ఇన్నేళ్ళుగా ఖాతా ఉంది కదా అని నీదగ్గర తీసుకోవటమేగానీ, పెద్దబజార్లో అసలింతకన్నా తక్కువకొస్తాయి" దబాయించింది విజయ.

ఇక చివరకు ఆ లిస్టులో ధరలపైన కిలోకు పదీ ఇరవై పైసల చొప్పున మార్చి ఇచ్చాడు. రెండు మూడుసార్లు ఆటోలో తిరిగే ఖర్చుకూ, అతనెక్కువేసిన మొత్తానికీ అంతగా తేడా లేకపోవటంతో చిన్నగా నవ్వుకుంది విజయ.

ఒకటి తరువాత ఒకటి పనులు పూర్తయిపోతున్నాయి. పెళ్ళికి రెండ్రోజుల ముందుగానే ఊళ్ళనుండి వచ్చే బంధువులు కొందరొచ్చారు. మరునాడు కొందరొచ్చారు. తడికెల పందిరి వేయిద్దామనుకున్నారుగానీ, అంతకన్నా టెంట్ హౌజ్‌వారి షామియానా చౌకలోనూ, శ్రమలేకుండా అయిపోతుందని చలపతి చెప్పటంతో పందిరి సంగతి మానేశారు. సుధాకర్ స్నేహితులు మనోహర్, సురేష్‌లాంటివాళ్ళు కూడా వచ్చి పనుల్లో సాయంచేశారు. పెళ్ళి వంటకు మాత్రం ఇద్దరు వంటవాళ్ళని పెట్టుకోవాల్సివచ్చింది. పెళ్ళిపనులు అయినన్ని రోజులూ దాదాపుగా గౌరీశం చలపతి అసిస్టెంటుగా బైటిపనులు చాలా చేసిపెట్టాడు. ఇహ తెల్లవారితే పెళ్ళి. ఇల్లంతా హడావుడిగా ఉంది.

అరుణ, శ్రీను కూర్చుని వచ్చిన పేరంటాళ్ళకు మల్లెపూల మాలలు గుచ్చుతున్నారు. అప్పుడే ఎక్కడికో వెళ్ళొచ్చిన గౌరీశం, విజయ పెట్టిచ్చిన టీ గ్లాసు తెచ్చుకుని వాళ్ళదగ్గర కూర్చున్నాడు.

"ఏమిటరుణా... పెళ్ళిచూపులు అయిందగ్గర్నించీ చూస్తున్నాను. అసలు ఉత్సాహమే లేదు"

"ఉత్సాహమంటే ఏం చేయాలి, లేచి డాన్స్ చేయాలా?"

"అలాగని కాదు, ఇంత దూరం వచ్చాక ఇలా అడుగుతున్నానని అనుకోకు, నీకీపెళ్ళి ఇష్టంలేదా?"

దీర్ఘంగా నిట్టూర్చి కాస్సేపు ఏదో ఆలోచించి చెప్పింది అరుణ-

"ఈ సంబంధం అనికాదు, అసలు నాకిప్పుడు పెళ్ళిచేసుకోవటమే ఇష్టం లేదు"

"మరామాట ముందే చెప్పెయ్యకపోయావా?"

"చెప్పి ఏం లాభం. నా మాట ఎవరు వింటారు? ఎప్పుడో ఓసారి పెళ్ళి చేసుకోక తప్పదుకదా అంటారు, అంతే"

"ఆ మాటా నిజమే అనుకో! ఐనా నీ అభిప్రాయం ఏమిటి? చదువు పూర్తిచేసి, కొన్నాళ్ళు ఉద్యోగంచేయాలనుకుంటున్నావా?"

"కాదు... మా అరుణక్కకు హీరోయిన్ కావాలనుంది" శ్రీను చెప్పేశాడు అసలు సంగతి.

"నిజమా... నువ్వు ఊరికే సినిమాల గురించి మాట్లాడుతుంటే, నేనేమో నీకు సినిమాలు చూసే పిచ్చి అనుకున్నానుగానీ ఇలా అనుకోలేదు" ఆశ్చర్యపోయాడు గౌరీశం.

"నిజమైతే మట్టుకు ఇప్పుడు చేసేదేముందిలే - పోనియ్ ఆ సంగతి" నిరాసక్తంగా అంది అరుణ.

"అరుణా... సినిమారంగం గురించి తెలిస్తే నువ్విలా అనవు. ఐనా ఇప్పుడు మాత్రం ఏమయింది, మీ ఆయన ఇష్టపడితే హేపీయే




గదా''

"అది జరిగే పనేనా గౌరీశం! ఇక పోనీమ న్నానుగదా, అంతా నా ఖర్మ"

"అదికాదుగానీ, నువ్విలా అనుకొని బాధప డుతూ కూర్చోకు. నీకు సంగీతం వచ్చుకదా, రేడియోలో కూడా ఎప్పుడో పాడానన్నావుకదా. ఆవైపు ప్రయత్నించు. శోభారాజులాగా మంచి సింగర్‌వు అవొచ్చు. లేకపోతే, బియ్యే పూర్తి చేసి, మీ ఆయనకిష్టమైతే ఏదో ఉద్యోగంలో చేరు. ఏదో ఓ వ్యాపకంలో పడి నాలుగు నాళ్ళయ్యాక పిల్లలు పుడితే ఇలాంటి ఆలోచ నలన్నీ అవేపోతాయ్'' చివరి మాట నవ్వు కుంటూ అన్నాడు.

అంతలో విజయా, సరోజా కూడా వచ్చి పూలు గుచ్చటానికి కూచున్నారు. ఇక ఏర్పాట్ల గురించీ, పెళ్ళి గురించీ సాగింది సంభాషణ.

చివరకు, పెళ్ళిరోజొచ్చింది. పెళ్ళైపో యింది. పెళ్ళికూతురు అత్తవారింటికి వెళ్లి ంది. అందరూ ఎవరి పనుల్లోవాళ్ళు పడిపో యారు. అచ్చంగా కాకపోయినా, ఆనవాయి తీగా తలతాకట్టుపెట్టి మరీ పెళ్ళి చేసినట్ల యింది. కన్యాదాన ఫలం దక్కించుకోగలిగాడు వెంకటేశం - తచ్చి బతికినంత పనిచేసి.

తనను తానే "హయ్యో పాపం" అనుకుని, కన్యాదాన ఫలం దక్కించుకున్న వెంకటేశంతో పాటు కొడుకు నారాయణకి కూడా నెలనెలా ఐదొందల రూపాయల పైచిలుకు పుణ్యం దక్కటం మొదలెట్టింది.

★ ★ ★

"మీ పేరేమిటి?" ఎదురుగా కూర్చున్న యు వకుణ్ణి చూస్తూ అడిగాడు సంపాదకుడు.

"గౌరీశమండీ"

"అవునవును... గుర్తొచ్చింది. ఇంతకు ముందోసారి కలిసినట్టున్నారుకదా"

"అవున్సార్..." అంటూ ఆగిపోయాడు గౌ రీశం.

"ఏమిటి... ఏమైనా ఆర్టికల్స్ తెచ్చారా? నేను చూడాలంటారా?"

"లేదండీ... అవి అక్కడే సెక్షన్‌లో ఇచ్చేశా ను..." మళ్ళీ ఆగాడు.

"పర్వాలేదు చెప్పండి... ఏమిటి విషయం?"

"నాకు కొంచెం రెమ్యూనరేషన్స్ రావాలి సార్"

"మా ఎడిటోరియల్ డిపార్ట్‌మెంట్ ఒక్కటే ఇక్కడుందండీ! మిగతా విషయాలన్నీ హెడ్డా ఫీసే. అందుకే కాస్త ఆలస్యమవుతుంది!

"అది కాదు సార్... దాదాపు సిక్స్‌మంత్స్ అయింది...''

"సిక్స్‌మంత్సా? మావాళ్ళు మూణ్నెళ్లకోసారి లిస్ట్ పంపిస్తుంటారు. వాళ్ళ దగ్గర ఎంతలేద న్నా నెలకన్నా ఎక్కువ ఆలస్యం అవదు. మీ పేరుగానీ మర్చిపోయారేమో - నేను కనుక్కొని పంపించమని చెబుతాను''

"కాస్త తొందరగా అందేట్టు చూడండిసార్! నాకు ఇదే ఆధారం"

"సరే... మీరో పనిచేయండి" అంటూ ఓ కాగితం తీసి ఇచ్చాడు.

"మీపేరు, పబ్లిష్ అయిన ఆర్టికల్స్ టైటి ల్సు, గుర్తుంటే డేట్స్ కూడా రాసి ఇవ్వండి. ఇవాళే పంపించమని చెబుతాను" అన్నారా యన.

ఆయన చెప్పినట్టుగా రాసిచ్చి, 'థాంక్స్' చెప్పుకుని బైటపడ్డాడు.

అక్కణ్ణించి మరో పత్రికాఫీసుకెళ్ళాడు.

"ఆయన ఎడిటోరియల్ రాసుకుంటున్నా రు. ఇప్పుడు వెళితే పలకరింపు తప్ప మాట్లాడ టానికి వీలుండదు. కాస్సేపు కూర్చుంటే మీరు కూడా తీరిగ్గా మాట్లాడే వీలుంటుంది మరి మీ ఇష్టం" చెప్పాడు, అక్కడి టైపిస్టు.

"కాస్సేపాగుతాను" అన్చెప్పి, కాస్తపక్కగా గోడవారనున్న బెంచీపైన కూర్చున్నాడు.

ఎదురుగా కలం పేరుతో రాసే ఓ పెద్దమని మన్నాడు. ఆయనా అందులోనే పనిచేస్తున్నా డు. ఆయన రచనలకు గొప్ప పేరుంది తెలు గు పాఠకుల్లో. సిగరెట్ పీలుస్తూ, ఆలోచిస్తూ ఏదో రాస్తున్నాడాయన.

ఆయన సిగరెట్ తాగటం చూడగానే గుర్తొ చ్చి, తనూ సిగరెట్ అంటించుకుని, ఏదో ఆలోచించసాగాడు. కాస్సేపటికి దగ్గరకు రమ్మని ఆయన సైగ చేయటంతో, లేచి వెళ్ళా

డు.

"మీ పేరేంటి?" అదోలా చూస్తూ అన్నాడాయన.

"గౌరీశం సార్"

"ఎవరికోసమొచ్చారు?"

"ఎడిటర్‌గారికోసమండీ?"

"మీ బంధువులా?"

మర్యాదకోసమైనా కూచోమనకుండా నిలబెట్టి మాట్లాడుతున్న ఆయన ధోరణికి చిరాకేసింది గౌరీశంకు. కానీ అదిపైకి కనబడనీయకుండా బదులిచ్చాడు.

"కథలు ఇద్దామని వచ్చానండీ - అంతే!".

"మరిక్కడ కూర్చున్నారేమిటి?"

"ఆయన ఎడిటోరియల్ రాస్తున్నారట. కాసేపు వెయిట్ చేయమన్నారు"

"సరే... వెయిట్ చేయండి. కానీ ఆఫీసులో సిగరెట్ కాల్చకూడదు" అసలు సంగతి చెప్పాడాయన.

"అబ్బే... మీరు కాలుస్తున్నారుకదాని నేనూ అంటించుకున్నానండీ! జనరల్‌గా నేను లోపల తాగను" గౌరీశం వివరించాడు.

చేసిన నేరంకంటే తీవ్రమైన సంజాయిషీ లాంటిదది. గౌరీశం జవాబుకు ఓ సారి భ్రుకుటి ముడిచి, సిగరెట్ పీల్చి, పొగవదులుతూ సమాధానంగా చెప్పాడాయన-

"మేం అంటే స్టాఫ్ తాగొచ్చుగానీ, బైటివాళ్ళు తాగకూడదు. మీరు సిగరెట్ తాగదలిస్తే, బైట చెట్టుకింద నిల్చుని తాగండి"

"మంచిద్సార్" అంటూ నీరసంగా బైటకు నడిచాడు గౌరీశం.

తనముందర ఓ బచ్చాగాడు తాపీగా కూచుని సిగరెట్ తాగుతున్నందుకు వచ్చిందన్నమాట ఆ కోపం. కథలూ, కవిత్వాలూ రాస్తారుగానీ, వీళ్ళక్కూడా సంస్కారం ఉండదన్నమాట. స్టాఫ్ తాగే సిగరెట్లకూ, బైటివాళ్ళు తాగే సిగరెట్లకూ తేడా ఏమిటో? ఈ వెధవ రచనలు ఇక జన్మలో చదవకూడదు - అనుకున్నాడు.

కాస్సేపటికి వెళ్ళేసరికి ఎడిటర్ తీరిగ్గా ఏవో రచనలు పరిశీలిస్తూ కూచున్నాడు. గౌరీశం వెళ్ళగానే గుర్తుపట్టి కూర్చోమన్నాడాయన-

"మీ పేరు గౌరీశంకదూ?"

"అవున్సార్"

"మళ్ళీ ఏమైనా కథలు తెచ్చారా?"

"రెండు తెచ్చాన్సార్" అంటూ అందించి-

"ఫైవ్‌మంత్స్ క్రితం మీకు పర్సనల్‌గా మూడు కథలిచ్చాన్సార్...." అన్నాడు.

"మీ కథ ఒకటి లాస్ట్‌మంత్ ఏదో ఒక ఇష్యూలో వచ్చినట్టుందే"

"అవున్సార్... థర్డ్‌వీక్‌లో వచ్చింది. అదికాక మీరు మరో కథ నాముందరే చదివి బావుందన్నారు. అదీ, మరొకటీ ఏమయిందో తెలీటంలేదుసార్".

ఓ క్షణం ఆలోచించి చెప్పాడాయన-

"నాకు సరిగ్గా గుర్తులేదుకానీ మీ కథల్లో ఒకటో రెండో రిటర్న్ చేశాను. మీకందలేదా?"

"అందలేదండీ"

"మా సెక్షన్‌లోకెళ్ళి ఓసారి సెలెక్టయిన కథల ఫైలూ, రిటర్న్‌చేసిన ఫైలూ చూసి చెప్పమనండి. ఉంటే తీసిస్తారు. లేకపోతే పోస్ట్‌లో పోయినట్టే" నవ్వుతూ అన్నాడాయన.

"సార్... ఒక మాటడుగుతాను...."

"అడగండి" నవ్వుతూ అన్నాడాయన.

"మరేంలేదు - మీరు సెలెక్షన్ చేయటమూ, తర్వాత పబ్లిష్‌చేయటమూ కూడా చాలా లేటవుతోంది. ఎందుకన్సార్?"

"మాది వీక్లీకదా! అందులోనూ మేం ఎక్కువగా కథలు వేస్తుంటాం కనుక, మాకు కథలు వచ్చేవి కూడా పెద్దసంఖ్యలో వస్తుంటాయి. వచ్చినవాట్లోంచి నచ్చినవాట్లోంచి, కథ స్వభావాన్నిబట్టీ, మిగతా కారణాలను బట్టీ ముందూ వెనకా అవుతుంటుంది. ఇప్పటికి చూడాల్సినవి రెండు నిలువెత్తున పేరుకుపోయి ఉన్నాయి"

మిగతా కారణాలంటే రచయిత పేరూ, పాపులారిటీ అన్నమాట- అనుకుని మరో ప్రశ్న వేశాడు గౌరీశం.

"నా రెమ్యూనరేషన్ ఎప్పుడొస్తుందండీ?"

"వచ్చేనెల పంపుతారనుకుంటాను. ఆ విషయాలు నేనంతగా చూసుకోను"

"వీలైనంత తొందరగా పంపించండిసార్"




"అందులో వెనకా ముందూ ఉంటుందనుకోను. అందరికీ ఒకేసారి పంపిస్తుంటారు. కాకపోతే మీరడిగారు గనుక చెబుతున్నాను మీరు ఉండేదిక్కడేనా...."

"ఇక్కడేనండీ"

"ఐతే ఓ పనిచేయండి. పోస్ట్‌లో పంపించే బదులు పర్సనల్‌గా తెచ్చి ఇస్తుండండి. నేను వీలునుబట్టి సెలెక్ట్‌చేయటమో, రిటర్న్‌చేయటమో తొందరగా చేసేస్తాను"

"చాలా థాంక్సండీ" అని లేచి నిలబడ్డాడు.

"కాస్త వెరైటీగా, పాఠకులకు ఇంట్రెస్ట్‌గా ఉండేట్టు రాస్తుండండి" అన్నాడాయన చివరగా.

తలూపి, తన కథల కోసం ఆరాతీశాడు. అన్నీ వెతకాడు కూర్చుని, సబ్-ఎడిటర్ సహాయంతో దొరకలేదు.

బైటకు నడిచాడు గొరీశం. సాయంత్రం నాలుగయింది. ఫైల్లో ఇంకా రెండు ఆర్టికల్సున్నాయి. మరో పత్రికాఫీసులో ఇవ్వాలవి. వెళ్ళేసరికి ఐదయిపోతే, ఎడిటర్ ఉండకపోవచ్చు. బస్సు దొరుకుందో లేదోననుకున్నాడు. మళ్ళీ కాస్సేపు ఆలోచించి వెళ్ళి చూస్తే సరిపోతుందనుకొని బస్టాపులో నిలుచున్నాడు. ఒక బస్సు దొరికి, అదిమారి మరో బస్సు దొరికి వెళ్ళేసరికి ఐదుంబావయింది. కొందరు ఇంటిదారి పడుతున్నారు. గొరీశం వెళ్ళేసరికి సెక్షనంతా ఖాళీగా ఉంది. ఎడిటర్ మాత్రం ఉన్నాడు. ఇంటికెళ్ళే టైంకొచ్చాడే సత్రకాయ- అనుకుంటాడేమో ననుకుని తటపటాయిస్తూనే వెళ్ళాడు గొరీశం.

"ఏమిటీ సంగతి?" నవ్వుతూ పలకరించాడాయన.

ఆర్టికల్స్ తీసి అందించాడాయనకు.

టైటిల్స్ చూసి, వాటిని టేబుల్ సొరుగులో పడేసి, సిగరెట్ వెలిగించుకుంటూ, గొరీశంకు ఆఫర్ చేశాడాయన.

"సిగరెట్ తాగుతారా, అలవాటుందా?"

"తాగుతాను... కానీ వద్దండీ" మొహమాటంగా అన్నాడు గొరీశం.

"ఫర్వాలేదు, తీసుకోండి" బలవంతం చేశాడాయన.

"నాదగ్గరున్నాయండీ" అంటూ తన జేబులోంచి పాకెట్ తీసి ఓ సిగరెట్ వెలిగించుకున్నాడు.

"ఏం చేస్తున్నారు మీరు, చదువుకుంటున్నారా... ఉద్యోగమా?"

"రెండూ కాదండీ... ఇలా పత్రికలకు రాసుకుంటున్నాను"

"డిగ్రీ పూర్తయిందా?"

"అవలేదండీ... మధ్యలో మానేశాను"

"వెనకేమైనా పొలాలూ, ఆస్తిపాస్తులూ ఉన్నాయా?"

"లేవండీ"

"మరి ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నారా, డిగ్రీ పూర్తి చేయలేకపోయారా?"

"ఉద్యోగం చేయటం నాకు ఇష్టం లేదు సార్! రచనల్లోనే ఫుల్‌టైం స్పెండ్ చేయాలని ఆలోచన"

"బావుంది ఆలోచన. మీ అమ్మా నాన్నలేమన్నారు?"

జవాబు చెప్పలేదు గొరీశం.

"బహుశా - పిచ్చి ఆలోచనని కొట్టేస్నుంటారు. అవునా?"

గొరీశం సమాధానం చెప్పకుండా మౌనంగా కూచున్నాడు. మళ్ళీ ఎడిటరే అన్నాడు-

"అమ్మా నాన్నలు ఉండి, ఆదుకున్నంత సేపూ బానే ఉంటుంది. మీ వాలకం చూస్తుంటే ఇంట్లో పోట్లాడి, సిటీకొచ్చినట్టుంది. సరే... ఆ సంగతి పోనీయండి. ఇక్కడ ఒక్కరే ఉంటున్నారు. ఎంతకాలం ఇలా నడుస్తుంది? ముప్పై ఏళ్ళుగా తెలుగు పత్రికలతో సంబంధాలున్నాయి నాకు. ఏ అమెరికాలోనో, యూరప్‌లోనో అయితే ఫ్రీలాన్స్ జర్నలిస్టుగానో, రైటర్‌గానో జాలీగా గడపొచ్చు, లక్షలు సంపాదించుకోవచ్చు. కానీ మన దగ్గర అలాంటిది చాలా కష్టం. ఆలోచించండి" అంటూ కళ్ళెగరేసి ప్రశ్నార్థకంగా చూశాడాయన.

"ఏమోసార్... నాకు ఇలా బతగ్గలనని పిస్తోంది"

“రచనలు వెంట వెంటనే సెలెక్ట్‌చేసుకునే పత్రికలుగానీ, ఏనెలకానెల ఖచ్చితంగా రెమ్యూనరేషన్స్ పంపించిన పత్రికలుగానీ ఉన్నాయా? ఇప్పటి వరకూ ఉన్న మీ అనుభవంతో చెప్పండి?”

“లేవనుకోండి, కానీ రెగ్యులర్‌గా రాస్తుంటే ఏదో ఒకనాటికి రెగ్యులర్‌గా పబ్లిష్ అవుతుంటాయి. కాస్త అటూ ఇటూ అయినా అడ్జెస్ట్ చేసుకోవచ్చుకదా?”

“కావొచ్చుకానీ, క్రమంగా పాఠకుల అభిరుచులూ, పత్రికల పాలసీలూ మారుతుంటాయి. అప్పటి సంగతి ఆలోచించండి. ఐదేళ్ళకిందటి మహా రచయితలూ, రచయిత్రులూ ఇప్పుడేరీ? అదీకాక దాదాపు మన తెలుగు రచయితలంతా ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళే. అభిరుచిగా రాసినా ఆసక్తికొద్దీ రాసినా, ఇది ఏదో వేణ్నీళ్ళకు చన్నీళ్ళన్నట్టు పార్ట్‌టైంగా చేసుకోవాలేగానీ, ప్రొఫెషన్‌గా పెట్టుకుంటే కష్టం”

“ఏమో సార్... నాకలా అనిపించటం లేదు”

“ఒంటరిగా ఉన్నన్నాళ్ళూ ఫర్వాలేదు. పెళ్ళిచేసుకుని, ఓ సంసారం ఏర్పడ్డాక కష్టమవుతుంది. అంతగా ఐతే, పత్రికారంగంలోనే చేరండి. ఏదో ఒక పత్రికలో సబ్-ఎడిటర్‌గా కుదిరితే అదీ ఓ రకంగా బాగానే ఉంటుంది. తరవాత మీ ఇష్టం”

“అంతదూరం వచ్చినప్పుడు ఆలోచిస్తాన్సార్! కానీ నామీద నాకు నమ్మకం ఉంది. తెలుగులో మొదటి ప్రొఫెషనల్ రైటర్ నేనే అవుతానేమో” నవ్వుకుంటూ అన్నాడు గౌరీశం.

అంతటితో ఆ విషయం వదిలేశాడు ఎడిటర్. కాస్సేపు కథల గురించీ, రచయితల గురించీ మాట్లాడుకున్నారు. ఇక గౌరీశం సెలవుతీసుకోవటానికి లేవగానే చెప్పాడాయన-

“సాధారణంగా ఈ టైంలోనే రండి. ఈ టైంలో ఐతే తీరిగ్గా ఉంటాను. మీరూ కాస్సేపు కూర్చున్నట్టుంటుంది”

“మంచిదండీ... థాంక్స్” అని బైటకు దారితీశాడు గౌరీశం.

గదికెళ్ళి వంటచేసుకునే ఓపిక లేదనిపించింది. ఓ ఇరానీ హొటల్‌కెళ్ళి రెండు సమోసాలు తిని, టీ తాగి ఇంటిదారిపట్టాడు.

★ ★ ★

ఏడో క్లాసులోకొచ్చి మూణ్నెల్లయ్యాక వచ్చిన చలిని చూసి ఏడుస్తూ కూచున్నాడు శ్రీనివాస్. వర్షాలయిపోయి, అసలు చలికాలం వస్తే చలి ఇంకా ఎక్కువవుతుందేమో. అరుణక్క పెళ్లిలో ఒక్క దుప్పటీపోయింది. వెధవది పోతే పోయిందనుకున్నాడు. తను - నాన్న కొన్న రెండు బ్లాంకెట్లని చూసి. కాని ఆ రెండూ అరుణక్క పట్టుకెళ్ళిపోయింది. వాటితోపాటు తనకో చిన్న బ్లాంకెట్టయినా కొంటే ఎంత బావుండేది. కనీసం ఓ దుప్పటి ఐనా.... ఛీ, అసలు నాన్న కొత్త బట్టలు కుట్టించినప్పుడే తనడిగితే బావుండేది. కానీ రెండు బ్లాంకెట్లు కొనటం చూసి తనే అడగలేదు. కనీసం నాన్న కొనిపెట్టినా సరిపోయేదికదా.

ఇక వీళ్ళు తనకు సరిపోయే దుప్పటీ కొనరు. ఇంకానయం, వేణుగాడు చెప్పటంవల్ల వక్కపొడి పొట్లాలు చేస్తూ డబ్బులు సంపాదించొచ్చని తనకు తెలిసింది. సెలవుల్లో ఎండల్లో తిరగవద్దని అమ్మ కోప్పడి మాన్పించకపోతే అసలు తన హుండీ నిండిపోయేదే. ప్రతీ ఆదివారమైనా పోనివ్వరు. చదువుకుంటూ కూచోవాలి. హుండీ పగలగొట్టి, లెక్కపెట్టియ్యమని విజయక్కను సాయంగా పిలిస్తే అది రెణ్నిమిషాల్లో లెక్కపెట్టి ఇచ్చింది. అదే సుధన్నయ్యయితే నాల్రూపాయలు కొట్టేసేవాడు. విజయక్కయితే, తనదగ్గర డబ్బులు తీసుకోదు, అమ్మక్కూడా చెప్పదు. ఎందుకురా అంటూనే లెక్కపెట్టిచ్చింది, హుండీ పగలగొట్టినందుకు తిట్టి. తను చెప్పాక నవ్వింది- నీకీ దుప్పటి పిచ్చేమిట్రా అంటూ టెంకిజెల్లిచ్చింది. మొత్తం ముప్ఫయ్యారు రూపాయల ముప్పావలా అయింది. అమ్మయ్య ఇంకా పదమూడుంపావలా అయితే యాభైరూపాయలన్నమాట. ఇంకో రెణ్నెల్లకల్లా అయిపోతుంది. మంచి బ్లాంకెట్ కొనుక్కుని తనొక్కడే వెచ్చగా కప్పుకుని పడుకోవచ్చు. అసలు అరుణక్కబదులు విజయక్క పెళ్ళి అయితే ఎంత బావుండేది, ఎంచక్కా. అది తనకో బ్లాంకెట్




ఇచ్చిపోయేది. కొప్పడుతుందన్నమాటేగాని, అసలు అందరికంటే అదే మంచిది. సరేగానీ, తను కొనుక్కునే బ్లాంకెట్ చిన్నదైతే అమ్మో అప్పుడు మళ్లీ కష్టం. ఇలా ఆలోచిస్తూ, తొమ్మిదిన్నరకల్లా నిద్రపోయాడు శ్రీను.

ఆరోజు కాస్త తొందరగానే వచ్చేశాడు వెంకటేశం మిల్లునుండి. భోజనానికి కూర్చోబోతుండగా పక్కింటాయన వచ్చి నిద్ర పట్టటంలేదంటూ హస్కు వేసుక్కూచున్నాడు. అరగంటసేపు చూసి విజయొచ్చింది-

"నాన్నా అమ్మ భోజనానికి రమ్మంటూంది"

"అంటే నన్ను పొమ్మనేకదా విజయా" అంటూ పక్కింటాయన వెళ్ళిపోయాడు. లోపలికెళ్ళబోతున్న విజయ, మళ్ళీ ఇంటిముందు ఎవరో కనిపించటంతో ఆగి చూసింది. వెంకటేశంకూడా అలికిడికి తొంగిచూశాడు. పోస్టేమాన్‌లా వున్నాడు. ఈ రాత్రిపూట పోస్టేమిటీ అనుకుంటూ అతనివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"టెలిగ్రాం"

"మాకా"

"వెంకటేశం, ఎనభై ఆరో నంబరిల్లు ఇదే కదా" విసుగ్గా అన్నాడు టెలిగ్రామ్ బేరర్.

తమకు టెలిగ్రాం ఇచ్చేదెవరబ్బా- అని వెంకటేశం అనుకుంటూండగా విజయ చప్పున వెళ్ళి, సంతకంచేసి తీసుకుంది. టెలిగ్రాఫ్ ఉద్యోగి వెళ్ళిపోయాడు సైకిల్ బెల్ మోగిస్తూ.

"గంట మోగింది. అంటే ఏదో శుభవార్తే అయుంటుంది" తనలో తను అనుకుంటున్నట్టుగా అన్నాడు, టెలిగ్రాం చించుతున్న విజయవైపు చూస్తూ.

చించిన టెలిగ్రాం చదువుకుని నివ్వెరపోయింది విజయ. అక్షరం, అక్షరం కూడబలుక్కుని మళ్ళీ చదివింది...

"గోపాల్ ఎక్స్‌పైర్డ్..." గోపాల్ అంటే అరుణక్క భర్త ఏమిటిది, నిజమేనా...

"ఏమిటి విజయా, ఎవరిచ్చారు"

"మరి మరి నాన్నా" చెప్పలేకపోతూంది విజయ. ఎట్లా చెప్పాలో తెలియక సతమతమవుతుంది. పోనీ తండ్రి చేతిలోనే పెడదామంటే, ఆయనకు ఇంగ్లీష్ రాదు. "గోపాల్ బావ, అదే మన అరుణక్క భర్త చచ్చిపోయాట్ట నాన్నా"

"వింటూనే నిస్తేజంగా కుర్చీలో వెనక్కివాలాడు వెంకటేశం. అదేక్షణంలో ఫస్టుషో సినిమాకెళ్ళి ఎక్కడెక్కడో తిరిగి ఇంట్లో అడుగుపెట్టాడు సుధాకర్ తండ్రి మెలకువగా వుండటంచూసి గమ్మున లోపలికెళ్ళబోయాడు.

"సుధా, చెంబుతో కాసిన్ని నీళ్ళుతేరా" కళ్ళు మూసుకునే అన్నాడు.

సుధాకర్ లోపలికెళ్ళిపోయాడు.

"ఏమిటి నాన్నా ఇది" అయోమయంగా అంది విజయ.

"జీవితం తల్లీ, జీవితం.

కష్టాల కడలిలాంటి లోకాన్ని విడిచి, తన కూతుర్ని మళ్ళీ తనకే శాశ్వతంగా వదిలేసి, అల్లుడు స్వర్గస్తుడయ్యాడు. ఇంతకన్నా శుభవార్తేం వుంటుంది."

"భోజనం ముందు నీళ్ళేమిటండీ" అంటూ చెంబు అందించింది జగదాంబ. భర్త నీళ్ళు తాగి, చెంబు పక్కన పెట్టేస్తుండగా ఆయన ఒళ్ళోని ఎర్రకాగితం చూసి ఏమిటని ఆరాతీసింది.

విషయం తెలియగానే శోకాలు మొదలుపెట్టింది. కన్నకూతురు తన కళ్ళముందే విధవయిందంటే ఏ తల్లి కడుపుమాత్రం కరగదు? తల్లిఏడుపు వినగానే పరిగెత్తుకొచ్చిన సుధాకర్ కూడా తెల్లబోయాడు.

"ఏడ్చి ఏం లాభమే, త్వరగా తయారయితే చివరి బస్సయినా అందుతుందేమో" నిస్సత్తువగా అన్నాడు వెంకటేశం, భార్యను ఎట్లా ఓదార్చాలో తెలియక.

జేబులో డబ్బులు తీసి చూసుకున్నాడు. నాలుగు రూపాయల చిల్లరుంది. మరునాడు ఆదివారమని సెకండ్‌కో సినిమాకెళ్ళాడు నారాయణ. అయినా నారాయణదగ్గర అంతగా డబ్బులుండవు. విజయ లోపలికెళ్ళింది తనదగ్గరున్న డబ్బులుతీసి చూసింది. యాభైరూపాయలు లోపున్నాయి. అప్పటికే తల్లి ఏడుపులకు లేచికూచున్న తమ్ముడి దగ్గరికెళ్ళింది.

"గోపాలం బావ చచ్చిపోయాడట్రా"

"ఏ గోపాలం బావ?" కరిగిపోయిన కమ్మటి కల మధ్యలోంచి, లేచిన నిద్రమత్తులో అడిగాడు శ్రీను.

"మన అరుణక్క భర్త అమ్మా నాన్నా ఊరెళ్ళాలి. నీదగ్గర డబ్బులు..."

మారుమాట్లాడకుండా లేచి ఇచ్చేశాడు.

సుధాకర్ని కూడా వెళ్ళమని చెప్పింది విజయ-

"పొద్దున ఎవరిదగ్గరైనా డబ్బులు తీసుకుని, అన్నయ్యతో పంపిస్తాను. చలపతి మావయ్య కూడా వస్తాడేమో. వాళ్ళు రాగానే, వెంటనే నువ్వు వచ్చెయ్యి. తమ్ముడూ, నేనే వుంటాం ఇంట్లో"

మౌనంగా తలూపాడు సుధాకర్. హడావిడిగా. బయలుదేరి వెళ్ళిపోయారు. విజయా, శ్రీనూ బిక్కు బిక్కుమంటూ కూర్చున్నారు, అన్నకోసం ఎదురుచూస్తూ. నారాయణ వచ్చాక విషయం చెప్పింది విజయ. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుండగా అలాగే నేలమీద నిద్రపోయిన తమ్ముడికి తండ్రి దుప్పటి తీసి కప్పింది.

గౌరీశం సినిమానుంచి తాపీగా నడిచి వచ్చాడు. అతనికీ విషయం తెలియదు. అప్పటికి ఒకటిన్నర కావటంతో నిద్రతేలినట్లయింది. నారాయణ నడుం వాల్చాడు. అన్నను పొద్దున్నే నిద్రలేపి, చలపతి ఇంటికి పంపాలి గనుక, ఇక అలాగే కూచుందామనుకుంది. టీ డికాక్షన్ పెట్టుకుని తాగింది. సివిక్స్ పుస్తకంతీసి చదువుకుంటూ కూచుంది.

అరుణ ఇంటర్ బిపిసి చేసి తరువాత బియ్యేలో చేరింది కానీ, విజయ ఎటూ బియ్యే చదివేపాటికి, మళ్ళీ సైన్స్ ఎందుకని ఇంటర్‌లో ఆర్ట్స్‌గ్రూపు తీసుకుంది. కాలేజీ అనేసరికి విజయ చదువుకోసం తప్పనిసరిగా అప్పు చేయాల్సొచ్చింది. సుధాకర్ మళ్ళీ రెండుసార్లూ ఫెయిలయ్యాడు. తల్లిదండ్రులకు అలాంటి భారం కలిగించటం ఇష్టంలేక, కాలేజీలో చేరిన దగ్గర్నించీ విజయ చదువుమీద మరింత శ్రద్ధచూపటం మొదలెట్టింది. ఎస్.ఎస్.సి పూర్తయ్యేసరికి టైప్ నేర్చుకుని వుండటంతో





వెంటనే లోయర్ అప్పియరయి పాసయ్యింది. హైయ్యర్ ప్రాక్టీస్ చేస్తూంది. టెంత్‌క్లాస్‌లో సెకండ్‌క్లాస్ మార్కులకి అటూఇటూగా రావటం వల్లకూడా కాలేజీలో చేరిన దగ్గ ర్నుంచీ కొంచెం శ్రద్ధ ఎక్కువ చూపెట్టసా గింది. విజయ దద్దమ్మ కాదు. కాని ఇంట్లో చదువుకున్న వాళ్లెవరూ లేనందున అర్థంకా నివి చెప్పేవాళ్లు లేకా, తమ్ముడికి చదువు చెప్పటంలోనూ, ఇంటిపనుల్లోనూ, మధ్యమ ధ్యలో మెడికోల ఫిగర్స్ గీయటంలాంటి పను లవల్లా ఒకటికి రెండుసార్లు చదువుకోవటానికి సమయం సరిపోకా అలా అయింది. ఇంటర్‌లో కనీసం ఫస్ట్‌క్లాసయినా రాకపోతే గవర్నమెంట్ కాలేజీలో డిగ్రీకి సీటుదొరకడం కష్టమని అర్థం చేసుకుని, మొదటి నుండే కష్టపడటం మొదలెట్టింది.

తెల్లవారుజామున నాలుగున్నరకల్లా స్నానా నికి నీళ్లుపెట్టి, అన్నను నిద్రలేపింది. నారా యణ బద్ధకంగా లేచి, హడావిడిగా తయారై చలపతి ఇంటికి బయల్దేరాడు. విషయం విన్న చలపతి, ఆరోజు ఆదివారం కనుక ఆఫీస్ లేకపోవటంవల్ల ఊరికి ప్రయాణం కట్టాడు.

"ఒకసారి ఇంటికెళ్లొద్దాం మామయ్యా" అప్పటికి మూడుసార్లన్నాడు నారాయణ, ఆలోగా ఎవరిదగ్గరైనా డబ్బులు తీసుకుని వెడతానన్న చెల్లెలిమాట గుర్తుంచుకుని.

"ఎందుకురా అన్నిసార్లు చెబుతావ్. నేను మీ అత్తమ్మను వెళ్లి సాయంత్రం వరకూఉండి రమ్మని చెప్పానుగదా. మనం వెళ్లగానే వాళ్లు బయల్దేరుతారులే. మనకు ట్రెయిన్ మిస్సవు తుంది" అన్నాడు చలపతి.

ఇక అసలు విషయం చెప్పేశాడు నారా యణ.

"ఆ మాత్రం డబ్బులు నాదగ్గరున్నాయిలే. ఇక మనం బయల్దేరుదాం" అని నారాయణ ను బయల్దేరదీశాడు చలపతి.

★ ★ ★

ఏదో మామూలు జ్వరమే అనుకుని నిర్లక్ష్యం చేయగా, హఠాత్తుగా తిరగబెట్టి, ఆసుపత్రిలో చేర్పిన మరునాడే చచ్చిపోయాడు అరుణ భర్త

గోపాల్. చలపతి, నారాయణ వెళ్లేసరికి అంత్యక్రియలు అయిపోయినాయి. సుధాకర్నుంచేసి, తను వెళ్లిపోతానని చలపతితో చెప్పాడు నారాయణ అనవసరంగా లీవ్ వేస్టవుతుందని. తనుకూడా వెళ్లాలిగనుక మర్నాడుదయంవరకు ఎలాగేలా చేరుకోవచ్చునని నారాయణను కూడా వుండమన్నాడు చలపతి, ఇద్దరూ కలిసే వెళ్లొచ్చునంటూ.

"దాన్నెటూ అత్తారింట్లో వుంచేదిలేదు. పదోరోజుదాకా ఇక్కడే వుండిచేసేదేముంది. మనం ఎల్లుండి వెళ్లిపోదాం, అరుణను తీసుకుని" సూచించాడు సుధాకర్.

"ఎట్లా తీసుకుపోతాంరా, చూసేవాళ్లు ఏమనుకుంటారు?" అన్నాడు వెంకటేశం.

"చూసేవాళ్లగురించి కాదు బావా. పెళ్లై ఆర్నెల్లు కూడా కాలేదు. మనం ఇచ్చిన కట్నం ఇచ్చెయ్యాలి కదా వాళ్లు. అందుకోసమైనా దాన్నీపదిరోజులూ వుంచకతప్పదు. సంప్రదాయం సంగతటుంచండి" అన్నాడు చలపతి మెల్లిగా మాట్లాడుతూ.

"అల్లుడేపోయాక డబ్బు తీసుకుని ఏంచేసుకుంటాంరా తమ్ముడూ. అయినా ఏమనడుగుతాం" ముక్కు చీదుకుంటూ అంది జగదాంబ.

"ఆ డబ్బు కనీసం దానికైనా పనికొస్తుంది గదా. అయినా లోకంలో వున్నదేగానీ లేనిది కాదుగదా. మీరేమీ మాట్లాడకుండా గమ్మునూరుకోండి. పదోరోజున నేనడుగుతాను. వాళ్లు కాదన్నా పెద్దమనుమలూరుకోరుగదా. అదంతా నేను చూసుకుంటానుగానీ, బావను ఎల్లుండి పంపించెయ్ రేపటి కాండ అయిపోగానే. నువ్వూ, సుధాగాడూ వుండండి-" వివరంగా చెప్పాడు చలపతి.

ఇక ఎవరూ ఏమీ తర్కించలేదు.

★ ★ ★

దిగిపోయిందనుకున్న గుండెలమీది కుంపటి, ఆరిపోని రావణకాష్టమయింది. దాన్ని పెల్లుబికే ఏ కన్నీరూ ఆర్పలేదు. అలాగని ఏకన్నతల్లిదండ్రులూ బాధపడకుండా వుండలేరు. నిజానికి ప్రతి తండ్రీ తనకూతురి పెళ్లి తన బాధ్యత - అనుకుంటాడు. కానీ, ఆ బరువు ఎలాగోలాగు ఎక్కడోచోట దింపేసుకోవాలనే ఆరాటమేతప్ప, బాధ్యతాయుతంగా ఆలోచించి ఎలా చేయాలని చాలా తక్కువమంది మాత్రమే ఆలోచిస్తుంటారు. అది మూర్ఖతకావచ్చు. అమాయకత్వం కావచ్చు. అశక్తత కావచ్చు. సమాజంవల్ల వున్న భయంకావచ్చు. పోషించలేని పేదరికం కావచ్చు... మరేదైనా కావచ్చు - కానీ బాధ్యత మాత్రంకాదు.

నిజంగా ఆలోచిస్తే ఈ అనుబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే. పోషించలేని భర్తను గౌరవించే భార్యను చూడాలనుకోవటమూ, తివిరి యిసుమున తైలం తీయబోవటమూ ఒకటే. పండక్కి చీర కొనిపెట్టలేని అన్నని ప్రేమించే చెల్లెలు కుందేటి కొమ్ములాంటిదే. చదివించి సరిగ్గా పోషించలేని తండ్రిమాట వినమని పిల్లలకి చెప్పటం మృగతృష్ణలో నీరు త్రావబోవటమే. ఇవన్నీ అబద్ధమనేవాళ్లను చేరి రంజింపనూ ఒకరి తరంకాదు.

అన్నా అనకపోయినా, అనుకున్నాఅనుకోకపోయినా వెంకటేశంకు అరుణ మళ్లీ భారంకావటం మాత్రం నిజం.

పదోరోజు కర్మకాండ అయిపోగానే కట్నం డబ్బు తిరిగి ఇవ్వాలని అడగటంతో కొంచెం గొడవ జరిగింది. పెద్దమనుమలంతా కలిసి సర్దిచెప్పి, లాంఛనాలూ, లెక్కలూ కలిపి, కూడికలు వేసి, తీసివేతలు చేసి లెక్కతేల్చారు. నిజానికి రొక్కం రూపంలో ఇచ్చిన కట్నం ఐదువేలు మాత్రమే. మిగతా లాంఛనాలతో మంగళసూత్రం పిల్లాడి తరఫువాళ్లు చేయించిందే. అదికాక ఒక పది గ్రాముల గొలుసుమట్టుకు అమ్మాయికి తలిదండ్రులు పెట్టారు. ఆ గొలుసుతోపాటు పెళ్లికొడుక్కు పెట్టిన ఉంగరం బదులు, అత్తింటివారు అమ్మాయికి పెట్టిన ప్రధానపు ఉంగరం కూడా ఇచ్చేటట్లూ, నగదు మూడు వేల రూపాయలు మాత్రం తిరిగి ఇవ్వాలనీ చివరకు పెద్దలు తీర్మానించారు. నెలరోజుల తరువాత వాళ్లు ఆ డబ్బు పంపించేశారు.

మొదట ఇంకా వదలని స్మశాన వైరాగ్యం వల్లనో, మరెందువల్లనో గానీ కూతురి డబ్బు కూతురిపేరిట బ్యాంకులో వేసేస్తామన్నాడు




వెంకటేశం. కానీ పరిస్థితులు... నెలనెలా ఐదొందలపైన అప్పులు తీర్చటానికి పోతూండటంతో తప్పనిసరిగా చిల్లరమల్లర అప్పులూ, చేబదుళ్లూ చేయకతప్పలేదు. అరువు పద్దులన్నీ కొంచెంకొంచెంగా పేరుకుపోయి పెద్ద మొత్తంగా రూపొందాయి. అంచేత డబ్బులు బ్యాంకులో వేయటం కుదరలేదు. అరుణ కొద్దిరోజులు కుట్టు పని నేర్చుకుని మానేసింది. అది ఆధారంగా కనీసం ఒక కుట్టు మిషన్ తీసుకోమని సలహా ఇచ్చాడు చలపతి. అరుణ కూడా అయోమయంలో, వైరాగ్యంలో వున్నట్టుగానే వుండటంతో అందుకు ఒప్పుకుంది. చివరకు చేబదుళ్ళ లాంటి అప్పులూ, అరువు పద్దులూ పోయి మిషన్ కొనగా చేతిలో రెండొందల రూపాయలు మిగిలాయి. అరుణ మెళ్లో గొలుసూ, చేతికి ఉంగరమూ ఉండిపోయాయి. పెళ్లిచేసి పంపిన కూతురు ఇంట్లోకే వచ్చి చేరగా - కూతురు పెళ్లి గుర్తుగా కళ్లు బైర్లు కమ్మిస్తున్న అప్పు, వైధవ్యం గుర్తుగా కళ్లముందు కుట్టు మిషనూ మాత్రం మిగిలాయి.

పెళ్లి, కాపురం, వైధవ్యం- అన్నీ తనే నటించిన సినిమాలాగా అనిపిస్తోంది అరుణకు. కాకపోతే అది మళ్లీమళ్లీ చూట్టానికి వీలుగా సినిమాలాగా కాక, మొదటి ప్రదర్శనే ఫెయిలైన నాటకంలాగా ఒక్కసారికే ముగిసిపోయింది. నాటకాల్లో ఫెయిలైన హీరోయిన్ సినిమాల్లో పైకొస్తుందా- అంటే ఎలా చెప్పటం. అది ఆమె అదృష్టంమీద ఆధారపడి ఉందంటే ఎనభై కోట్ల భారతీయులూ అవునంటారుగానీ, అపై చిల్లరమల్లర మనుమలు మాత్రం కొట్టేస్తారు.

ఆమె నటించడమే ఒక దురదృష్టమనో లేక నటిస్తానంటే చాలు అదే ఒక అదృష్టమనో అనుకోగలిగిన వెర్రి నిర్మాతలపైన ఆధారపడి వుంటుందా విషయం. వెరసి అరుణ సినిమాలే జీవనం అనుకుంటుందా - లేక జీవితమూ ఒక సినిమాలాంటిదే అనుకుంటుందా అన్నది కాలం తెరపై చూసి తీరవలసిందే కానీ జోస్యం చెప్పటానిక్కానీ, ఊహించటానిక్కానీ వీల్లేదుకదా!

"ఏమిటండీ... ఇలా జరిగింది?"- భర్త దగ్గర వాపోయింది జగదాంబ.

"మనం అనుకోలేదని జరిగేదేదీ ఆగదు- అన్నాట్ట ఎవరో మహానుభావుడు. ఏడ్చి ఏం లాభమే" ఊరడించాడు.

"నాన్నా..." అంటూ ఉత్సాహంగా పోస్ట్ కవర్ పట్టుకొచ్చింది విజయ.

కొంగుతో కళ్లు తుడుచుకుంది జగదాంబ.

"ఆదివారంరోజున పోస్టేమిటే?"

"నిన్ననే వచ్చిందట నాన్నా... మనోహర్ అడ్రస్‌కు. ఇప్పుడే ఇచ్చి వెళ్లిపోయాడు. సుధాకరన్నయ్యకు ఉద్యోగం వచ్చింది"

"ఉద్యోగమా... సుధాకర్‌కు?" ఆశ్చర్యపోయాడు వెంకటేశం.

కాగితం తండ్రికి అందించి, చెప్పింది-

"అవున్నాన్నా... సింగరేణి కాలరీస్ - గోదావరిఖనిలో"

"ఎంత జీతం?" అడిగింది జగదాంబ.

"సంవత్సరం వరకూ స్టైఫండ్ నూట యాభై రూపాయలు. తరువాత పెద్దన్నయ్య కంటే ఎక్కువ జీతం వస్తుందే"

"ఎప్పుడు అప్లై చేశాడే ఇది?"

"నాలుగైదు నెలలయింది నాన్నా! ఓసారి రెణ్నాళ్ల కిందనుకుంటాను, రాత్రికి మనోహర్ గదిలో వుంటాను అని మనకు చెప్పాడు చూడు. అసలారోజు రిటెన్ టెస్ట్ రాసి వచ్చాడట. మనోహర్‌కూడా మనకిప్పుడు చెప్పాడు"

"చదువు సంగతేమిటో మరి. ఓసారి చలపతిని కలిసి రమ్మను" అన్నాడు వెంకటేశం.

గౌరీశంతో కలిసి ఎక్కడికో వెళ్లిన సుధాకర్ కాస్సేపటికి తిరిగొచ్చి, విషయం వినగానే ఎగిరి గంతేశాడు. ఎవరు ఔనన్నా కాదన్నా తను మట్టుకు ఉద్యోగంలో చేరటం ఖాయమని చెప్పేశాడు సుధాకర్. సాయంత్రంపూట వెళ్లి వెంకటేశం చలపతితో మాట్లాడారు.

"వెళ్లనీ బావా... ఈరకంగానైనా వాడికి లోకజ్ఞానం వస్తుంది. అదీకాక ఇప్పటికి ఆ ఇంటర్ అరడజన్‌సార్లు డుమ్మాలు కొట్టాడు. వాడికెటూ చదువు మీద శ్రద్ధలేదు. ట్రెయినింగ్ పీరియడ్ అయిపోతే మంచి జీతం ఇస్తారు. వాడికింతకన్నా మంచి ఉద్యోగం ఎటూ







**ఆదా చేసుకోండి** జాస్మిన్ కొని 63 పైసలు
సంసార్ కొని 35 పైసలు

MCA/KSDU/55/Tel

రాదు"- తేల్చి చెప్పేశాడు చలపతి.

ఈలోగా గౌరీశంను కూర్చోబెట్టుకొని అరుణ, విజయ, జగదాంబ, సుధాకర్‌తోపాటుగా చర్చలు సాగించారు.

"అసలు రిటెన్ టెస్ట్ ఎలా పాసయ్యావురా, అంతమందిలో" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"నీ మొహంలేవే! అక్కడ యాభై పోస్టులుంటే, నలభైమంది వెళ్ళుంటారు. సింగరేణి కాలరీస్ అనగానే భయపడేవాళ్ళేకదా అందరూ, బొగ్గుగనుల్ని తలుచుకుని" తేలిగ్గా తీసేసింది విజయ.

"నువ్వెప్పుడూ వెధవ మాటలే. అసలు నాగురించి మీకేం తెలుసనని?" గర్వంగా ఛాతీ పొంగించాడు సుధాకర్.

"ఇక్కడ ఇంతమందిమి అదుపుచేసినా వీడిలా తయారవుతున్నాడు. ఇహ అక్కడ చేతినిండా డబ్బులు... అడిగేవాడుండడు? ఏమవుతాడో" జగదాంబ నిట్టూర్చింది.

గౌరీశం కల్పించుకున్నాడు-

"పిల్లలకు పిల్లలు పుట్టినా మన పెద్దవాళ్ళు వాళ్లని చిన్నపిల్లల్లాగే చూస్తుంటారు. పిట్టలు చూడండి... ఎగరటం రాగానే కూనల్ని గూట్లోంచి వెళ్లగొట్టేస్తాయి. సింహాలు... వేటాడ్డం నేర్పించి, తరువాత పిల్లల్ని తరిమి కొట్టేస్తాయి. ఒక వయసురాగానే పిల్లల సంగతి వదిలెయ్యాలి. వాళ్ల మంచి చెడ్డలు వాళ్లు చూసుకుంటారు. కాదని అన్నా వినిపించుకోరుకదా"

"నువుకూడా పెద్దలమాట వినకుండా పారిపోయొచ్చిన బాపతేకదా, నువు చెప్పకపోతే తెలీదనుకున్నావా! అందుకే వాణ్ని సమర్థిస్తున్నావు" అంది అరుణ.

వెంకటేశం వచ్చేవరకూ అలాగే సాగిపోయింది సంభాషణ. చలపతి కూడా ఒప్పుకున్నాడనేసరికి ఇక సుధాకర్‌కి పట్టపగ్గాలులేకుండా అయిపోయింది.

★ ★ ★

తండ్రి మిల్లులో అప్పుతెచ్చిచ్చిన నూటపాతిక రూపాయలూ నలుక్కుంటూనూ, మనోహర్ ఇచ్చిన యాభై రూపాయలు నలగలేకా తనుకున్నాడు సుధాకర్. బయల్దేరుతూ కథల్లో చదివినట్టు తల్లికాళ్ళకు, రవ్వలడ్లూ చేసివ్వనందుకు లోలోపలే కోపగించుకున్నాడు.

వచ్చేటపుడు ఏం తేవాలని అడిగితే ఆ పల్లెటూళ్ళో తేవటానికేం వుంటాయి గనుక, ఓ బొగ్గు ముక్కతెమ్మన్న విజయ మాటకు విసుక్కున్నాడు. ఏ బొంబాయిలోనో, సింగపూర్‌లో ఉద్యోగం రాలేదని తిట్టుకున్నాడు.

"నెల నెలా యాభై రూపాయలైనా మిగిలించొచ్చు. విజయ పేరుమీద పంపించు" అంది తల్లి.

"పొదుపేమీ అక్కర్లేదుగానీ, జాగ్రత్తగా వాడుకో" తండ్రి అన్నాడు.

"ఆఫీస్‌కు టైమ్‌కు వెళ్ళు. శ్రద్ధగా పనిచెయ్యి. కాలేజీలోలాగా పిచ్చి ప్రశ్నలు వేసి, ఆఫీసర్లను విసిగించకు" పొద్దున్న ఆఫీసుకు వెళ్ళేముందు చెప్పాడు నారాయణ.

"వారానికో ఉత్తరం రాయి" గట్టిగా అని, "ఇక డబ్బులుంటాయి. అడిగే వాళ్ళుండరు. సిగరెట్లు తాగకు" అని మెల్లిగా చెప్పింది విజయ, బయల్దేరుతుండగా.

"వచ్చేటప్పుడు నాకు దుప్పటితేవా చిన్నన్నయ్యా?" అడిగాడు శ్రీను.

"బోల్డు ఓపెన్ యూనివర్సిటీలున్నాయి. డిగ్రీ రాయటానికి ట్రైచేయి. సర్వేయర్‌లాంటి మరింత మంచి ఉద్యోగం అక్కడే వస్తుంది" చెప్పాడు గౌరీశం రైల్వేస్టేషన్‌లో.

"అప్పులు చేయకు. అరువు పెట్టకు. డబ్బు జాగ్రత్తగా వాడుకో" రైలు కదులుతుండగా చెప్పాడు మనోహర్.

అందరికీ టాటా చెప్పి 'హమ్మయ్య' అంటూ సీట్లోకూలబడ్డాడు సుధాకర్. ముక్కు మొహం తెల్సినవారులేని ఊరుగనుక నడిబజార్లో నిలబడైనా సిగరెట్ తాగొచ్చు. రోజూ సెకండ్‌షో సినిమాకెళ్ళినా అడిగే వాడుండడు. కాకపోతే డబ్బులు సరిపోవేమో! అన్నయ్య మాట, అప్పుడే టైప్ నేర్చుకుంటే ట్రెయినింగ్ పీరియడ్ కూడా ఎంత జాలీగా గడిచేది. సరే... ఏడాది తరువాత మంచి జీతం, బాప్‌రే... ఎన్ని చెయ్యొచ్చు. వెధవ పుస్తకాలు చదువు




కునే బోర్‌లేదు. రేడియో విప్పటమూ, టిన్ కరిగించి వైర్లు అతకటమూ వుండదు.

—ఇలా ఆలోచనలూ, వాటికంటే కాస్తమె ల్లిగా రైలూ సాగిపోతున్నాయి.




దిగిపోయిందనుకున్న కూతురు భారమయింది. భారమవుతాడేమోననుకున్న కొడుకు తనకాళ్ళ మీద తను నిలబడ్డాడు. జరగాలనీ అనుకోవద్దు; అయ్యో-- ఇలా జరిగిందే – అనీ అనుకోవద్దు. జీవిస్తూనే వుండాలి. అంతేనా జీవితం... అనుకున్నాడు వెంకటేశం. అది జీవితం కాదు ఓ రకం జీవించటం.

ఎంత ఎక్కువైనా, ఇంకో మూణ్నెల్లుపోతే పెద్దకొడుక్కు జీతం పెరుగుతుంది. ఏడాది గడిస్తే రెండోవాడికీ మంచి జీతం వస్తుంది. సరే... ఇంకో అయిదారేళ్ళకు తను రిటైరైనా ఫర్వాలేదు. ఈలోగా అరుణ గురించి ఆలోచించాలి తను. ఆర్నెల్లు కూడా కాపురంచేయకుండా అడవి పాలైపోయింది దాని జీవితం. మళ్ళీ పెళ్ళిచేయమని అంటున్నారందరూ. కానీ ఎంతకష్టమో, ఎలాంటి వాడు దొరుకుతాడో. ముందు విజయ సంగతి కూడా చూడాలి. రెండు మూడేళ్ళలో దానికీ, పెద్దాడికీ ఒకేసారి పెళ్ళిళ్ళుచేస్తే సరిపోతుంది. రానురానూ కట్నాలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. తనకు తన మామ కట్నం ఇస్తానంటే తీసుకోలేదు. గాంధీగారి ప్రభావం తన వయసువాళ్ళమీద బాగా వుండేదప్పట్లో తను కట్నంగా రాట్నం తీసుకున్నాడు. క్రమంగా ఆ ఆదర్శాలూపోయాయి. నెహ్రూతో దేశం గొడ్డుపోయినట్టయింది. ఈ కట్నాలు పోలేదు. ఈ దరిద్రంపోలేదు. చెదలుపట్టిన రాట్నం మాత్రం వారానికోసారి తన భార్య తుడిచిపెడుతూ వుంటుంది కనుక నామమాత్రంగా నిలిచివుంది. ఈరోజుల్లో కట్నం బదులు రాట్నం అడిగే వాళ్ళున్నారా అసలు. కట్నం వద్దన్నా రాట్నం బదులు బట్టల మిల్లు అడుగుతారేమో – నవ్వుకున్నాడు వెంకటేశం తన్లో తను.

విజయ, శ్రీను తీరిగ్గా ఏదో మాట్లాడుతూ కూర్చున్నారు.

"అవున్రా... అప్పుడు వుద్యోగం చేయటమే గొప్పగా వుండేదట" నెలనెలా ఖచ్చితంగా జీతం తెచ్చుకునే ఉద్యోగస్తులంటే చాలా గొప్ప వాళ్ళన్నమాట. నాన్నకు ముందు జీతం ఎంతో తెలుసా? ముప్పై రెండ్రూపాయలట"

"ముప్పైరెండ్రూపాయలైతే ఎలా వుండేవారమ్మా! నేనేదో చిన్న పిల్లాణ్ణనుకుని కోతలు కోస్తున్నావు" అన్నాడు శ్రీను.

"నిజంరా శ్రీనూ... పావలాకు కిలో బియ్యం వుండేవట. అసలు ఇంకా తక్కువలో వుండేవట కూడానూ. ఇంటి అద్దె ఆర్రూపాయలిచ్చే వారట తెలుసా?"

"అయితే అప్పుడు ఇల్లు ఎంతుండేది?"

"మనంత ఇల్లయితే వెయ్యి రూపాయలకొచ్చేదన్నమాట"

"అబ్బ... మన నాన్న మరి ఎందుకు కొనలేదే అప్పుడే?"

"అప్పటి నెల జీతంతో ఎలా వస్తుందిరా మొద్దు. ఇప్పుడు కొనాలంటే యాభై వేలయినా అవుతుంది"

"ఛీ... అసలీ నాన్నకేమీ తెలియదు. అంత చౌకలో వున్నప్పుడే ఏదో ఓ ఇల్లు ఎలాగోలా కొంటే ఎంతబావుండేదే. మనం ఇప్పుడిస్తున్న అద్దె డబ్బుల్తో ఎంచక్కా బ్లాంకెట్లూ, స్వెట్టర్లూ అన్నీ కొనుక్కునేవాళ్ళంకదా" దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నాడు.

వయసుకుమించిన అవగాహనాశక్తి వున్న విజయకు తెలిసీతెలియని వయసులో వున్న తమ్ముడి ఆలోచనలూ, మనసులోని కోరికలూ - అన్నీ తెలుసు. అవన్నీ తమ సంపాదనలో ఏనాటికీ తీరవని కూడా తెలుసు.



"ఒరే... దుప్పటి పిచ్చిబ్బాయీ - నీకో దుప్పట్లషాపులో ఉద్యోగమొస్తుందిలేరా" నవ్వించింది తమ్ముణ్ణి.

ఆ మాటకు ఉడుక్కుంటూ అన్నాడు శ్రీను-

"పోవే... అచ్చంగా దుప్పట్లూ, బ్లాంకెట్లనే కాదు. టేప్ రికార్డర్, స్టీల్‌టిఫిన్ బాక్సు, ఎండా కాలంలో ఫానూ ఎన్నో కొనుక్కోవచ్చు .టైకట్టుకుని, మాస్ వేసుకుని కాన్వెంటుకు వెళ్ళొచ్చు కదక్కా—"

'అవున్రా... పేదరికం విషజ్వరం. కమ్మనైనవి మనం తినలేము. కలలు కనటమేరా శ్రీనూ'- లోలోపలే అనుకుంది విజయ, తమ్ముడి తల నిమురుతూ.

అసలు అరుణక్కకు పెళ్ళికాకపోతే బావుండేది. అనవసరంగా ఓ దుప్పటిపోయింది. సరే... బావ చావకపోయినా బావుండేది. తన డబ్బులన్నీ అయిపోయాయి. మళ్ళీ వక్కపొట్లాలు చేయాలంటే ఇప్పుడు పరీక్షలున్నాయి. ఈ అరుణక్క అత్తారింటి నుండి బ్లాంకెట్లు తెచ్చుకుంటే ఎంత బావుండేది. సుధన్నయ్య వదిలేసిపోయిన దుప్పటేమో అరుణక్క కప్పుకుంటూంది. పరీక్షలు అవ్వాలి తను వక్కపొడి పొట్లాలు చేయాలి. డబ్బులు కూడబెట్టాలి. అప్పటికి చలికాలం అయిపోతుంది. మళ్ళీ ఇస్తామని అమ్మో, నాన్నో ఏదో దానికి తీసుకుంటారు. ఇలాకాదు కానీ సుధన్నయ్యకు ఉత్తరం రాయాలి, తనకు నెలకో అయిదు రూపాయలు కవర్లోపెట్టి పంపమని. పది నెలలయ్యేసరికి యాభై రూపాయలవుతాయి. అప్పటికి ధరలు పెరిగిపోతాయో ఏమో! అసలు ఇప్పుడే బ్లాంకెట్ ధర తనకు తెలీదు. ముందది కనుక్కోవాలి. నూట యాభై రూపాయలొచ్చే సుధన్నయ్య అయిదు రూపాయలు తప్పకుండా పంపిస్తాడు. లేకున్నా కొద్దిరోజులకు పెద్దన్నయ్యకు జీతం ఎక్కువొస్తుందట. అసలింకో ఏడాదికి సుధన్నయ్యక్కూడా బోల్డు జీతమొస్తుందట. అమ్మో... అప్పుడు తమింట్లో ఎన్ని డబ్బులో. తను ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళొచ్చు. కొత్త పెన్ను కొనుక్కోవచ్చు. శనివారం రోజున కూడా స్కూల్ డ్రస్ కాకుండా అందర్లా మంచి రంగుల డ్రస్సులు వేసుకోవచ్చు. ఈ చలికాలం మాత్రం తనకు బ్లాంకెట్‌లేదు. కనీసం పెద్ద దుప్పటి కూడా లేదు...

★ ★ ★

"రాసుకునే పనేమీలేదా ఏం చేస్తున్నావు?" తీరిగ్గా కూర్చున్న గౌరీశం దగ్గరి కెళ్ళింది విజయ.

"పస్లేక పోవడమేమిటి? ఎంత పెన్నుకు అంత రాత. అయినా ఎంత రాసినా ఏం లాభం? నేనో చిన్న రచయితను కదా. నా ఆర్టికల్స్ ఈ మాత్రం వేసుకోవడమే గొప్ప."

"ఇప్పుడే ఇంత నీరసపడిపోతే ఎలా? ప్రొఫెషనల్ రైటర్ అవ్వాలికదా! కొంచెం ఓపిక తెచ్చుకో" నవ్వుతూ అంది.

"కొంచెమేమిటి... ఎంతంటే అంత ఓపికుంది. కానీ ఈ పత్రికలవాళ్ళున్నారే - వాళ్లకు ఎథిక్స్ అనేదిలేదు. అదీ సంగతి"

"నువ్వు రాసినవి వేసుకోపోతే నీతిలేనివాళ్ళవుతారన్నమాట" ఉడికిస్తున్నట్టుగా అంది విజయ.

"వేసుకోకపోతే ఫర్వాలేదు. వేసుకున్నవాటికి డబ్బులు కూడా ఇవ్వరు"

"ప్రతినెలా మొదటివారంలో చెక్ వచ్చి ఒళ్ళో పడుతూనేవుంది. ఇంకేం ఇవ్వాలి?"

"ఆ— చెక్కా నువ్వనేది ఆ పత్రికవాళ్ళు ఒక్కరే అట్లా పంపించేది. ఎంత రాసినా మహా అయితే ఓ నాలుగు పదినాయనుకో, ఓ వంద రూపాయలొస్తుంది. మిగతావాళ్ళు... ఒకరేమో అడగ్గాఅడగ్గా ఏదో ముష్టి మొహాన వేసినట్టు, అన్నిటికీ కలిపి పాతిక రూపాయలు పంపిస్తారు. మళ్ళీ ఆర్నెల్ల తరువాత దయుంటే మళ్ళీ ఓ పాతిక పంపుతారు. ఇంకొకరేమో సెలెక్ట్ చేసుకోవటానికి నాలుగునెలలు, అది పబ్లిష్ చేయటానికి నాలుగు నెల్లు, ఇక చెక్కు రావటానికి మరో నాలుగు నెల్లు" నిట్టూర్చాడు.

"సర్లే... మరీ కథలూ, నవలలూ ఏమయ్యాయి?"

"ఓ నవల రాసిచ్చానా! ఆ ఎడిటర్ ఏమన్నాడో తెలుసా..."

"ఏమన్నాడు?"

"పెళ్ళి గురించి నేచురల్‌గా పది పేజీలు రాశావు. ఎవడు చదువుతాడండీ ఇది. శోభనం




# బుష్ టివి

ఎలెక్ట్రానిక్ కలర్ ప్రిఫరెన్సు కంట్రోలుకల్గినది.



CTV 9774

ఇప్పుడు
గొప్ప తగ్గింపు
ధరలలో...

AUTHORISED DEALERS:-

## innovations

ELECTRONICS & HOME APPLIANCES – MOULDED FURNITURE & LUGGAGE

విజయవాడ: చల్లపల్లిబంగళా, ఏలూరు రోడ్. ఫోన్:64024 * బీసెంట్ రోడ్, గవర్నర్ పేట, * బకింగ్‌హాంపేట పోస్టాఫీస్ వద్ద, జైహింద్ టాకీస్ రోడ్, గవర్నర్ పేట * హెడ్‌పోస్టాఫీస్ ఎదురుగా, వన్‌టౌన్.

గుంటూరు: బ్రాడీపేట, మెయిన్ రోడ్, ఫోన్: 32103.

రాజమండ్రి: పాతకూరగాయల మార్కెట్ డౌన్, మెయిన్ రోడ్, Ph: 4696 * ఎల్.ఐ.సి. ఆఫీస్ ఎదురుగా, మెయిన్ రోడ్.

గుడివాడ: ఏలూరు రోడ్డు, ఫోన్: 2400.

నెల్లూరు: 15/328, ట్రంక్ రోడ్, ఎ.సి.బిల్డింగ్స్ ఎదురుగా, Ph: 4024, O.K. కాంప్లెక్స్, పినాకిని సూపర్ మార్కెట్ ఎదురుగా.

భీమవరం: బ్యాంక్ ఆఫ్ బరోడా ఎదురుగా, ఉండి రోడ్,

ఒంగోలు: కర్నూలు రోడ్, ఫోన్: 2552 (P.P)

విశాఖపట్నం: 29 & 30, టి.యస్.ఆర్ కాంప్లెక్స్, స్టేషన్ రోడ్, Ph: 61896.

విజయనగరం: 2 & 3, బాలాజీ కాంప్లెక్స్, యం.జి. రోడ్, ఫోన్: 2984

హైదరాబాద్: రిట్జ్ హోటల్ రోడ్, ఆదర్శనగర్, Ph. 233655. * పోస్టాఫీస్ ఎదుట, చిక్కడపల్లి * గ్రామర్‌స్కూల్ ఎదురుగా, అబిడ్స్.

చీరాల: S.B.I. ఎదుట, దర్బార్ రోడ్.

వరంగల్: కృష్ణకళా మందిర్ ఎదుట, హోటల్ ఏకశిల ప్రక్కన.

గురించి రాయాలిగానీ- అన్నాడు"

"మరి వాళ్ళ పత్రికలో అన్నీ అలాంటివే కదా వేసుకునేది. పోనీ రాసియ్యాలేకపోయావా?"

"సర్లే... అదొక్కటేనా ఆయన చెప్పింది. నవలంతా పీకి, పాకంపెట్టినట్టు బోల్డు మార్పులు సూచించాడు. నరేనని అదంతా మార్చాననుకో, అది నా నవలకాదు, ఆయన్నవలవుతుంది. పైగా నీలాంటి యువరచయితల్ని ప్రోత్సహించటమే నా ధ్యేయం అంటూ ఓ స్లోగన్ కూడా వినిపించాడు. ఏంచేయమంటావు చెప్పు"

"మరి, పోటీకి రాసిన నవలేమయింది?" నవ్వాపుకుంటూ అడిగింది.

"ఏమయిందో చెబితే నిజంగా నమ్ముతావా! నా నవల చాలా బాగుందట. ఫస్ట్‌ప్రైజ్ కూడా ఇస్తానన్నాడు. కానీ..."

"మార్చి రాయాలా?"

"కాదు... బహుమతి సొమ్ములో రెండువేలు తనకిచ్చి, వెయ్యి రూపాయలు మాత్రం నేను తీసుకోవాలట. అందులో అయిదొందలు పెట్టి పార్టీ ఇవ్వాలట. నేను ఒప్పుకోనందున ప్రైజూ పోయింది; ఇక ఆ పత్రికలో నా రచనలు పడే ఛాన్సూపోయింది" నిస్సహాయంగా అన్నాడు.

"పోనీ, ఆ అయిదొందల రూపాయలే బహుమతి- అనుకుని ఒప్పుకోకపోయావా? నీ నవల ఒకదానికి ప్రైజొచ్చిందంటే మిగతా పత్రికలవాళ్ళు కూడా గుర్తిస్తారుకదా?"

"ఇక్కడ విషయం డబ్బుకాదు విజయా... మోరల్! డబ్బులిచ్చి నా నవలకు బహుమతిప్పించుకోవటంకన్నా రాయటం మానేయటమే మంచిదికదా"

"అంటే, రేపు ప్రైజొచ్చిన నవలా రచయిత ఆ ఎడిటర్‌కు షేరు ఇచ్చినట్టేనా?"

"ఆ విషయం నాకు తెలియదు. నా అనుభవం నేను చెప్పాను"

కాస్సేపు ఆగి, ఆలోచించి అంది విజయ-

"నువ్వబద్ధం చెబుతున్నావని నా ఉద్దేశంకాదు కానీ, నీ వరస చూస్తుంటే ఇప్పుడు పేరుపొందిన రచయితలంతా మోరల్స్‌లేనివారనే అనుకోవాల్సి వస్తుంది"

"నేనలా అన్లేదే. ఇప్పుడే పుట్టుకొస్తున్న నాలాంటి రచయితలకు తగిన వాతావరణం లేదంటున్నాను"

"ఇది ప్రతి తరంలోనూ వినిపిస్తున్న ఆరోపణే కదా - కొత్తేముంది?"

అరనిమిషం ఆలోచించాడు గౌరీశం. తరువాత చెప్పాడు-

"ఇంతవరకూ ప్రతి తరంలోనూ వున్నదేమిటంటే కొత్తదనాన్ని ఆదరించేవాళ్ళు లేకపోవటం. ఒక కొత్త ప్రక్రియ, ఒక కొత్త శైలి, ఒక కొత్త ధోరణి- ఎవరైనా ప్రతిపాదిస్తే, దాన్ని వెంటనే ఆదరించి స్వీకరించేవారు దొరకక, పోరాటంలాంటిదిచేసి వృద్ధిలోకి రావలసివచ్చేది. ఇప్పుడేమయిందంటే, కొత్తదనం పేరిట, పాఠకుల ఆసక్తిపేరిట అడ్డమైన రచనలూ రాయిస్తున్నారు. డిటెక్టివ్ కథలో ఒక కొత్త టాపిక్ ఇరికించి, పరిశోధనాత్మకాలంటున్నారు. సర్క్యులేషన్ పెంచుకోవటానికి పాఠకుల్ని రకరకాలుగా ఊరించి, కవ్వించి చివరికి మోసగించే ప్రలోభపెడుతున్నారు..."

"మోసగించటమా- అంటే?" మధ్యలో అడిగింది విజయ.

"ఇప్పుడో పత్రికలో రాబోతున్న సీరియల్ గురించి ప్రకటన చూశావుగదా! అసలా నవలలో థీమ్ ఏమిటో తెలియదు. ఎవర్ని గురించి, ఏమని రాస్తున్నారో తెలియదు - అయినా ఆ రచన ప్రచురిస్తే రచయితనీ, ఎడిటర్నీ చంపేస్తామని బెదిరింపులొచ్చాయట. అసందర్భంగా లేదూ. 'అమ్మో... ఎంత గొప్పదో ఈ నవల' అనే భ్రాంతిలో పాఠకుణ్ని పడేసి, పత్రిక కొనిపించుకోవటానికి కాదా ఇలా రాయటం. ఇక ఆ తరువాత వారం ఎన్ని బెదిరింపులు వచ్చినా, ప్రాణానికి తెగించైనా సరే - ఆ సీరియల్‌ని ప్రచురించేది ఖాయమని, పాఠకులకు సంపాదకుని హామీ. నీకో సంగతి చెప్పనా - ఇది చూడగానే - నేను టెలిగ్రాఫ్ ఆఫీసుకెళ్ళి విచారించాను, ఈ వారం కాదుకదా రెండు నెలలనుంచీ ఆ పత్రికాఫీసుకు ఒక్క టెలిగ్రామైనా రాలేదట" ఆగాడు గౌరీశం.

"సరే... వాళ్ళ ప్రకటనలు అబద్ధమే. కానీ




ఇందువల్ల నీకొచ్చిన నష్టమేమిటి?" ప్రశ్నించింది విజయ.

"బోల్డు నష్టం. నేను రాసిన నవలకు అలాంటి పబ్లిసిటీ ఇవ్వటానికి కుదరదుకదా అందువల్ల నా నవల వేసుకోరు కదా. నా నవల వాళ్ళు వేసుకోవాలంటే నేనూ అదే తరహాలో, అసలు సంగతివున్నా లేకున్నా ప్రతీవారం పాఠకులని ఉత్కంఠతలూగించేట్టూ, రెచ్చగొట్టేట్టూ రాయాలన్నమాట"

"అంతేకదా - సర్వైవల్ ఆఫ్ ఫిట్టెస్ట్- అంటే అదేకదా. లేకపోతే రాయటం మానుకో."

"అంతే... రాయటమైనా మానేస్తాను కానీ ఇలాంటి చెత్త నవలలు రాయను" స్థిరంగా అన్నాడు గౌరీశం.

"అసలు నీలాంటివాళ్ళను చూస్తే నాకు నవ్వొస్తుంది" అంది విజయ, నవ్వుతూ.

"సిద్ధాంతంకోసం భోగభాగ్యాలను వదులుకున్నవాళ్ళను చూస్తే, నీలాంటి పెట్టీ బూర్జువాలకు నవ్వేవస్తుంది" నాటక ఫక్కీలో అన్నాడు గౌరీశం.

"చాల్లే నీ సిద్ధాంతాలు. నేను మాట్లాడేది ఆ సంగతికాదు. నువ్వొక కథో, నవలో రాయాలనుకుంటావు. సరే... అది నీ ధోరణిలో నువ్వే రాసుకుంటే, ఎవరికోసం రాసినట్టు. పాఠకుడికి అర్థమయ్యేట్టు రాయాలికదా! నీకు తెలివితేటలుంటే వాటిని చూపించుకోవటానికి నవలలే రాయాలా ఏం?"

"అయితే ఏమిటంటావు?" సీరియస్‌గా అడిగాడు గౌరీశం.

"నువ్వు రాసేదేదో పాఠకుడికర్థమయ్యేట్టుగా, ఆసక్తికరంగా అనిపించేట్టు రాస్తే గదా నిన్ను పాఠకుడు గుర్తించేది?"

"ముందది పాఠకుడిదాకాపోవాలంటే, ఎడిటర్‌కు నచ్చాలిగదా?"

"అదే నేను చెబుతున్నది. ఎడిటర్ కూడా ఒక పాఠకుడే. ఆ విషయం గుర్తు పెట్టుకో. ఆయనకు చదవాలనిపిస్తే ఆటోమేటిక్‌గా దాన్ని పాఠకులకందిస్తాడు. ఇక లాలూచీగాళ్ళూ, తలతిక్క ఎడిటర్లూ అంటావా - ప్రతిరంగంలోనూ అలాంటి వాళ్ళు కొందరుంటారు. అందరూ అలానే వుండరుకదా"

"అమ్మో... నీతో మాట్లాట్టమే ఒక నాలెడ్జిలా గుందే" నవ్వాడు గౌరీశం.

"నేను సాహిత్యం గురించి చెప్పలేదు. నీతినీ, పద్ధతినీ నమ్ముకుని బతకాలనుకునేవాళ్ళు కొన్ని కష్టాల్నీ అవరోధాల్నీ ఎదుర్కోవటం ఎక్కడైనా వుండేదే. అంతమాత్రాన ప్రపంచంలో మనమొక్కరమే ఏదో త్యాగంచేస్తున్నామని అనుకుంటూ, బాధపడిపోవటం మంచి పద్ధతికాదు. అదీ నాకు తెలిసింది" అంది విజయ లేచి నిలబడుతూ.

విజయ వెళ్ళిపోగానే సిగరెట్ అంటించుకుని, ఆలోచనలోపడ్డాడు గౌరీశం.

★ ★ ★

"అక్కా... నువ్వు కుట్టు క్లాసులకు వెళుతున్నట్టులేదు, మానేశావా?"

"మానేయలేదనుకో, అప్పుడప్పుడూ పోతున్నాను. ఎందుకు?"

"ఊరికే నేర్పిస్తున్నారుకదా, నేనివ్వాళ్టి నుంచీ పోదామనుకుంటున్నాను. ఇద్దరం కలిసి వెళ్ళొచ్చని అడిగాను"

"నాకంత ఓపికలేదు, నీ దగ్గర నేర్చుకుంటాలేవే, అవసరమైనప్పుడు"- నిరాసక్తంగా అంది అరుణ.

"పోనీ, మళ్ళీ ఫిగర్స్ గీస్తావా- పెన్సిల్, పేపర్సూ ఇచ్చిపోనా?" మళ్ళీ అడిగింది విజయ.

"పాపం, మరి నీకు డబ్బులెలాగే"

"నాకెందుకక్కా డబ్బులు?" నవ్వింది విజయ.

"ఇయ్యి... చూద్దాం" అనాసక్తిగా అంది అరుణ.

విజయ గబగబా అన్నీ తెచ్చిపెట్టింది- "ఒకటి పూర్తయింది. ఇంకొకరిది ఒక ఫిగర్ మిగిలుంది. మొత్తం ముగ్గురి రికార్డ్సు. ఇది మనోహర్‌ది. చాలా నీట్‌గా వుండాలి మరి. చూడూ... అన్నీ స్కెచ్‌లు వేసిపెట్టకు. నువ్వు ఒకటి పూర్తిచేసేలోగా నేనొస్తాను, ఏమైనా తెలియకపోతే అప్పుడు చెబుతాను"

విజయ వెళ్ళిపోగానే అన్నీతీసి పక్కన

పెట్టేసింది అరుణ. మరునాడు మధ్యాహ్నంవ రకుకదా, ఇవాళొకటి మిగతావి రేపు చేయొ చ్చు- అనుకుంటూ లేచి, తల్లికిచెప్పి బైటికెళ్లి ంది.

అరుణకు భర్త చనిపోయిన బాధేమీలేదు. అతను చచ్చిపోయినందుకు ఇన్నిరోజులు ఏడుస్తూ కూచునేంతటి బలమైన అనుబంధం ఏర్పడకముందే అది తెగిపోయింది. మంచి లగ్నంచూసే చేశారు. తన రాత ఇట్లావుంటే ఏలగ్నం మాత్రం ఏం చేస్తుంది... పెళ్ళికాన ప్పుడు లోకుల చూపులకంటే ఇదే బాగుంది. అప్పుడు ముక్కూ మూతీ విరిచిన వారు, ఇప్పుడు సానుభూతైనా చూపిస్తున్నారు. తన క్కావలసింది సానుభూతీకాదు, మొగుడూకా దు. తనకిప్పుడు మళ్ళీ పెళ్ళన్నా ఏరెండో పెళ్ళివాడో, పిల్లలతండ్రో, ముసలివాడో తప్ప మంచి సంబంధం రాదు. వచ్చినా నాన్నచేసే స్థితిలోలేడు.

తను ఏం చేయాలో అరుణకు తెలుసు. డబ్బు సంపాదించుకోవాలి. తనకు సరిపోయే టంత అయితే ఆమె చేసుకోగలదు. కానీ ఆ అవసరం అరుణకిప్పుడులేదు. తండ్రి వున్నంతకాలమూ వుండదు. కానీ అన్నిటికీ తడుముకుని, లెక్కలు చూసుకుంటూ ఎంతకా లమిలా బతకటం అన్నదే ఆమె ఆలోచన. ఉన్నదాన్ని సరిపుచ్చుకోవటమన్నది సంతృప్తిని స్తుందేమో కానీ అభివృద్ధిని మాత్రం అందించదు. ఆ అభివృద్ధి ఏ దోవలో పురోగ మించాలనేది ఒక సమస్యైతే, అసలు ఎంతవ రకూ పురోగమించితే సంతృప్తి కలుగుతుంద నేది తెలుసుకుని వుండటం, నిర్ణయించుకో వటం మరో సమస్య. విసిగి వేసారిన ప్రతి మనసుకూ సాధారణంగా ఏదోరకంగా ఏర కంగానైనాసరే, తన లక్ష్యాన్ని సాధించి తీరాల న్న మొండి పట్టుదల ప్రవేశించినప్పుడు మరి కొన్ని విచిత్రమైన పరిస్థితులు ఎదురవు తాయి. వాటిని భరించగల నిబ్బరం, ఆత్మస్థై ర్యం కూడా వుండాలి మరి.

సంపత్ ఇంటికి చేరుకునేసరికి అతనెక్కడి కో వెళ్ళటానికి హడావిడిగా బయల్దేరుతున్నా డు. మరెవరో ఇద్దరు అరుణకు తెలియనివారు న్నారు. అందులో ఒకరు అమ్మాయి.అరుణను చూస్తూనే-

"అమ్మయ్య... బతికిపోయాను" అన్నాడు సంపత్ కూర్చుంటూ.

"దేనికి?" అంది అరుణ కూడా కూర్చుంటూ.

"నాకో గొప్ప సాయంచేయాలి"

"నేనా... ఏమిటి?" అంది, పరాయివాళ్ళ ముందు తను చేయవల్సిన సాయమేమిటో నని సంకోచిస్తూ.

అది గమనించి,

"ఈవిడ జెన్నిఫర్. ఇతను రమేష్"- అని వాళ్ళిద్దర్నీ పరిచయంచేసి, "ఈవిడ అరుణ. మంచి సింగర్" అన్నాడు సంపత్, వాళ్ళకు అరుణను పరిచయంచేస్తూ.

"మై గుడ్‌నెస్... సింగర్... క్లాసికల్స్, నట్టు వాంగం అవీ వస్తాయా మీకు?" హడావిడిగా అడిగింది జెన్నిఫర్.

"అన్నీ వస్తాయి. డాన్స్‌లో కూడా కొంచెం ప్రవేశముంది" సంపత్ చెప్పాడు సమాధానం.

"అయితే మీరే మమ్మల్ని రక్షించాలి"- రమేష్ అర్థించాడు.

"అసలు సంగతేమిటి?" ఇబ్బందిగా అంది అరుణ.

"మెల్లిగా అడుగుతారేమిటి? మైగాడ్- మీరి ప్పుడు రాకపోతే..." అంటూ, అరుణ నుదుటి వైపు చూసి, "అవునూ... మీరు క్రిస్టియనా" అంది.

"కాదు" మెల్లిగా అని, అడ్డంగా తలూ పింది అరుణ.

"షీ ఈజే విడో" చెప్పాడు సంపత్.

"అయామ్ వెరీసారీ... థౌజండ్ అపాల జీస్" లేచొచ్చి, అరుణ చుబుకం పట్టుకుని బాధగా అంది జెన్నిఫర్.

అరుణ మౌనంగా కూర్చుంది.

"ఓహ్... మనం పోయినవాటి గురించి బాధపడకూడదు. ఫర్‌గెటిట్"- ఈజీగా అన్నా డు రమేష్.

"వచ్చే జన్మలో నాకు పుట్టకముందే మొగు డు చచ్చిపోవాలని శపించెయ్యండి. ప్లీజ్




రిలాక్స్" జెన్నిఫర్ అంది.

"పుట్టకముందే మొగుడు చచ్చిపోవటమే మిటి?" సంపత్ అన్నాడు.

"అమ్మో- నా పెళ్ళాంగా పుట్టబోయేది ఎంత రాక్షసీ- అని, చేసుకోబోయేవాడు జుట్టు పీక్కుని చస్తాడన్నమాట"- వివరించింది జెన్నిఫర్.

ముగ్గురు నవ్వేశారు.

"అసలు విషయమేమిటంటే..."

"ఇవాళ మా ప్రోగ్రాముంది. మా నాటక మండలివాళ్ళమూ, మరో క్లబ్బూ కలిసి నాట్య పోటీ నిర్వహిస్తున్నాము"

"అమ్మతోడు మిమ్మల్ని చందా అడుగుతా మనుకుంటున్నారేమో, అది మాత్రంకాదు"

"అసలేమైందంటే, బాక్‌గ్రౌండ్ పాటలు పాడాల్సిన సింగర్ నిన్ననే ఎవరితోనే లేచిపోయిందట. మాకా విషయం ఇవ్వాళ తెలిసింది..."

"మీరో జోక్‌విన్నారా... ఒకాయన్ని మరొకాయన పలకరించాడు- పాపం, మీ ఆవిడ మీ డ్రైవర్‌తో లేచిపోయిందటకదా- అని. అందుకా పెద్దమనిషి సమాధానంగా అన్నాట్ట- పావమెందుకండీ, నాకేం ఇబ్బందిలేదు. నాకు డ్రైవింగ్ వచ్చు- అని. మహానుభావుడాయన. ముందే డ్రైవింగ్ నేర్చుకున్నందువల్ల ఇబ్బంది పడలేదుకానీ, మా సంగతలా కాదే. ఉన్నట్టుండి పాడటం తెలిసిన ఆర్టిస్ట్ కావాలంటే ఎక్కడ దొరుకుతుంది చెప్పండి..."

"ఇంకా నయం, అదేదో తబలిస్టును లేవదీసుకుపోయుంటే, మరొకణ్ని వెతకలేక చచ్చేవాళ్ళం. అక్కడికీ వీళ్ళకు నేను చెబుతూనే వున్నాను- ఈ కీర్తనలన్నీ నాకు కంఠతా వచ్చని. కానీ, నేను పాడతానంటే వీళ్ళేమో శ్రుతులూ, లయలూ, నా పిండాకూడూ ఏమితేమిటో వుండాలంటున్నారు"

రమేష్ మాటలకు ముగ్గురూ నవ్వారు.

"అయితే నన్ను రమ్మనా?"

"క-క-కరెక్ట్" ముగ్గురూ ఒకేసారి అరిచారు.

"కానీ నేను ఇంట్లో చెప్పాలి. తిరిగివెళ్ళాలంటే రాత్రవుతుందేమో"

"నేను సాయంత్రంకల్లా డ్రైవింగ్ నేర్చుకుని, ఎవరో ఒకర్ని కారు అప్పడిగి, స్వయంగా మిమ్మల్ని డ్రాప్ చేస్తాను" అంది జెన్నిఫర్.

"అయితే ముందు మనం ఇన్సూర్ చేయించుకోవాలి- పదండి" అన్నాడు రమేష్.

★ ★ ★

"... స్వామి రారా- నీవు రారా
స్వామి రారా- నీవు రారా
యదువంశ సుధాంబుధి చంద్రా
స్వామి రారా- నీవు రారా..."

స్టేజీమీద డాన్సుచేస్తున్న చిన్నారి పాపను చూస్తుంటే, తన పాట తనకే చిత్రంగా అనిపించింది అరుణకు-

"శతకోటి మన్మథాకారా
స్వామి రారా...
స్వరరాగ సుధారసధీరా
స్వామి రారా..."

అందరూ మైమరచి చూస్తున్నారు. జెన్నిఫర్ ఒక గ్లాసులో మంచినీళ్ళు తీసుకుని వచ్చి, అరుణ పక్కన కూర్చుంది. ఏదో అవసరం గడిచిపోతుందని అరుణను హడావిడిగా తీసుకొచ్చిన దగ్గర్నించీ అందరికీ బెరుకుగానే ఉంది. ఎలా గడుస్తుందోనని. అరుణ మొదటి పాట మొదలెట్టగానే హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

కోకిల నల్లగా ఉంటుందిగానీ, ఎంత కమ్మటి గొంతో... దేవుడా, ఈమెకా వైధవ్యం అనే శాపం ఎందుకిచ్చావయ్యా ఇంత చిన్న వయసులో అనుకుంది జెన్నిఫర్, అరుణ పాటను వింటూ.

"...నీవు రారా స్వామి రారా"
"నీవురారా స్వామి రారా"

ఆడియన్స్‌లోంచి ఓ కొంటెకోణంగిలేచి, నిలుచుని, అదేబాణీలో "దేవి రానా నేను రానా" అని పాడేసరికి అందరూ గొల్లుమన్నారు. అరుణ కూడా ముసిముసిగా నవ్వుకుంది.

చాలాకాలం తరువాత, రోజంతా సరదాగా గడిచిపోయింది అరుణకు. అన్నీ అయిపోయి సెలెక్షన్లు చేసి బహుమతిలిచ్చేసరికి తొమ్మిదిన్నరయింది. అందరితోపాటు అరుణను కూడా స్టేజీమీదకు పిలిస్తే అరుణ వెళ్ళలేదు. జెన్నిఫర్ బలవంతంగా లేపి, స్టేజీపైకి నెట్టింది.

షీల్డ్‌తోపాటు ఓ కవర్ చేతిలో పెట్టారు. తరువాత ఆ కవర్ చూసుకుంది అరుణ. వంద రూపాయలున్నాయి.

"ఇదేమిటీ?" అంది సంపత్‌తో.

"అందరితోపాటు నీకూ. ఆ సింగర్‌కైనా ఇచ్చేవాళ్ళమే" అన్నాడు సంపత్.

అరుణ మొహమాట పడుతుంటే, అందరూ సర్దిచెప్పేశారు.

"అబ్బ... ఈ షీల్డు నాకివ్వవా అరుణా మా ఇంట్లో షెల్ఫ్‌లో పెట్టుకుంటాను" గారంగా అడిగింది జెన్నిఫర్.

"అరుణకిచ్చింది నువు తీసుకోవటమేమిటీ" మధ్యలో అడ్డుకున్నాడు రమేష్.

"అబ్బ మనమిచ్చినది ఏదో వెండిషీల్డయినట్టు- ప్లాస్టిక్‌దేగదా. ఐనా మధ్యలో నీకెందుకూ" అంది జెన్నిఫర్.

"ఇదిగో, మనని మనమే కించపరుచుకోకూడదు" దెబ్బలాడాడు సంపత్.

అరుణ నవ్వుకుంటూ, జెన్నిఫర్‌కిచ్చేసింది. సంపత్, జెన్నిఫర్ తోడుగా వచ్చి అరుణను ఆటోలో ఇంటిదగ్గర దింపేసి వెళ్ళిపోయారు. తల్లికి చెప్పే వెళ్ళింది కనుక, సినిమాకెళ్ళి ఉంటుందనుకుని, ఎవరూ ఏమీ అడగలేదు.

★ ★ ★

మరునాడు పొద్దున్నే కూరగాయలులేవని తల్లి చెబితే, డబ్బులు అడక్కుండా వెళ్ళి తెచ్చింది. కాఫీ తాగి, ముందురోజున విజయ ఇచ్చిన వర్క్ తీసుకుని కూచుంది. ఒకటి నాడీమండలం, మరొకటి గుండె. ఇంకా రెండు ఫిగర్స్ ఉన్నట్టున్నాయి. ఇదేనేమో హృదయం అంటే. ఇంతకుముందు గీసినప్పుడు కూడా ఇలాగే ఆలోచించింది. రక్తాన్ని శుద్ధిచేసే ఈ హృదయంలో ఆలోచన లెక్కడుంటాయో. వాటిని కూడా శుద్ధిచేసి, పనికొచ్చేలా చేస్తే ఎంత బావుండేది. ఆలోచిస్తూ స్కెచ్ మొదలు పెట్టింది.

కాస్సేపటికి విజయొచ్చి, అప్పుడు మొదలుపెడుతున్నందుకు లబోదిబోమని, తనూ రెండు తీసుకుంది. సాధారణంగా తన పనుల వీలునుబట్టి, మనోహర్ టైంచెబుతుంటాడు. చెప్పిన టైముకు ఖచ్చితంగా వస్తాడు. విజయ కూడా అన్న టైముకు ఇచ్చేస్తుంటుంది.

అరుణ గీయటం అయిపోయి, విజయ కూడా పూర్తిచేసి, వేళ్ళు విరుచుకుంటుండగా మనోహర్ రానేవచ్చాడు.

"మిగతా డబ్బులు వాళ్ళ దగ్గర తీసుకుని రేపు ఇచ్చేస్తాను. నా డబ్బులు మాత్రం తీసుకో" అని పర్సుతీశాడు. చిల్లర ముప్పై రూపాయలే వున్నాయి. వంద నోటుంది. పర్సులోని కాయితాలన్నీ తిరగేయటం మొదలెట్టాడు.

"ఏమైంది డబ్బులు ఇవ్వబుద్ధికావటంలేదా?" టీ తీసుకొచ్చి ఇస్తూ అంది విజయ.

విషయం చెప్పి, మళ్ళీ అన్నాడు

"ఇదిగో రెండు లాటరీ టికెట్లున్నాయి. ఇవి తీసుకో. కావాలంటే తరువాత నాకిచ్చెయ్. రెండ్రూపాయలిస్తాను" అంటూ డబ్బులతోపాటు అవి కూడా అందించాడు ఓ కాగితం మీద వాటి నంబర్లు రాసుకుంటూ.

"ఐతే, రాత్రికి రాత్రి లక్షాధికారి కావాలని పెద్ద ఆశవుందన్నమాట" అంది విజయ తీసుకుంటూ.

"సరేలే... అదొక్కటే తక్కువ. బస్టాపులో నిలబడితే ఎవడో కుర్రాడు ప్రాణంతీసి అంటగట్టాడు" అన్నాడు మనోహర్.

"నీకు లాటరీ టికెట్లు కావాలా డబ్బులు కావాలా?" అరుణనడిగింది విజయ.

"అమ్మకిచ్చెయ్యవే డబ్బులు నాకెందుకు" అంది అరుణ.

"అవసరమున్నప్పుడు అమ్మకిద్దువుగానీ తీసుకో" అంటూ పదిహేను రూపాయలూ, ఓ లాటరీ టిక్కెట్టూ అక్క చేతిలోపెట్టి గుప్పిలి మూసింది.

ఐదునిమిషాలు కూచుని మనోహర్ వెళ్ళిపోయాడు. విజయ లోపలికెళ్ళిపోయింది.

తన లాటరీ టిక్కెట్ తీసుకుని నంబర్ని పరిశీలించింది. ప్రైజులు ఏమున్నాయో చూసింది. ఈ టిక్కెట్‌కేగానీ మూడు లక్షల రూపాయల బంపర్‌ప్రైజు తగిలితే ముందు ఓ యాభై చీరలు కొనుక్కోవాలి. ఒక ఇరవై ఫొటోలు దిగాలి. లక్ష రూపాయలు చేతిలో వుంటే

సినిమాలో చిన్న షేర్ తీసుకుని, హీరోయిన్ అయిపోవచ్చు. ఏ నిర్మాతైనా ఒప్పుకుంటాడు.

సినిమా తప్పకుండా హిట్టవుతుంది. 'అంతులేని కథ'లో జయప్రదకూ, 'సితార'లో భానుప్రియకూ వచ్చినంత పేరొస్తుంది తనకు. ఇక ఆ తరువాత తన ఇంటిముందు నిర్మాతల క్యూలు. అన్నట్టు తన పేరుతో ఇప్పటికే ఒక ఆర్టిస్ట్ ఉంది గనుక తన పేరు మార్చుకోవాల్సి వస్తుందేమో. ఆలోచించి మంచి పేరు పెట్టుకోవాలి. తమిళ్ ఫీల్డులోనూ, హిందీ ఫీల్డులో కూడా బాగుంటుందనిపించే పేరు చూసుకోవాలి. సుధాకర్‌గాణ్ని తన సెక్రెటరీగా పెట్టుకోవాలి. తను ఎంత డిమాండ్ చేస్తే అంతా ఇస్తామని ప్రాధేయపడతారు నిర్మాతలు. హీరోలంతా తననే రికమెండ్ చేస్తారు తమ సినిమాల్లో. అమ్మో కాల్షీట్స్ అడ్జెస్ట్ చేయటానికి నానా కష్టాలూపడాలి. ఎప్పుడు వీలుంటే అప్పుడే ఇమ్మంటారు కొందరు. అలా ఇవ్వకూడదు వాళ్ళ కాల్షీట్ వచ్చేనరికి తన రేటు పెరిగిపోతే... ఏడాది తిరిగే నరికి మద్రాసులో సొంతిల్లు కొనుక్కోవచ్చు. అమ్మా, నాన్న ఎంత సంతోషపడతారో. ఇంటిముందు లాన్, ఇంటివెనక తోట, కె.ఆర్. విజయలాగా పాలరాతి స్విమ్మింగ్‌పూల్ కట్టించుకోవాలి. జమునలాగా కుక్క పిల్లల్నీ కుందేలు పిల్లల్నీ పెంచుకోవాలి. ప్రస్తుతం పాటలు పాడుకునే హీరోయిన్ తనొక్కతే అవుతుంది.

ఒకరోజు ఏ ఇంపాలా కార్లోనో సడన్‌గా ఇక్కడికొచ్చేసి కిరాణాకొట్టువాడికీ, కూరగాయలావిడకీ, బట్టలకొట్టువాడికీ నాన్న ఇవ్వాల్సిన పద్దులన్నీ లెక్కచూడకుండా, హేండ్‌బాగ్ లోంచి నోట్లు తీసి, లెక్కపెట్టకుండా మొహాన కొట్టాలి. ఎలాంటి అరుణ ఎలా అయిపోయిందీ- అనుకుంటారు. లక్ష్మిపిన్నికి బహుమానంగా ఓ పంచదార బస్తా, ఒక కార్టన్ టీపొడి డబ్బా ఇచ్చేయాలి. సెంటర్లో వుండే ముసలి రిక్షావాడికి ఓ రిక్షా- రిక్షా ఏం ఖర్మ ఆటో కొనివ్వాలి. పాపం, మంచివాడు.

ఆలోచిస్తూ నిద్రలోకి జారింది అరుణ.

★ ★ ★

సుధాకర్ వెళ్ళి నాలుగునెలలపైనే అయింది. వెళ్ళిన వారంరోజులకు ఒక ఉత్తరం రాశాడు. మొదటి జీతం తీసుకోగానే కవర్లో అయిదు రూపాయల నోటుపెట్టి, అది శ్రీనుకియ్యమని రాశాడు. తరువాత అయిదారు వారాలకు మరో ఉత్తరం రాశాడు. ఐదేళ్ళపాటు పనిచేస్తానని బాండ్ ఇవ్వమని అడుగుతున్నారనీ, తనకు అలా ఇవ్వటం ఇష్టంలేదనీ రాశాడు. ఇక ఉత్తరాలేమీ రాలేదు.

చిన్నకొడుకేదో తవ్వి తలకెత్తుతాడని వెంకటేశం, జగదాంబ ఇద్దరూ ఏనాడూ ఆశించలేదు. మంచివాళ్ళకు మంచే జరుగుతుందని మాత్రం వాళ్ళకు నమ్మకం అలాగేవుంది. ఈలోగా నారాయణ ప్రైవేట్‌గా గ్రాడ్యుయేషన్ పూర్తి చేయటంతో గ్రాడ్యుయేట్ అలవెన్సొచ్చి, జీతం కొంచెం పెరిగింది. కష్టాలు కష్టాల్లాగే వున్నాయి; నమ్మకాలు నమ్మకాల్లాగే వున్నాయి. అయితే జీతాలు చిన్న ముల్లులా తిరుగుతుంటే, ధరలు మాత్రం పెద్దముల్లులా తిరుగుతున్నాయి. కాలం యధాతథంగా నడుస్తూంది.

ఆ రోజు మొదటి తారీఖు. ఖాతా కొట్టువాడు ఇంటికొచ్చాడు.

"నాన్న మిల్లుకెళ్ళాడు. అయినా మీరెందుకొచ్చారు. సాయంత్రం మేమే ఎవరో ఒకరం వచ్చేవాళ్ళంకదా" అన్నాడు నారాయణ.

"ఈ మాత్రందానికి నాన్నెందుకయ్యా! నువ్వూ ఉద్యోగం చేస్తున్నావు కదా"

"ఇవాళే ఫస్టుకదండీ. సాయంత్రం రాగానే పంపించేస్తాను"

"ఏం పంపుతారయ్యా... మూడు వందలు- అంతేకదా. నాలుగు నెలలుగా పద్దు పెరుగుతూనే వుంది. మొత్తం ఆరొందలయింది ఈ నెల సరుకులు కలుపుకుని"

"అలాగా, నాన్నకు చెబుతానులెండి" ముక్తసరిగా అన్నాడు నారాయణ.

"ఇదిగో నారాయణా నీకు చెప్పినా, మీ నాన్నకు చెప్పినా ఇయ్యక తప్పదుకదా. కొంచెం తేల్చిపంపరాదూ" మొండిగా అన్నాడు.

అంతలో ముందు రూంలోకి విజయొచ్చింది.

"విజయమ్మా... నువ్వు చెప్పు. ఇన్నిరోజులూ

నేనడిగానా? మీ పరిస్థితి నేను చూసినట్టే, నా పరిస్థితి మీరూ చూడాలి. నీకేం తెలుసు బాబూ నా సంగతి! అందరికీ అరువులిచ్చి కూచుంటే ఎలా నడుస్తుంది చెప్పు. కాస్త ఏలాగోలా నా బాకీ తీర్చారంటే మీకు పుణ్యముంటుంది"

"మేం ఒక్కరం ఇయ్యకపోతే మూసుకునే షాపేనా నీది. ఎందుకనవసరంగా ఇంటికొచ్చి గొడవచేస్తున్నావు? ఇవ్వనప్పుడే సర్దుకుపోవాలి. తెలిసినవాళ్ళంటే అంతేకదా మరి"

నారాయణ కళ్ళప్పగించి చెల్లెల్ని చూస్తూండిపోయారు.



"ఎన్ని రోజులమ్మా ఒకటి కాదు, రెండు కాదు నాలుగు నెలలుగా తక్కువిస్తున్నారు ఈసారి డబ్బివ్వకపోతే సరుకులివ్వలేను అయినా మీ అన్నను మాట్లాడనీయరాదూ. చిన్నదానివి నీకెందుకు?"

పెద్దవాళ్ళు మాట్లాడితే డబ్బు తీసుకోవా ఏమిటి? ఈ నెల నుంచీ మా అన్నయ్యకు జీతం ఎక్కువొస్తుంది. నెలనెలా ఓ డెబ్బై రూపాయలు ఎక్కువిస్తాం. ఇక వెళ్ళు" వినుగ్గా అంది విజయ.

"అమ్మో... డెబ్బై కాదమ్మా! కనీనం వంద చొప్పున ఇవ్వు. నేనూ పెద్ద బజార్లో కట్టాలి. వాళ్ళు నాలాగా ఆగుతారా చెప్పు".

"ఇంకో నాలుగు నెల్లు గడవనీ, బోనసొస్తే నీకేగదా ఇచ్చేది. ఇంకోసారెప్పుడూ ఇంటికి రాకు"

ఇక ఊరుకున్నాడు. ఏదో గొణుక్కుంటూ వెళుతున్నవాణ్ని వెనక్కి పిలిచింది విజయ-

"ఇదిగో- ఇంకోసారి సరుకులివ్వనని అనొద్దు- జాగ్రత్త. నీకిచ్చే డబ్బుతో బైట నగదుకొ్కనుక్కుంటే నెలకో పాతికైనా తక్కువవుతుంది. ఆ పాతిక చొప్పున ఎన్ని నెలలైతే అన్ని నెలలు



చెల్లేస్తా నీ బాకీ... తెలిసిందా?''

"అబ్బా... వద్దమ్మా! ఇక సాగదియ్యకు. సరేనన్నానుగదా. ఎంత పౌరుషమయ్యా మీ చెల్లెలికి. సాయంత్రం సరుకులకు రామ్మా రేపో, ఎల్లుండో ధరలు పెరుగుతాయంటున్నారు'' అంటూ వెళ్ళిపోయాడతను.

"ఏం మాట్లాడటమే అది విజయా? అతను నిజంగా సరుకులియ్యనంటే ఎలా?'' అన్నాడు నారాయణ.

"ఎలాగో చెప్పాను కదా- అంతే! సరుకులియ్యడట, పెద్ద పోజులు''

"మాట వరసకన్నావుగానీ, నిజంగా ఎలా చేస్తావే?''

"మాటవరుసేమిటి? మనదగ్గర అలాంటి వేంలేవు. అన్నామంటే అంతే. నీకు తెలీదన్నయ్యా, అందరూ నగదుకే తెచ్చుకుంటారా ఏమిటి? ఆయనకు షాపు నడవాలి. మనకు ఇల్లు నడవాలి. అసలీ కిరాణా షాపులు ఎక్కువగా నడిచేది అరువు తీసుకునే వాళ్లతోనే. ధరలు ఎక్కువేసుకోవటం లేదూ, అరువు ఊరికే ఇస్తున్నట్టు...'' లోపలికి వెళుతూ- "సర్లే... కాఫీ తాగుదువుగానీ రాఅన్నయ్యా. పొద్దున్నే వెధవ సంత'' అంటూ లోపలికి నడిచింది.

అరువు కొట్టువాణ్ణి విజయ ఆపగలిగింది కానీ, ఇంటియజమానికి ఎవరూ సర్దిచెప్పలేక పోయారు. పదకొండో తేదీ సాయంత్రం అద్దె తీసుకుని వెళుతూ, ఆరు నెలల కిందటే పెంచవలసిన అద్దె, ఖచ్చితంగా మరునటి నెలనుండీ పెంచకపోతే, ఇల్లు ఖాళీ చేయమని ఖండితంగా చెప్పి వెళ్లాడు.

"ఒకటి కాదు, రెండు కాదు, డెబ్బై అయిదు రూపాయలు ఒక్కసారే పెంచాలంటే మాటలా'' ఇదయ్యింది జగదాంబ.

"కాకపోతే ఖాళీ చెయ్యమని చెప్పే వెళ్లాడు కదా'' అన్నాడు వెంకటేశం నిస్సత్తువగా.

"అనటానికేముంది నాన్నా, అనగానే చేస్తామా ఏమిటి? మరో ఆర్నెల్లు ఇలాగే పోనిద్దాం'' అంది అరుణ.

"ఈ నెల ఇవ్వకపోతే, ఖచ్చితంగా ఖాళీ చేయిస్తాడు. ఆయన వాలకం చూస్తే తెలియలేదూ''

"ఇందుకే ఇల్లు కట్టుకుందామండీ అని కాపురానికొచ్చిందగ్గర్నించీ పోరుతున్నాను చెవినిల్లు కట్టుకుని. నామాట విన్నారా?''

"చస్తే తగలెయ్యటానికి గతిలేదుగానీ, ఏకంగా ఇల్లే. ఏమిటి, మాటలనుకున్నావా. మనకొచ్చిన జీతమంతా దాచినా కట్టలేమే- పిచ్చిదానా''

"మీరు నామాటెప్పుడు విన్నార్లెండి. ఇల్లనగానే ఏమైనా ఏడంతస్తుల మేడన్నానా, ఛత్రసాల భవంతన్నానా. ఏదో కాస్త స్థలం తీసుకుని రెండు గదులు- రేకుల గదులేసుకున్నా సరిపోయేది. కాలక్షేపం చేయలేక పోయేవాళ్లమా... పిల్లలు పెరిగితే, వాళ్లచేతనైతేవాళ్లే మిగతాది పూర్తిచేసుకునేవాళ్లు''

"ఇప్పుడేం చేద్దామంటావు, అది చెప్పు. ఇలాగే పోట్లాడుకుందామా, అసలు విషయం ఆలోచిద్దామా?'' చిరాగ్గా అన్నాడు వెంకటేశం.

"ఇల్లు వెతుక్కోవాలి కదా నాన్నా, ఖాళీ చేయాలనుకోగానే మాటలా'' అంది అరుణ.

"అమ్మో... ఆ సంగతి అడగొద్దు. అంతకన్నా ఓచోట కూచుని తపస్సు చేసుకుంటే, ఎవడో ఓ దేవుడైనా పుట్టుకొస్తాడు'' అన్నాడు గౌరీశం.

"మారడమెందుకు నాన్నా, మూడొందల యాభై కాదుగదా. నాలుగొందలు పెట్టినా మన వాటాఅంతరాదు. పైగా గౌరీశం వాటా మనకు కలిసొస్తుంది కదా'' అంది విజయ.

"మరేం చేద్దామే'' నీరసంగా అడిగింది జగదాంబ.

"విజయ మాటకూడా నిజమండీ. నాస్వార్థంకొద్దీ చెబుతున్నాననుకోవద్దు...'' గౌరీశం అంటుండగా,

"అంతే మరి, చేయటానికేముంది, పెంచటమే. సంపాదించినదంతా వీళ్లకు పోయటమే'' నిట్టూర్చాడు వెంకటేశం లేస్తూ.

"ఇలా అడిగినప్పుడల్లా పెంచితే అలుసైపోమటే''జగదాంబ కూతుళ్లను ప్రశ్నించింది.

"మనకు గత్యంతరంలేనప్పుడు ఏం చేస్తాం అమ్మా. ఐనా దాదాపు మూడేళ్ళయింది- మనం పెంచి'' సర్ది చెప్పింది అరుణ. జగదాంబ కూడా వెళ్లిపోయింది.




"మూడేళ్లా, అమ్మో, ఈ లెక్కన మన ఇంటా యనసలు గొప్ప ధర్మాత్ముడన్నమాట"

"ఆయన సంగతి సరే... నువ్వొచ్చి ఏడాది దాటింది. నీ మాటేమిటి?" తల్లి వెళ్లిపోతుండగా అడిగింది విజయ.

"నాదో పదిహేనేసుకో. నాకు అరవై అవుతుంది. మీకు అరవై పెరుగుతుంది" నీరసం నటిస్తూ అన్నాడు గౌరీశం.

"ఏమిటి, అబ్బాయిగారి గుర్రం పరుగు మీదుంది" అంది అరుణ నవ్వుతూ.

"ఏముందే, పత్రికలవాళ్లు, పారితోషికం పెంచేశారులే" అందించింది విజయ.

"సరేలే... అదొక్కటే సంతోషం. మిగతావాళ్ల సంగతేమిటి?"

"ఎప్పుడో ఒకప్పుడు, ఎంతో కొంత పంపుతూనే వున్నారు కదా. ఇంకా ఏడుపెందుకూ?" అంది అరుణ.

"అమ్మా, తల్లీ, మీకో నమస్కారం. అన్నం వండుకునే పని కూడా ఒకటుంది. ఐనా నేను అద్దె పెంచింది ఎందుకో తెలుసా. కాఫీలు, టీల రూపంలో నాకు ముడుతూనే వుంది కదా" లేస్తూ అన్నాడు గౌరీశం.

మరుసటినెలలో అద్దె పెంచటంతో, ఇల్లుగలాయన నోరుమూసుకుని, పర్సు జాగ్రత్తగా చూసుకుని బైటపడ్డాడు. ఇహ సన్యాసుల్లో కలవటం మంచిదనుకున్నాడు వెంకటేశం- గుమ్మంతలుపు మూసుకుని, పడకమీదవాలి, కళ్ళు మూసుకుంటూ.




"విజయా... విజయా" హడావిడిగా వచ్చాడు మనోహర్.

"ఏమైంది- పిచ్చికుక్కేమైనా వెంటబడిందా" నవ్వుతూ బైటకొచ్చింది విజయ.

"నేన్నీకిచ్చిన లాటరీటికెట్టిలా ఇవ్వు. నీ డబ్బులు నీకిస్తాగానీ" అన్నాడు.

లోపలికెళ్లి, అరుణనడిగి, ఆ టికెట్‌మాత్రం తెచ్చింది విజయ. అరుణకూడా హాల్లోకొచ్చింది.

"రూపాయియ్యి... టికెట్టిస్తాను" అంది విజయ, నవ్వు దాచుకుంటూ.

"మరోటేమైందీ" అన్నాడు మనోహర్, డబ్బులిచ్చి, టికెట్ తీసుకుంటూ. మనోహరిచ్చిన రూపాయి అరుణకిస్తూ చెప్పింది విజయ—

"పోయింది"

"ఎందుకు... ఏమైంది?" ఏమీ అర్థంకాక అడిగింది అరుణ.

"అయ్యో... ఇదికాదు. నా రూపాయి నాకియ్యి" అన్నాడు మనోహర్, టికెట్ పరిశీలించి చూసి.

"ఇవ్వను. నువ్వే కావాలని కొనుక్కున్నావు గదా" నవ్వు బిగబట్టుకుంటూ అంది విజయ.

"పోనీ మరో టికెట్‌కూడా ఇయ్యి"

"ఇవ్వను"

"అన్యాయం" కసిగా అరిచాడు మనోహర్.

"ఏది స్వామీ, అన్యాయం?" వెక్కిరించింది విజయ.

"ఆ టిక్కెట్‌కు ప్రైజొచ్చింది"

"ప్రైజా...ఎంత?" అరిచింది అరుణ.

"వందేలేవే"

"అంటే, నీకు ముందే తెలుసన్నమాట. పైగా ఈ దిక్కుమాలిన టికెట్ నాకు అంటగడతావా" ఉడుక్కున్నాడు మనోహర్. తను విజయను ఏడిపిద్దామనుకుంటే, తనకే రివర్సయింది.

"తెలిసీ విడిపించలేదెందుకే" అంది అరుణ, నిరుత్సాహంగా.

"ఎక్కడ- రిజల్ట్స్ చూసిందే పొద్దున. పైగా మనకైతే ఐదురూపాయలు కట్‌చేసుకుని ఇస్తా

రు. ఇదిగో, ఈ మహానుభావునికి ఏ తలకుమా సినవాడో తెలిసుంటాడుగదా, కమీషన్ తీసుకో కుండా ఇచ్చేవాడు. అందుకే ఆగాను'' లోపలి కెళ్లి తన టికెట్ పట్టుకొచ్చింది విజయ.

''దీని డ్రా డేట్ దాటి ముణ్ణెల్లయింది, పోపులడబ్బాలో దాచుకో'' ఉడుకుమోత్తనంతో అన్నాడు మనోహర్.

''చాల్లే... రిజల్టొచ్చిందే ఇవ్వాళ. టికెట్స్ అమ్ముడుపోలేదని డ్రా డేట్ వాయిదావేశార్లే. గంటసేపట్లో తెచ్చియ్యాలి. నాకు డబ్బులవసరముంది''

''నాకేం పన్లేదా- ఐదురూపాయలు నా కమీషన్‌పోను, మిగతాది ఫస్టుకిస్తాను. అసలు నాక్కూడా డబ్బులవసరముంది'' అన్నాడు మనోహర్ బైటకు నడుస్తూ.

''ఇదిగో, చెల్లెళ్లనేడిపిస్తే ఆ తరువాత ఆడ గాడిదకూడా దొరకదు, పెళ్లి చేసుకోవటానికి'' అరిచింది విజయ.

''పిల్లి శాపాలకు ఉట్లు తెగుతాయనుకుంటున్నావా?'' వెక్కిరిస్తూ వెళ్లిపోయాడు.

గంటసేపటికల్లా ఒక పెద్ద స్వీట్స్‌పాకెట్, మరో చిన్నపాకెట్ తీసుకునొచ్చాడు మనోహర్. తొంభైరూపాయలు విజయ చేతిలో పెట్టాడు.

''ఇంత తొందరగా నీకు డబ్బులెవడిచ్చాడు'' అంది విజయ లెక్కపెట్టుకుంటూ.

''ఎవరైతే నీకెందుకు?'' అన్నాడు మనోహర్, తను తెచ్చిన పాకెట్ విప్పుతూ. లాటరీటికెట్ విడిపించకుండా, తన జేబులో డబ్బులే ఇచ్చినసంగతి చెప్పలేదు.

''ఇదేమిటి... పదిరూపాయలు కమీషనా. సిగ్గులేదు నీకు'' అంటూ, ''అవేమిటి?'' అంది, మనోహర్ టేబుల్‌మీద పెట్టిన వస్తువులు చూస్తూ.

స్టాండ్‌వున్న డీలక్స్ అద్దం, ఫాన్సీప్రైప్ దువ్వెన.

''ఇవి కొనుక్కోవాలని నీకు చాలా సరదా అని నాకు తెలుసు. నేను కొనిస్తే తీసుకోవు. నువ్వేటూ కొనుక్కోవూ- పిసినారి మొహానివి. అందుకని తెగించి నీ డబ్బుల్లోంచే తెచ్చాను

ఎంత తిడతావో అనుకున్నాను'' అన్నాడు, నవ్వి ఊర్కున్న విజయను చూసి.

''తిట్టాల్సిందే, ఈసారికి వదిలేస్తున్నాను'' అంది విజయ.

ఇంతలో అరుణొచ్చింది. మనోహర్ తెచ్చిన అద్దం, దువ్వెనా చూసి మెచ్చుకుంది.

''ఇంతకూ ఆ డబ్బులేం చేస్తావు విజయా?'' అడిగాడు మనోహర్.

''మరో తొమ్మిది అద్దాలూ, దువెన్లూ కొనుక్కుంటాను''

''ఛ... అదేంటే పాపం. అసలు నువు కొనుక్కుంటే పాతికరూపాయలైనా అవుతాయి బైట–'' అంది అరుణ.

''అదేకదా నాకోపం. ఏదో గోల్‌మాల్ చేశాడు''

''లేదు లేదు. మా ఫ్రెండ్‌షాప్‌లో తెచ్చాను. ఒట్టు విజయా'' చిన్నపిల్లాడిలా అన్నాడు మనోహర్.

''అవునుగానీ... అదేమిటి?'' అంది విజయ, స్వీట్స్ పాకెట్ చూపిస్తూ.

''స్వీట్స్''

''తెలుస్తూనేవుంది. అవే ఫ్రెండు ఫ్రీగా ఇచ్చాడు?'' కోపంగా అంది.

''ఫ్రీగానే... సరేలే... డెబ్భైరూపాయలుపోసి కొన్నాను''

''ఏం రోగం''

''చెప్పుకో చూద్దాం''

''మెడిసిన్ చదువుతున్నది నువ్వా, నేనా? ఇంతకూ ఏమిటి సంగతి?''

''సరే... ఇంకోరకంగా చెబుతాను. నీకు శ్రీను ఎలాగో, నాకు నువ్వలాగ'' మరో పొడుపుకథ వేశాడు మనోహర్.

అప్పుడర్థమైంది అరుణకూ, విజయకూ. ఎన్ని ఖర్చులున్నా, శ్రీను పుట్టినరోజున తన డబ్బులు పెట్టి, స్వీట్స్‌తెస్తుంది విజయ. అలాగే ప్రతియేటా విజయ పుట్టినరోజున గుర్తుపెట్టుకుని స్వీట్స్ తెస్తాడు మనోహర్. తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకవటంమూలాన తోబుట్టువులే లేనందున చెల్లిలా కనిపించే విజయంటే చాలా అభిమానం మనోహర్‌కు.

''అరే... ఇవాళ డేట్ ఎంత? నేను మరిచేపో




యాను'' అంటూ, చెల్లెలి రెండు బుగ్గలూ పట్టుకుని, ''హేపీ బర్త్‌డే టూయూ'' అని చెప్పింది అరుణ.

''హేపీ బర్త్‌డే టూ విజయా'' ఎలుగెత్తి అరిచాడు మనోహర్.

ఆ అరుపుకి వంటింట్లోంచి పరుగెత్తుకొచ్చింది జగదాంబ. విషయం తెలుసుకుని, ''ఎంత గుర్తుపెట్టుకుంటావయ్యా నువ్వు'' అంది, మనోహర్‌ని మెచ్చుకోలుగా.

''ఇంతకూ శ్రీనేడి?'' అడిగాడు మనోహర్.

''ఆ రచయిత గదిలో కూర్చుని, మెదడు తొలిచేస్తూ వుంటాడు'' అంటూ వెళ్ళింది అరుణ.

ఓ స్వీట్ తీసి, విజయ నోటినిండా కుక్కాడు మనోహర్. విషయం విని గౌరీశం కూడా వచ్చాడు–

''నీ బర్త్‌డేనా ఇవ్వాళ. నాకు తెలీదు విజయా'' అంటూ.

అరుణ అందరికీ స్వీట్స్ సర్దింది. జగదాంబ లోపలికెళ్ళి, మళ్ళీ వచ్చి, టీకోసం పాలుతెమ్మని శ్రీనుని పంపించింది.

''ఇంత హఠాత్తుగా పుట్టావేంటి, ప్రజెంటేషన్ ఇవ్వడానికి వీల్లేకుండా'' అన్నాడు గౌరీశం.

''ఫర్లేదు... రేపు తెచ్చియ్యి అదేదో'' అంది అరుణ.

''అలా బావుండదు. పోనీ ఆశువుగా ఓ కవిత అల్లి, సమర్పించనా'' అన్నాడు గౌరీశం, గొంతు సవరించుకుంటూ.

''బాబోయ్...''

సరదాగా గడిచిపోయింది మరో గంటదాకా. నారాయణ రాగానే కాసేపు కూచుని బైటపడ్డాడు మనోహర్.

ఆ ఇంట్లో ఒక్కోమనిషీ అతనికి విచిత్రంగా కనిపిస్తారు. ఆలోచించనారంభించాడు. వెంకటేశం చీమలాంటివాడు. పాపం, బతుకంతా కష్టపడటమే. జగదాంబ గంగిగోవులాంటిది. కష్టాలన్నీ భరించటమే కాని విసుక్కోవటం తెలియదు. నారాయణ గురించి తనకు అంతగా తెలియదు, తెలిసినంతవరకూ తేనెటీగలాంటివాడు. తన కష్టమంతా అనుభవించకుండా తనవాళ్ళకు ధారపోస్తాడు. అరుణ సీతాకోకచిలుక. అలవోకగా, అందంగా సాగిపోవటమే కానీ చేసేదేమిటో తెలియదు. సుధాకర్, వాడు ఎలకలాంటివాడు. బొక్కటమే కానీ కూడబెట్టడం తెలియదు. ఇక విజయ... అవును- విజయ... విజయ కోకిలమ్మ... ఆ కడగండ్ల కాకిగూట్లో వుండాల్సింది కాదు. శ్రీనివాస్ ఇంకా కోశం చీల్చుకోలేదు. వాడేం అవుతాడో, కోశం లోపల ఎలా పెరుగుతున్నాడో.

పాపం ఎలావున్నా, ఏమైనా వాళ్ళందరికీ కష్టాలు గాలి పీల్చటంలాగా అలవాటయ్యాయి. తను ఏదైనా చిన్న సహాయం చేయబోయినా స్వీకరించరు. తన రికార్డ్‌బుక్, తన స్నేహితుల రికార్డ్ బుక్కుల్లో ఫిగర్స్ గీయించటం ద్వారా ఒక చిన్న సహాయం మాత్రం చేయగలుగుతున్నాడు. నెల నెలా అలవాటైన సంపాదన, హఠాత్తుగా ఆగిపోతే, ఏ చిన్న అవసరానికో మళ్ళీ తడుముకుంటారనే ఉద్దేశంతో ఎప్పుడైనా ఏవీ లేనప్పుడు, అక్కడ లేని చెత్త ఫిగర్స్‌కూడా గీయమని ఇచ్చి ఆదుకుంటుంటాడు. అది మాత్రం విజయ కనిపెట్టలేకపోయింది. ఐనా, ఒక మనిషి ఎంతని, ఎంతకాలమని ఒక కుటుంబానికి సహాయం చేయగలుగుతాడు? వాళ్ళ కష్టాలకూ, సమస్యలకూ ఒక శాశ్వత పరిష్కారం దొరకాలేకానీ...

★ ★ ★

గౌరీశం రాసిన ఒక నవల ఓ పత్రిక అనుబంధ నవలగా వచ్చింది. అతనికి చెప్పుకోవడానికి మాత్రం ఎవరున్నారు... పత్రిక కాపీ తెచ్చి అరుణకూ, విజయకూ చెప్పి అందించాడు.

''ప్రఖ్యాత నవలా రచయిత గౌరీశం అయిపోయావన్నమాట'' అంది అరుణ.

''ప్రఖ్యాత కాదు, అజ్ఞాతే. ఇదికూడా ఏదో కలం పేరుతో ఏడిచాడు కదా'' అంది విజయ.

''అవునూ... నీ అసలు పేరు ఎప్పుడూ రాసుకోవెందుకు?'' అరుణ అడిగింది.

అందుకు విజయ సమాధానం చెప్పింది–

''ఎందుకేమిటి? అబ్బో... ఆ తలకాయలో తెలివితేటలు తక్కువున్నాయా. అసలు పేరు చూస్తే, వాళ్ళ అమ్మానాన్నలు పత్రికాఫీసుకు

పరిగెత్తుకొస్తారని తెలీదూ"

"అంతేనా రచయితగారూ- కనీసం అర్జెంటుగా ఓ ఫొటో అయినా దిగి మీ ఇంటికి పంపించండి" మరింత ఉడికించింది అరుణ.

"ఫొటో ఎందుకే?" ప్రశ్నించింది విజయ.

"ఎందుకేమిటి నాయనా, ఎక్కడున్నా తిరిగి రాగలవు– అని పేపర్లో ప్రకటించడానికి. పాపం, పారిపోయొచ్చిన హడావిడిలో ఫొటో సంగతి మర్చిపోయుంటాడు"

వాళ్ళు మాట్లాడుతున్నంతసేపూ నిశ్శబ్దంగా వింటూ కూర్చున్నాడు గౌరీశం.

అంతలో నవలను అటూ ఇటూ తిరగేసి,

"అంకితమా, ఇదేమిటి" అంటూ, పైకి చదివింది అరుణ–

"అంకితం– ప్రతి మగవాడి విజయం వెనుకా ఒక స్త్రీ వుంటుందన్న మాటను నిజంచేస్తూ, ఈ కథలోని నాయికలాగా నా విజయానికి ప్రేరణనిచ్చిన నేస్తం– అందంకన్నా తెలివితేటలూ, ఆప్యాయతను మించిన స్థిరచిత్తంతో నన్ను ఆకట్టుకున్న నెచ్చెలి– నా హృదయాన్ని దోచుకున్న ఓ అమ్మాయికి– భాబోయ్... ఎవరీ అమ్మాయి, మాకు తెలీదే"

ఆ మాటకు నవ్వుతూ బదులిచ్చాడు గౌరీశం–

"అది నిజంకాదు, ట్రిక్ అన్నమాట. ప్రేమ కథ కదా. అలాంటి అంకితం చూస్తే పాఠకులకు నా పేరు మరింతగా గుర్తుంటుంది- అదీ సంగతి"

"అమ్మో... రచనల్లో రాజకీయాలు మొదలెట్టావా బాబూ? అయితే నువ్విక బాగుపడిపోతావన్నమాటే" అంది విజయ.

గౌరీశం వెళ్ళిపోయిన తరువాత, అరుణ నవలని చదువుతూ కూర్చుంది.

మామూలు ప్రేమకథే. కాకపోతే, హీరో ఒక రచయిత. అతను ఎంత ప్రయత్నించినా వృద్ధిలోకి రాలేకపోతుంటాడు. అంతలో అతనికి ఒక తెలివైన అమ్మాయి తారసపడుతుంది. అతనిలో ప్రవేశిస్తున్న నైరాశ్యాన్ని తొలగించి, క్షీణిస్తున్న మనోబలాన్నిస్తుంది. ఆమె రాకతో అతనిలో నూతనోత్సాహం నిండుతుంది. త్వరలోనే అతను గొప్ప రచయితైపోతాడు. అయితే, చివర్లో హీరోయిన్ చచ్చిపోతుంది. ఆ సెంటిమెంట్‌లోనే గొప్ప పట్టు వున్నట్లనిపించింది అరుణకు. అదీకాక హీరో రచయిత గనుక సన్నివేశాల్లో నవ్యత కనిపించింది. పైగా చిన్న నవల గనుక బోర్ అనిపించకుండా, కథనం బిగువుగా అనిపించింది.

మరునాడు సాయంత్రం, విజయ కాలేజీ నుండి వచ్చేసరికి వంటింట్లో ఓ మూల కనిపించింది గౌరీశం నవల. తీసి పక్కనపెట్టి, ముఖం కడుక్కుని, అది తీసుకుని, గౌరీశంకు ఇవ్వటానికి వెళ్ళింది. సిగరెట్ దమ్ము లోపలిదాకా పీల్చి వదులుతూ, దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నవాడల్లా, విజయను చూడగానే సిగరెట్ పడేశాడు. గుండెలనిండా వున్న పొగని ఆపటానికి ప్రయత్నంచేయటంతో అది తన్నుకొచ్చి ఉక్కిరిబిక్కిరి చేసింది. పొలమారింది. చప్పున కుండలోంచి నీళ్ళుముంచి అందించింది.

"అడుసుతొక్కనేల, కాలు కడుగనేల- అన్నట్టు, ఎందుకీ కష్టాలు" అంది విజయ.

నీళ్ళు తాగేసి, తలపైన అరచేత్తో కొట్టుకుంటూ కూర్చున్నాడు.

"నీసంగతి తెలిసి, సాధారణంగా నేను రాను. పాపం నీ నవల వంటింట్లో మూలన పడుంటే ఇద్దామని, అన్యమనస్కంగా చప్పునొచ్చేశాను" మళ్ళీ చెప్పింది.

"ఫర్వాలేదు" దగ్గుతూ అంటూ, పుస్తకం తీసుకొని, పక్కన పెట్టుకుని, అడిగాడు- "చదివావా, ఎలావుంది?"

"నేనా, "చదవలేదు. తర్వాతెప్పుడైనా చదువుతాన్లే"

"ఏం పెరటి రచయిత నవలలకు పనికిరాడా" నవ్వుతూ అన్నాడు.

"అదేంకాదులే బలవంతంగా చదివించేట్టున్నావే" తను కూడా నవ్వుతూ అంది.

"అరుణ లేదా ఇంట్లో"?

"లేదు షికారుకు వెళ్ళినట్టుంది"

"మీ అమ్మేం చేస్తుంది?"

"వంట చేస్తూంది, ఎందుకు?"




"అబ్బే ఊరికినే అడిగాను" అంటూ, ఏదో ఆలోచిస్తూ కూచున్నాడు. ఒనిమిషం గడిచిపోయింది.

"నేనిక వెళతాను, బోల్డు పనులున్నాయి" అంది విజయ లేవబోతూ.

"కాస్సేపు కూర్చోరాదూ, నీతో ఒసంగతి మాట్లాడాలి" గొణుక్కుంటున్నట్టుగా అన్నాడు.

"ఏమిటి... అంత ముఖ్యమైన సంగతి" అంది కూచుంటూ.

కాస్సేపాగి అన్నాడు గౌరీశం-

"ఒక విషయం చెబుతాను, నువ్వేమీ అనుకోనంటే..."

ఏమీ మాట్లాడకుండా, చెప్పమన్నట్టుగా చూసింది విజయ.

మళ్ళీ కాస్సేపు ఆలోచిస్తున్నట్టుగా కూచుని చెప్పాడు-

"అదే... ఈనవల అంకితం విషయం, అరుణ ముందు చెప్పినట్టుగా పాఠకుల్ని ఆకట్టుకోవటానికి వేసిన ట్రిక్ కాదు, నిజమే"

సూర్యుడు పూర్తిగా కుంగిపోయాడు. అంతటా అలుముకుంటున్న చీకట్లు ఆ గదిలో మరింత దట్టంగా అలుముకున్నాయి. గదిలో ఇద్దరూ ఒకరికొకరు అస్పష్టంగా కనిపిస్తున్నారు.

"నామనసులోని ఆ అమ్మాయి నువ్వే" చెప్పేశాడు గౌరీశం.

తలకొద్దిగా వంచి, కళ్ళు పైకెత్తి, విజయ వంకచూస్తూనే చెప్పాడు గౌరీశం. కానీ విజయ ఎలా ప్రతిస్పందించిందో తెలుసుకోవటానికి, ఆమె ముఖంలో కదలాడిన భావాలు స్పష్టంగా కనిపించలేదు గౌరీశంకు. లేచి, స్విచ్ వేసి వచ్చి కూర్చున్నాడు.

"నిజానికి ఈనవల రాసింది నీగురించే. చివరి మలుపొక్కటిమాత్రం కథకోసం రాశాను"

అరక్షణం ఆగి, విజయ వంక చూశాడు. అప్పటికీ విజయ ఏమీ మాట్లాడకపోవటంతో మళ్ళీ తనే అన్నాడు-

"అసలు నువ్వీనవల చదువుతావనుకున్నాను. చదివితే నీమీద నాకున్న గౌరవం తెలిసేది... మాట్లాడు విజయ, నేనిలా ఆలోచించటం పొరపాటా?"

అప్పుడు మాట్లాడింది విజయ-

"దీనికి పర్యవసానం ఏమవుతుంది?"

హాయిగా నిట్టూర్చి చెప్పాడు-

"నువ్వొప్పుకుంటే పెళ్ళి"

"ఇప్పుడు నా వయసెంతో తెలుసా నీకు?"

"పదిహేడేళ్ళనుకుంటాను..."

"ఇది పెళ్ళి గురించి ఆలోచించాల్సిన వయసేనా?" సౌమ్యంగా అడిగింది.

"అంటే నాఉద్దేశం..." ఏదో చెప్పబోయిన గౌరీశంను మధ్యలోనే ఆపేసింది విజయ.

"నువ్వన్నది నాకర్థమయింది. కాస్త నేను చెప్పేది కూడా విను. అసలు ప్రేమించుకోవడం అంటే ఏమిటి? ఒకర్నొకరు అర్థం చేసుకోవడం. అది ఎప్పుడు జరుగుతుంది... ఆ అవసరం, వయసూ, పరిస్థితులూ వచ్చినప్పుడు. అంతేకదా. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు, నేను నిన్ను ప్రేమించాలి. ఆ తర్వాతేం చేయాలి... అంచేత అలాకాదు. మా ఇంటి పరిస్థితులు నీకు తెలుసు. నీ పరిస్థితులు నాకు కొంత తెలిసినా అంతగా తెలియదు. అదీకాక ఈ ప్రేమించుకోవడం- అన్న దాంట్లో పడి, ఇద్దరూ ఒకరికొకరు అబద్ధాలు చెప్పుకుంటూ, ఒకర్నొకరు వంచించుకుంటూ, ఆత్మద్రోహం, పరద్రోహం చేస్తూ, సినిమాలు చూస్తూ, పార్కుల్లో కబుర్లు చెప్పుకుంటూ, తీరా పెళ్ళయిన తరువాత కూరలో కరివేపాకు వేయాలా, వద్దా అనే దగ్గర పోట్లాడుకుంటారు..."

"...నువ్వు మరీ ముసలాళ్ళలా చెబుతున్నావు"

"మరి నేనిలా అంటానని నీకు ముందే తెలిసుండాలే. అలాంటప్పుడు నన్ను ఏంతెలుసుకుని ప్రేమించావు చెప్పు" నవ్వుతూనే అంది విజయ.

"అంటే ఎదుటి వాళ్ళు కరివేపాకు తింటారా, కందిపప్పు తింటారా, కోడికూర తింటారా అని అడిగి మరీ ప్రేమించాలా?"

"అలా అన్నానా నేను?"

"అంతే కదా నువ్వన్నది?"

"ఏమనమంటావు మరి?"

"నేనంటే నీకు ఇష్టమా, కాదా చెప్పు"

"ఇష్టం అంటే, ఇంత వరకూ నిన్నెప్పుడూ ఆ దృష్టితో చూళ్ళేదు. అసలు... అదికాదు.. ఒకమాట చెబుతాను విను. నువు జీవితంలో ఇంకా స్థిరపడలేదు. ముందు అందుకు ప్రయత్నాలు చెయ్యి. ఇప్పుడే ఈ గోలెందుకు?"

"అంతా అయిపోయేసరికి నువ్వింకెవర్నైనా ప్రే... నువ్వు పెళ్ళిచేసుకుంటే..."

"అంటే...ఏమిటిది నవలకు హామీపత్రంలాగానా?" నవ్వుతూ అంది విజయ.

ఎంత వాదించినా విజయ తన మాటను ఖండించనందుకు సంతోషంగా అనిపించింది అతనికి.

"విజయా... ఎంతో సున్నితమైన విషయాన్ని నువ్వేదో బిజినెస్‌లా మాట్లాడుతున్నావు..."

హఠాత్తుగా తన గొంతులో మరింత మార్దవాన్ని తెచ్చుకుని, అంది విజయ-

"సున్నితమైన విషయాన్ని సున్నితంగానే వుండనియ్యి. వాదనలెందుకు. నేను ఎవర్నీ ప్రేమించను. నాకంత తీరికలేదు. మా అమ్మానాన్నలు నాపెళ్ళి విషయం ఆలోచించినప్పుడు మాట్లాడు"

విజయ కుడి చెయ్యిని తనరెండు చేతుల్తో పట్టుకుని, "థాంక్స్, విజయా" అన్నాడు గౌరీశం.

చప్పున చెయ్యి వెనక్కి లాక్కుంది విజయ. "ఇదిగో ఈ సినిమాల వేషాలు, నవలల వేషాలు పనికిరావు. ఇక ఈ విషయం వదిలెయ్యి. మళ్ళీ ఎప్పుడూ ఈ ప్రసక్తి తేవద్దు" అంటూ ఒక క్షణంపాటు ఆలోచించి అంది... "గౌరీశం, ఇది చాలా చిన్నవిషయం, నిజానికి. పెళ్ళి జీవితంలో ఒక భాగమే, కాని ఎప్పుడు. ఆ జీవితానికి అన్నీ పరిపూర్ణంగా సమకూరినప్పుడు. మనకు ఎన్నో సమస్యలున్నాయి, చేయవలసిన పనులెన్నో వున్నాయి. అసలు జీవితాన్ని తీర్చిదిద్దుకోవలసిన వయసు ఇదే. ఒక మనిషి తన ముందు జీవితంలో ఎదురయ్యే పరిస్థితుల్ని ఎదుర్కొన వ్యక్తిత్వం సంతరించుకునేదిప్పుడే. ఇవన్నీ వదిలేసి, నాటకానికి రిహార్సల్స్‌లాగా పెళ్ళిముందు ప్రేమకబుర్లు చెప్పుకుంటూ కూర్చోటం తెలివితక్కువ వాళ్లు చేసేపని. అంతేకానీ ఫలానా అమ్మాయో, అబ్బాయో లేకపోతే ఇక జీవితమే లేదనుకుని కూర్చునేవాళ్ళు వ్యక్తిత్వంలేని వాళ్ళు"

"లేదు విజయా... ఎందుకో ఈ పోరాటంలో అలసిపోతున్నానేమో అనిపిస్తోంది. ముఖ్యంగా... ముఖ్యంగా, ఒంటరితనం, నాఆలోచనలు పంచుకోవటానికి ఒక్కదగ్గరి మనిషికూడా లేకపోవడం, బహుశా, అందుకేనేమో, ఇంత తొందరపడి, నీకీమాట చెప్పాను"

"అదే అయితే, నేను ఇంతకాలమూ నీవెంటవున్నాను కదా. అందుకు ఈ చచ్చుపుచ్చు కబుర్లన్నీ ఎందుకు? ఇక ఇవన్నీ వదిలేసి, నీపనిలోపడు. తోటిమనిషికి మనిషిగా తోడుండటానికి ఈ రకం ప్రేమ ఒక్కటే వుండనవసరంలేదు, మనం మనుషులమన్న స్పృహ వుంటే చాలు" అంటూ లేచి నిలబడింది విజయ.

తన నవల తీసి, విజయ చేతిలో పెట్టాడు గౌరీశం. మారుమాట్లాడకుండా అది తీసుకుని, ఇంట్లోకి నడిచింది విజయ.

★ ★ ★

నెలజీతం తీసుకుని వస్తూ వస్తూ, ఒక పెద్దసైజు పాకెట్‌లాంటిది తెచ్చాడు వెంకటేశం. అది ఓ దుప్పటి. దాన్ని చూడగానే ఎగిరిగంతేశాడు శ్రీను.

"నాన్నా... ఈ కొత్తదుప్పటి మాత్రం నాకే నాన్నా లేపోతే నేనూరుకోను"

"నీకేరా... నీబాధపడలేకనే, మా మిల్లు ముందర అమ్ముతుంటే తీసుకున్నాను, పదిహేనురూపాయలే అనేసరికి"

"పదిహేనురూపాయలా" అంటూ అరుణ చేతిలోకి తీసుకుని పరీక్ష చేసి చూసి, చెప్పింది-- "డూప్లికేట్ నాన్నా ఇది. ఉతికితే షింకైపోతుంది"

వారంరోజులు, చలిలేకపోయినా సంతోషంగా కప్పుకున్నాడు శ్రీను ఆ దుప్పటిని. నీళ్ళలో ముంచగానే, అరుణ చెప్పినట్టే కుదించుకుపోయింది.అది చూసి శ్రీను

ఏడుపు మొహంపెట్టాడు.

"కావాలంటే, నాదుప్పటి తీసుకోరా" సము దాయించింది విజయ.

"ఏమొద్దు, నాకా పాతదుప్పటి వద్దు" అలక మొహం పెట్టాడు.

చివరకు... ఆ తడి దుప్పటిని తీసుకొచ్చి, శ్రీనుపక్కన నిలువుగా పెట్టి కొలిచిచూసింది అరుణ. శ్రీనుకంటే ఓ అడుగు పొడవుగానే వుందది. దాంతో అలకమాని, సంతోషించాడు శ్రీను.

"సాయంత్రం మిషన్‌పనిపెట్టుకున్నప్పుడు, దాని అంచులుకుట్టవే అరుణా, పోగులూడిపోతున్నాయి" అంది జగదాంబ.

మళ్ళీ గయ్యిన లేచాడు శ్రీను--

"ఇదిగో... ఎవరైనా దాన్ని ముట్టుకున్నారంటే నేను అన్నంతిననంతే"

"అదేమిట్రా... అంచులు కుట్టకపోతే పాడైపోతుంది"

"అదికాదమ్మా... పొడవు తగ్గిపోతుందని వాడి భయం. పోనీ ఉండనీలేవే. ఈసారి చలికాలం వచ్చేసరికి ఎలాగోలా వీడికో బ్లాంకెట్ కొంటే వీడిగోల పోతుంది" నవ్వుతూ అంది విజయ.

ఇక తన దుప్పటికేం ఢోకాలేదని తెలుసుకుని, ధీమాగా వెళ్ళిపోయాడు శ్రీను.

"అరుణ కాస్త పనిలో పడిందండీ. విజయ కట్‌చేసిస్తే, వాళ్ళవీ, వీళ్ళవీ ఓ పదివరకూ జాకెట్లు కుట్టిందీ నెలలో" భర్తకు భోజనం వడ్డిస్తూ చెప్పింది జగదాంబ.

"సరే... భగవంతుడు దానికేదో మంచిబుద్ధి పుట్టించాడు. ఏదోనాటికి పూర్తిగా నేర్చుకుంటే, దాని బతుకది బతగ్గలదు" నిట్టూర్చాడు వెంకటేశం.

★ ★ ★

తల్లిదండ్రుల్ని అని లాభంలేదనీ, ఎప్పటికైనా తన బతుకు తాను బ్రతకగలగటం మంచిదనీ అరుణ గ్రహించింది. ఒకరోజు సంపత్ ఉండేనాటక సమాజానికి వెళ్ళింది. అక్కడ రమేష్ ఉన్నాడు.

"రండి... రండి" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

"సంపత్ ఇంట్లో తినిరాలేదని హోటల్‌కెళ్ళాడు. కాసేపట్లో వస్తాడు" అన్నాడు.

కాసేపు పిచ్చాపాటీ కబుర్ల తరువాత, అరుణ తన అభిప్రాయాన్ని సందేహాన్నీ రమేష్ ముందుంచింది--

"మీలో ఇంతగొప్ప ఆర్ట్‌వుందిగ కదా, మరి మీరు సినిమాల్లో చేరడానికి ఎందుకు ప్రయత్నించరు?"

"భేతాళ ప్రశ్నవేశారు" అంటూ కాస్సేపు ఆలోచించాడు--

"ఈ నాటక సమాజం మా గురువుగారు స్థాపించారు. ఆయన మరణించి మూడేళ్ళయింది. నాటకాలపట్ల ఆయనకో నిశ్చితాభిప్రాయం ఉండేది. నాటకాలువేరు, సినిమాలు వేరు. నాటకాన్ని నాటకంలాగే బతకనీయాలి కానీ, దాన్ని సినిమాని చేయాలని చూడకూడదు. అలాగే నాటకాలకు సంబంధించిన కళాకారులు కూడా-- అని చెబుతుండేవారాయన"

"అంటే మీరు అదేమాటను మార్గదర్శకంగా భావించి నాటకాల్లోనే వుండిపోయార్నమాట"

"దానికి సమాధానం చెప్పేముందు మీకో విషయం చెబుతాను- బబ్బన్‌ఖాన్ నాటకం 'అద్రక్ కే పంజే' మీకు తెలిసే వుంటుంది. దాన్ని సినిమాగా తీస్తామని ముందుకొచ్చినవాళ్ళందరికీ ఆయనకూడా దాదాపు ఇలాంటి సమాధానమే చెప్పాడు. కానీ కొందరేమంటార తెలుసా- ఒకసారి సినిమాగాతీసి, కొన్నిరోజులు దేశమంతా నడిచిన తరువాత ఇక ఆ నాటకాన్ని ఎవరు చూస్తారు. అందుకని స్వార్థంకొద్దీ ఆయనొప్పుకోలేదని అంటారు. అది నిజమో కాదో మనకు తెలియదు..."

"అంటే...." అడగబోతున్న అరుణను ఆపి చెప్పాడు రమేష్.

"బైట చెప్పవలసి వస్తే అదే చెబుతాం కానీ నిజానికి మాలో చాలామందికి సినిమాల్లోకి వెళ్ళాలనే వుంటుంది. అయితే మమ్మల్ని రానిచ్చేదెవరు?"

"మీకు తెలిసినవాళ్ళెవరూ లేరా?"

"లేకేం. సినిమా ఫీల్డులో నాకు తెలియని





వాళ్ళెవరూ లేరు. అయితే నేనే వాళ్ళకు తెలియదు"

అరుణ ఆలోచిస్తోంది.

"ఏమిటి- పాతజోక్ అని నవ్వలేదా?"

ఈ మాటకు నవ్వొచ్చింది అరుణకు.

"ఎవరో ఒకర్ని నమ్ముకుని మద్రాసు వెళతాం. ఈ నాటక సమాజంలో నాస్థానం పోతుంది. అక్కడ అవకాశాలు దొరకలేదనుకోండి. మనకు తిండిపెట్టేవారు కూడా వుండరు. సరే... ఏదో ఓ సెంటర్లో కర్చీఫ్ పరుచుకుని, దానిముందు కూచుని ఆతర్వాత రైలెక్కి మనూరు వచ్చేసరికి ఇక్కడా గతి వుండదు"

"మరికొందరు నాటకాలవాళ్ళు సినిమాల్లో పైకొస్తున్నారుకదా?"

"ఇందులో కూడా రెండురకాలవాళ్ళున్నారు. కొందరు నిర్మాతలూ, దర్శకులూ తమ సినిమాల్లో స్థానిక కళాకారులకు అవకాశాలిస్తున్నారు. అలాంటి వాటితో తృప్తిపడి ఊరుకునేవారు కొందరైతే, అలాంటి ఒక్క అవకాశంతో ధైర్యంచేసి సినిమాల్లో స్థిరపడాలనుకునేవాళ్ళు కొందరు. ఒకడు ఒకస్థాయితో సంతృప్తిపడుతున్నానూ- అంటే అబ్బే... వాడు పిరికివాడు అంటారు. ఒకడు పట్టుదలతో, ధైర్యంచేసి ప్రయత్నిస్తున్నానూ అంటే పేరాశ, మొండివాడు అంటారు. అంచేత ఎవరిది కరెక్టని మాత్రం నన్నడగొద్దు. నాకు మాత్రం ఇదే సంతృప్తికరంగా వుంది. ఒక సినిమాలో చిన్న ఛాన్సిచ్చారు.... చేశాను. మళ్ళీ ఎవరైనా ఛాన్సిస్తే చేస్తాను- అంతవరకే"

"మీరు సినిమాలో నటించారా... ఎందులో?"

చెప్పాడు రమేష్.

"ఇంకా రిలీజవలేదులెండి"

"సరే... మీ సంగతి వదిలేద్దాం. నేను మద్రాసు వెళితే సినిమాల్లో వేషాలో, పాటలు పాడే అవకాశాలో దొరకవంటారా?"

"చెప్పానుగదా. దొరకవూ అని ఖచ్చితంగా అనలేను. అలాగే దొరుకుతాయి అని నమ్మకంగానూ చెప్పలేను"

"అదేంటీ..." అంటున్న అరుణ సంపత్ రావటంతో ఆగింది.

సంపత్ కూడా సంభాషణలో చేరాడు.

"నీకెందుకరుణా సినిమాలు? మీవాళ్ళు నాటకంలోకే రానియ్యలేదు నిన్ను"

"ఎందుకంటే ఏం చెప్పాలి? ఉత్సాహముంది, అభిరుచి వుంది, ఆశ కూడా వుంది"

"అవుండగానే సరిపోదు. ముందు మనవాళ్ళుండాలి. తరువాత అదృష్టం వుండాలి"

"అదృష్టం పరీక్షించుకోవాలి కదా"

"అరుణా... ఇదేమైనా లాటరీ టికెట్ అనుకుంటున్నారా! రూపాయి పోతుంది లేదా డబ్బు తగులుతుంది అనుకోవటానికి" అరనిమిషంపాటు ఆగి, ఆలోచించి చెప్పాడు రమేష్- "అవినీతి, విశృంఖలత్వం ప్రతి పరిశ్రమలోనూ, ప్రతిచోటా కనిపిస్తాయి. నిజమే... ఐతే గమ్మత్తేమిటంటే మిగతాచోట్ల అది ఎంత గావున్నా పట్టించుకోని జనం, సినిమా పరిశ్రమకు దాన్ని విపరీతంగా అంటిస్తారు- ఎంత పవిత్రంగా వున్నా"

"ఎలా వుండాలో, ఎలా మసులుకోవాలో నేనాలోచిస్తాను. కానీ మిత్రులుగా మీరు నాకో సహాయం చేస్తారా?"

"ఇలా అడగటం మాత్రం తప్పు"

సన్నగా నవ్వింది అరుణ.

పర్స్‌లోంచి ఓ కాగితం తీసి ఇచ్చింది. అది పేపర్‌కటింగ్. అందుకుని ఇద్దరూ చదివారు. కొత్త ముఖాలు కావాలని, ఒక ప్రఖ్యాత సినిమా కంపెనీవారి ప్రకటన.

సూపర్‌హిట్ సినిమాలు తీయడంతోపాటు కొత్త ప్రక్రియల్ని కొత్త తారల్ని తెరకెక్కించటానికి పేరొందిన సంస్థ అది. అందువల్ల అందులో మోసం వుండటానికి వీల్లేదని అరుణతోపాటు రమేష్, సంపత్‌కూడా ఒప్పుకున్నారు. మూడు ఫొటోలు బ్లాక్ అండ్ వైట్‌వి పంపాలనీ, రెండునెలల తరువాత వివిధ పట్టణాల్లో ఇంటర్వ్యూ వుంటుందనీ వుంది.

"ఫొటోలు పంపించావా?"

"లేదు.... పంపాలి"

"నాక్కూడా పంపాలనే వుంది. వీళ్ళేమో కొత్తముఖాలు కావాలంటున్నారు. మరి నాది పుట్టినప్పట్నించీ ఇదే ముఖం... ఎలాగా?"

రమేష్ మాటలకు నవ్వేసింది అరుణ.

* * *

"ఏమిటీ... నువ్వు ఎవరిదో కథ కాపీ కొట్టావని ఎవరో పేపర్లో వేశారు" అంటూ వచ్చింది అరుణ. ఆ వెనకే విజయ కూడా వచ్చింది. ఈమధ్య గౌరీశం గదిలోకి ఒంటరిగా వెళ్లటం మానేసింది విజయ.

అరుణ మాట వింటూనే టక్కున ఆమె చేతిలోని పత్రిక అందుకుని, ఉత్తరాలకాలంలో గబగబా చదివేశాడు. "మీరు గత సంచికలో ప్రచురించిన- 'సంయుక్త'- అనేకథ అదేపేరుతో ఇంతకుముందు ఫలానా పత్రికలో ప్రచురించారు. రచయిత పేరు గుర్తులేదు కానీ పేరుతోసహా మక్కికి మక్కి కాపీ కొట్టిన..." పత్రిక మూసేసి-

"డామిట్... అది నేను రాసిందే. అందులో పడినట్టు నాకు తెలియదు" అన్నాడు గౌరీశం.

"అదేంటి...?"

"అది రచయితల ఖర్మ. వాళ్లకు నేను పంపింది ఎప్పుడో రెండేళ్లకిందట. రిటర్న్కవర్ కూడా పెట్టాను. ఇన్నాళ్లకూ తిరిగి రాకపోతే ఇప్పుడు వీళ్లకు ఇచ్చాను" వివరించాడు.

"నీకు కాంప్లిమెంటరీ కూడా పంపలేదా?" అడిగింది విజయ.

"కాంప్లిమెంటరీ లేదు, రెమ్యూనరేషన్ లేదు. కనీసం నా కథ ప్రచురిస్తున్నామని ఇంటిమేషన్ కూడా లేదు. మరి నాకెలా తెలుస్తుంది?"

"మరీ ఇవేం బుద్ధులీ పత్రికలవాళ్లకు" అంది అరుణ.

"అదేకదా విచిత్రం. సంస్కారం గురించి సంపాదకీయాలు రాస్తారు. తమ రచన గురించి రచయితకు సకాలంలో ఇన్ఫర్మేషన్ ఇద్దామనే సంస్కారం వుండదు. దోపిడీల గురించీ, కుంభకోణాల గురించీ కూపీలులాగి పత్రికల్లో రాస్తారు. రాసినవాడికో పదిరూపాయలు ఇద్దామనేపాటి ఆలోచన మాత్రంవుండదు. మాది చిన్నపత్రిక కదా అని ఒకరంటే, మేం ఏదో ఒకరోజుకి ఎంతో కొంత పంపిస్తున్నాంకదా అని మరొకరంటారు. లక్షలూ, కోట్లూ సంపాదించుకుంటూనే వందలదగ్గరకొచ్చేసరికి కక్కుర్తి. ఎందుకంటే రచయిత అనే అల్పజీవి ఏమీ చేయలేడుకదా. ఎవడో ఒకడు గట్టిగా, ఇవన్నీ ఇంత వివరంగా అడిగాడనుకో- ఇహ ఆ పత్రికలో వాడి పేరు కనబడదు"

"మరీ ఇంత అన్యాయమా?"

"ఈ అన్యాయమంతా నాలాంటి చిన్న రచయితల వరకే. పెద్ద రచయితలకైతే ముందుగానే అడ్వాన్సులిచ్చి, కాకాపట్టి, వాళ్లు ఎప్పుడెంత రాసిస్తే అంతే తీసుకుని అదే ప్రచురించుకుంటారు"

"అందరూ ఇంతేనంటావా?"

"అందరూ ఇంతే అయితే ఇక నేను ఎప్పుడో ఎందులోనో దూకేవాడిని. ఒకరిద్దరున్నారు కదా మంచివాళ్లు. ఖచ్చితంగా మొదటివారంలో నాకు వచ్చే ఒక చెక్కు సంగతి నీకు తెలునుగదా. మిగతావాళ్ళు కూడా అలావుంటే ఎంత బావుంటుంది" విసుగ్గా, నిస్సహాయంగా అన్నాడు గౌరీశం.

"మరీ కథ సంగతేమిటి?"

"వెళ్లి జరిగిన విషయం చెప్పి, ఏంచేయాలో అడగటమే"

మరుసటివారం గౌరీశం వివరణ ప్రచురించారు-

"ఇది కాపీకొట్టింది కాదు. ఇంతకుముందు మరొకరు ప్రచురించిన సంగతి నా దృష్టికి రాలేదు. దీర్ఘకాలంగా వారి పరిశీలనలో వున్న కథను ఈ పత్రికకు పంపటం జరిగింది. ఇలాంటి పొరపాటు మరొకసారి జరగదని సంపాదకులకూ, పాఠకులకూ హామీ ఇస్తున్నాను"

"ఇలా రాశావేమిటి?" ఆశ్చర్యంగా అడిగింది విజయ.

"ఆయనలాగే రాయమన్నాడు. ఆంధ్రశోభను విమర్శించినట్టు రాయటంవల్ల లాభంలేదు. దీంతో కూడా వాళ్లు చేసిన పొరపాటు పాఠకులకు తెలుస్తుందికదా- అన్నాడాయన. ఒప్పుకోక తప్పలేదు" ఇబ్బందిగా మొహంపెట్టి చెప్పాడు గౌరీశం.

మరింకేమీ ప్రశ్నించకుండా వెళ్లిపోయింది విజయ.

* * *




సుధాకర్ ఉద్యోగానికి రాజీనామాచేసి ఎటోవె ళ్లిపోయాడని తెలిసి బాధపడ్డాడు వెంకటేశం. కానీ తన ఆశలెప్పుడూ సుధాకర్ విషయంలో నిరాశలే అవుతాయని గ్రహించుకుని వూరుకు న్నాడు. నారాయణ జీతం కాస్త పెరగటమూ, ఖాతావాడి అప్పు మామూలు స్థితికి రావట మూ, అరుణ కుట్టుమిషన్‌తో కొద్దోగొప్పో సంపా దించటమూ వెంకటేశంకు కొంతలో కొంత తృప్తినిచ్చాయి.

అల్పసంతోషులకు కలిగే సంతోషమూ అల్పమే. వాళ్లకు సంతోషం కలిగించేది స్వల్ప విషయాలే అని మాత్రమే కాదు– అది నిలి చేది స్వల్పకాలమే అని ఓ కొత్త సిద్ధాంతం పెద్ద రీసెర్చి చెయ్యనవసరం లేకుండా రాసుకో వచ్చు.

పవర్‌కట్. విద్యుచ్ఛక్తిలో కోతరావటంతో ప్ర జలంతా గగ్గోలెత్తిపోయారు. ఇంతకంటే కరెంట్ ఎక్కువ కాల్చుకోవద్దని ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్‌వారు పరిమితులు విధించారు. మధ్యమధ్య పవర్‌సప్లై ఆపుచేయటం కూడా మొదలెట్టారు. ఇవన్నీ కూడా కాదని బిల్లు పెరిగినవారికి ఏకంగా కనెక్షన్లు పీకేస్తామన్నా రు... పీకేశారు. అంతేకాదు, ఫైనులు కూడా వేశారు. ఇవన్నీ చాలవన్నట్టు పరిశ్రమలవాళ్లకి చ్చే కోటాలో కూడా కోతపెట్టారు. విద్యుత్‌కోత కారణంగా ఫాక్టరీలు ఉత్పత్తి తగ్గించాయి. ఫలితంగా జట్లవారీగా విభజించి, కార్మికు లందరికీ వారానికి కనీసం రెండు బలవంతపు సెలవులిచ్చారు.

నెలలో పదిరోజుల జీతం తగ్గటంతో వెంక టేశం కుటుంబవిషయం చెప్పనక్కర్లేకుండా తయారైంది. వచ్చే ఆరొందల్లో రెండొందలు తగ్గేసరికి ఏమీ పాలుపోలేదు.

తీరిపోయిందనుకున్న మిగులు, ఖాతా కొ ట్టువాడి దగ్గర మళ్లీ పెరిగింది. పాలప్యాకెట్ ధర పెరిగింది. న్యూస్‌పేపర్ ధర పెరిగింది. కూరగాయల ధర పెరిగింది. బస్సుఛార్జీల ధర పెరిగింది. అసలుధరంటూ వుండే అన్నిటికీ పెరిగింది.

ఏంచేయాలి... ఎలా తట్టుకోవాలి- ఇదీ వెంకటేశం ఆలోచన.

మరునాడు పాలు ఒక పాకెట్‌మాత్రమే తీసుకోమని భార్యకు చెప్పాడు. పేపర్ వేయి ద్దని కుర్రాడికి చెప్పాడు. పెరట్లోవున్న ఎలక్ట్రిక్ బల్బు పీకేసి పెట్లోపెట్టేశాడు. వంటింట్లోని అరవైకాండిల్స్‌బల్బుస్థానే జీరోది వచ్చింది. మధ్యగదిలో బల్బుకూడా లోపలికిపోయి, పది హేను కాండిల్స్‌బల్బొచ్చింది. విజయ వారించగా ముందుగదిలోమాత్రం తీసేయలే దు. నగంబియ్యం తగ్గి ఆస్థానంలో జొన్నలొ చ్చాయి. ఇన్‌స్టాంట్‌కాఫీ స్థానాన్ని ఫిల్టర్‌కాఫీ ఆక్రమించింది. పంచదారకోటా తగ్గింది. స్నా నపు సబ్బులన్నీ బాండుమారి, పెద్దసైజులో వుండే చౌకసబ్బు వచ్చింది. దానికే షేవింగ్‌పో ర్టుఫోలియోకూడా ఇవ్వబడింది. బ్లాకులో కొనా ల్సిన కిరసనాయిల్‌ను బయటికి తరిమేసి బొగ్గుల్ని ఆహ్వానించారు. చింతపండు వాటారె ట్టింపయింది. కూరగాయల్ని సగానికి తెగ్గోశా రు. కందిపప్పు బదులు మసూరి పప్పులకు ప్లేటు ఫిరాయించారు. మళ్ళీ ఆవయసులో బస్సుమానుకుని సైకిల్ని ఆశ్రయించాడు వెంకటేశం. స్కూలుకు సైకిల్‌మీద వెడుతున్న శ్రీను కాళ్ళకు పనిచెప్పాడు. ఇంటిసైజుని కూడా కుదించాలని చూశారుగానీ, అందువల్ల ప్రయోజనం కనిపించలేదు, అద్దె ఎలాగూ తగ్గదు. అందుకని మానేశారు.

ఒక్కసారిగా వచ్చిన మార్పులకు ఇంట్లోని వాళ్ళంతా దిమ్మెత్తిపోయారు.

"ఎంతకాలమండీ ఇలాగ" అడగలేక అడి గింది జగదాంబ.

"మనం ఏంచేస్తాంచెప్పు?" నిట్టూర్చాడు.

"మీసంఘంవాళ్ళు ఏమంటున్నారు?"

"ఏమంటారు? ఏమీ అనేట్టులేరు. ఏవో విమర్శలూ, అవీ చేస్తూనే వున్నారు పాపం"

"ధరలుచూస్తే అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి అన్నట్టుంది బతుకు. దానికితోడు పని కూడా తగ్గిపోయి, జీతం తగ్గితే ఎలాగండీ బతకటం"

"మనం బతకటం నాయకులక్కావాలి. అందుకని చావకుండా, లేవకుండా-అన్న ట్లుగా ఉంచుతున్నారు. తీరా చద్దామన్నా తప్పేకదా, జైల్లో తోస్తారు. ఓట్లు కావలసినప్పు డు మాత్రం వస్తారు, అతివినయంగా. ఛీ....

ధూర్తపు ముండాకొడుకులు

"ఏమిటి- అమ్మా, నాన్నా ఇద్దరూ రాజకీయాలు మాట్లాడుతున్నారు" అంటూ వచ్చింది విజయ.

"రాజకీయాలు మనకేందుకే. నాన్న మిల్లు ఎప్పుడు బాగుపడుతుందోనని అనుకుంటున్నాం"

"పోన్లే అమ్మా... ఇదీ ఒకందుకు మంచిదే. ఇంతవరకూ సెలవుపెట్టమంటే పెట్టేవాడుకాదు నాన్న. ఈ కరెంటుకోతవుణ్యమాని, కాస్త విశ్రాంతిగానైనా వుంటున్నాడు. అంతా మన మంచికే అనుకోవాలి. జీతం కాస్త తక్కువొస్తే ఏమయిందట"

"ఏం మంచికో ఏమో, మనఖర్మ" నిట్టూర్చాడు వెంకటేశం.

"ఏమిటినాన్నా- నీ నిట్టూర్పులు, ఇప్పుడు మనకేమయింది? అరుణక్కా నేనూ ఎంతలేదన్నా రోజుకో వదిరూపాయలు సంపాదిస్తున్నాంకదా, మిషన్‌మీద. అది ఖర్చులు తగ్గించుకుందో, ఏంచేసిందో మొత్తానికి అంతో ఇంతో ఇంట్లోకి ఇస్తోందికదా, నీతగ్గిన జీతానికి, దానికి సరిపోయింది"

"పెరిగినా, విరిగినా గొర్రెతోక బెత్తెడే అని, ఎంతకాలమో ఈ బండిని లాగటం"

"రిటైరయ్యేదాకా" నవ్వుతూ అంది విజయ.

"సరే... ఇదంతా ఎప్పుడూ వుండేదేగదా...అరుణక్క ఏమంటోందే?"

"ఏవిషయం నాన్నా"

"అదే... ఏం చేయాలని వుందిట దానికి. చదువుకుంటానంటుందా ప్రయివేట్‌గా. ఈ కుట్టుమిషన్‌వ్యవహారం చూస్తే దానికంతగా నచ్చినట్టులేదు"

"ఏమో నాన్నా... దాని పద్ధతి చూస్తే అస్సలే అర్థమవదు. ఇది మనవల్లఅవుతుందా, కాదా అన్న ఆలోచనే వుండదు. ఒకటే ధోరణి"

"ఏమవుతుందట?"

"సినిమాహీరోయిన్" నవ్వింది విజయ.

"దీనికీ పిచ్చి ఇంకా పోలేదన్నమాట. ఎవరికలా రాసిపెట్టివుందో ఎవరు చెప్పగలరు?" నిస్సహాయంగా అన్నాడు వెంకటేశం.

"మాంగల్యం పోయిన ధ్యాసకూడాలేదు దానికి" జగదాంబ వాపోయింది.

"మన అదృష్టంకొద్దీ పెద్దాడొక్కడు బుద్ధిమంతుడు పుట్టబట్టి సరిపోయింది, లేకపోతే వీళ్ళందరి బతుకులూ ఎలావుండేవో"

పెద్దాడంటే గుర్తుకొచ్చింది. వాడి పెళ్ళిగురించి అందరూ అడుగుతున్నారు. ఎలాగైనా ఈయేడు చేసెయ్యాలి"

"వాడేమంటున్నాడు?"

"దీని పెళ్ళయి, చిన్నాడి చదువుపూర్తయితేగానీ చేసుకోడట. ఎదురుచెప్పడన్నమాటేగానీ, మొండితనంలో వాడు ఎవరికి తీసిపోతాడుగనుక. నూరేళ్ళాయుష్షు. మాటల్లోనే వచ్చాడు" లోపలికొస్తున్న కొడుకుని చూస్తూ అంది జగదాంబ.

"ఏమిటమ్మా... తీరిగ్గా మాట్లాడుతున్నారు?" లోపలిగదిలోంచి అడిగాడు, బట్టలు మార్చుకుంటూ.

"నీపెళ్ళిసంగతేరా! నాన్నకూడా అదే అడుగుతున్నారు. అయినవాళ్ళంతా ఎదురుచూస్తున్నారు..."

"అయినవాళ్ళకేంపనమ్మా- ఇప్పుడు అదొక్కటే తక్కువైనట్టు" అంటూ విజయను పిలిచాడు.

నూట యాభైరూపాయలు చేతిలోపెట్టాడు.

"ఎందుకన్నయ్యా?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఎందుకేమిటి? నీమొహం, ఇంట్లోకి"

"అదే .... ఎక్కడిదని నాప్రశ్న"

"సాయంకాలాలు టైప్ ఇన్‌స్టిట్యూట్‌కు వెడుతున్నానుకదా- దాని తాలూకువి"

ఎప్పుడూ లేంది తన అన్న రాత్రిళ్ళు బయటతిరగటం గురించి నెలరోజులుగా ఆశ్చర్యపోయిన విజయ, ఆ మాటవిని మళ్లీ ఆశ్చర్యపోయింది. పెద్దన్నయ్యకున్న ఆలోచనలో కొంతైనా చిన్నన్నయ్యకుంటే ఎంత బావుండేది- అనుకుంది, డబ్బులు లోపలపెడుతూ.

కుక్కి మంచంలో ముడుచుకుని పడుకు

న్నాడు శ్రీను.

"ఈ మిల్లు సక్రమంగా మొదలయ్యాక వీడికో మంచి దుప్పటితేవే విజయా" అన్నాడు వెంకటేశం, శ్రీను తల నిమురుతూ.

వెంకటేశం మిల్లు దగ్గర దుప్పటి తేవటం, శ్రీను పాతదుప్పటి చినిగిపోవటం- ఒకేసారి జరిగింది. కొత్త దుప్పటి కుదించుకుపోయినా బానేవుండేది వాడికి. కానీ దాని అంచులు ఒక చివరంతా ఎలుకల పళ్ళులకు గురికావటంతో కొంత కత్తిరించేసి అంచులు కుట్టింది అరుణ. అప్పటికే వేరేగుడ్డను అంచుమడతల్లో అతికించి వీలైనంతవరకూ పొడవు తగ్గకుండానే చూసింది. అయినా ఎంతో కొంత పొడవు తగ్గిపోయింది. ఈలోగా శ్రీను కాస్త పొడుగు పెరగటంతో అది చిన్నదైపోయింది.




రోజులు గడిచిపోతున్నాయి. సుధాకర్ గురించి దాదాపు అంతా మరిచిపోతున్నదశలో ఒకరోజు అతను ఢిల్లీనుంచి రాసిన ఉత్తరం వచ్చింది. అది విజయ పేరున వచ్చింది. తల్లికి మళ్లీ చదివి వినిపించింది విజయ-

"ప్రియమైన చెల్లాయీ!

నా కోసం మీరంతా బెంగపెట్టుకుని వుంటారు. అయితే నేను క్షేమంగానే వున్నాను.

గోదావరిఖనిలో ఉద్యోగం మానేసినందుకు మీ అందరికీ నాపై కోపంగా వుండవచ్చు. కానీ మానేయక తప్పలేదు.

ఢిల్లీ చాలా పెద్దనగరం. ఇక్కడ బతకటం చాలా కష్టం. అన్నిటికీ ధరలు ఎక్కువ వుంటాయి. కొత్తిమీరకట్టకు అర్ధరూపాయి అంటే నమ్ముతావా? అదన్నమాట సంగతి. ఇక ఇల్లు అద్దెకు దొరకటం అడగక్కర్లేదు. మా షాపులో పనిచేస్తున్న వాళ్లతోపాటు అదే గదిలో వుంటున్నాను. నావంతు అద్దె నూటపాతిక రూపాయలు.

చెల్లీ... మీ అందరికీ నామీద చాలా కోపంగా వుండవచ్చును. కానీ నేను ఏమీ చేయలేని స్థితిలో వున్నాను. ఇక్కడ రెడ్‌ఫోర్ట్ దగ్గర స్మగ్‌లింగ్ వస్తువులు అమ్మే పెద్ద బజారొకటి వున్నది. అందులో ఒకషాపుకు సంబంధించినాయన నాకు ఉద్యోగం ఇచ్చాడు. ఆయనిచ్చే జీతంతోపాటు ఇతర మార్గాల్లో మొత్తం ఏడెనిమిది వందలొస్తోంది. కానీ నాకే సరిపోవు.

నేనూ, మరికొందరం దోస్తులం కలిసి ఈ వ్యాపారం సొంతంగాచేయాలని ఆలోచిస్తున్నాం. అప్పుడు మనం లక్షాధికారులం అయిపోతాము. మా షాపులో మా జీతాలూ, ఖర్చులూపోను లాభమే రోజుకు మూణ్నాలుగు వేలుంటుంది - తెలుసా!

అమ్మానాన్నలను బెంగపెట్టుకోవద్దని చెప్పు. నేను బాగా డబ్బు సంపాదించిన తరువాతే ఇంటికి వస్తాను. నీకు నామీద కోపంలేదని భావిస్తాను. శ్రీను బాగా చదువుకుంటున్నాడని ఆశిస్తాను. అరుణక్కయ్యనూ, అన్నయ్యనూ, మనోహర్‌నూ, గౌరీశంనూ - అందరికీ అడిగినట్టు చెప్పగలవు.

ఇట్లు
మీ అన్నయ్య
సుధాకర్"

"వీడు స్మగ్లింగ్ చేస్తున్నాడా?" ఆశ్చర్యపోయింది అరుణ.

"అంటే ఏమిటే" ఆరాతీసింది జగదాంబ. ఆ ఢిల్లీ ఏమిటో అయోమయంగా వుందామెకు.

ఏమీ చెప్పొద్దన్నట్టు అరుణకు సైగచేసింది విజయ.

"ఓ వ్యాపారం అమ్మా అంతే...!"

"మరి ఇదెందుకు అంత ఆశ్చర్యపోయింది?"

"అదా... అది చాలా భారీ వ్యాపారం. మనలాంటివాళ్లు చేయటానికి భయపడతారు.

అందుకే నాకాశ్చర్యం వేసింది'' సర్దిచెప్పింది అరుణ.

వెంకటేశం, నారాయణలు చూశారు ఉత్తరం. వెళ్లి తీసుకురావడానికి అడ్రస్‌లేదు. ఢిల్లీలాంటి మహానగరంలో ఎక్కడని వెతుకుతారు? అయినా వెదికి పట్టుకుని మాత్రం ఏమిటి లాభం? ఎక్కడోచోట తన బతుకు తను బతుకుతున్నాడని తృప్తిపడినా, లక్షాధికారులమవుదామని కొడుకు రాసిన మాటకు ఎందుకో ఏదో తెలియని భయం కూడా కలిగింది జగదాంబకు. కొడుకు ఏ చిక్కుల్లో పడతాడోనని విచారించాడు వెంకటేశం. ఇక అరుణ, నారాయణలు పెద్దగా ఆలోచించరు.

మొండితనమే తప్ప సుధన్నయ్యకు ఆలోచనలేదు. ఈపాటికి గోదావరిఖని ఉద్యోగంలోనే వుండివుంటే హాయిగా ఆరొందలపైన జీతం వచ్చేది. ఎంత ఖర్చుపెట్టుకున్నా ఇంటికి ఓ రెండొందలైనా, కనీసం వందైనా పంపేస్థితిలో వుండేవాడు. నాన్నకూ, పెద్దన్నయ్యకూ కాస్తంతైనా తెరిపివుండేది. కానీ అంత ఆలోచనేదీ - ఎప్పుడూ తొందరే.

అరుణక్కయ్యకూ, సుధన్నయ్యకూ ఎప్పుడూ డబ్బు సంపాదనమీదే ఆలోచన. ఏదీ సంపూర్ణంగా తెలియదు. ఆవిడకు సినిమాల్లో చేరి సంపాదించాలని, ఈయనకు స్మగ్లింగ్ చేసైనా సంపాదించాలని. నాన్న పెద్దన్నయ్యలను చూసైనా తెలుసుకోరు. కష్టాలు లోకంలో తామొక్కరికే వున్నాయా? అందరూ సవ్యంగా ఆలోచించి, సరిగ్గా వుంటే శ్రీను పెద్దవాడయ్యే నాటికైనా అమ్మానాన్నలకు జీవితం హాయిగా వుండేది. 'బతకటానికి డబ్బు కావాలి... నిజమే. కానీ, డబ్బే బతుకు కాదుకదా' వాళ్ల అత్యాశలూ, పెద్దవాళ్ల నిరాశలూ, ఈ సంసారం ఎప్పుడు బాగుపడుతుందో- ఇలా ఆలోచిస్తూ వుండిపోయింది విజయ, ఆ రోజంతా.

★ ★ ★

''అబ్బే... ఇదేం థీమ్- లాభంలేదు'' పెదవి విరిచాడు ఎడిటర్.

''పోనీ మీరు అయిడియా ఇవ్వండిసార్'' అన్నాడు గౌరీశం నిగ్రహించుకుంటూ.

''నన్నే అడిగావా'' కాస్సేపు ఆలోచించాడా



యన-''ఇప్పుడు, నువ్వు బాగా అబ్జర్వ్‌చేస్తూండి వుండాలి. యువజంటలు, ప్రేమికులు-ఎక్కువైపోతున్నారు. కట్నాలబాధ భరించలేక తల్లిదండ్రులు కూడా తమపిల్లల్ని అదుపులోపెట్టటంలేదనిపిస్తూంది. ఇది బేస్‌గా తీసుకుని, ఒక మంచి కథ తయారుచెయ్''

ఒక అయిదునిమిషాలు ఇద్దరూ మాట్లాడుకున్నారు. చివరగా చెప్పాడాయన-

''వరకట్నపిశాచిని దుయ్యబడుతూ, ... హాయిలైన ఆడకూతుళ్ళని పెడదారిపట్టిస్తున్న ఈ వ్యవస్థనూ, ఈ సమాజాన్నీ నిలబెట్టి కడిగేయాలి. సెంటిమెంట్‌చక్కగా పండాలి— అర్థమయిందా?''

అయిందన్నట్టు తలూపి, ఒక నాలుగుపార్ట్



లుకూడా రానుకస్తానని చెప్పి, సెలవుతీసుకున్నాడు గౌరీశం.

ఐదారురోజుల తరువాత ఆయనకు కథవినిపించాడు. మెచ్చుకుని, రెండ్రోజుల తరువాత చెబుతానన్నాడాయన..

రెండ్రోజులతరువాత వెళ్ళాడు గౌరీశం.

"ప్రతిసీనూ ఎత్తుకోవడం, ముగించటం చాలా బాగుందయ్యా. కానీ ఇదేమిటి, ఒక్కమాటతో సరిపెట్టావ్" అన్నాడు, ఒక పేజీ చూపిస్తూ.

"...ఇద్దరి తనువులూ ఏకమైపోయాయి. ప్రకృతి, పురుషుల ఆది సంగమం అదేనా, అర్ధనారీశ్వరుడా అన్నట్లుగా అనిపించింది. మరునాడు కైవల్యను ముద్దుపెట్టుకుని, కళ్ళతోనే తన ఆనందాన్ని వ్యక్తంచేసింది శోధిని" చదివి, ఎడిటర్‌వైపు చూశాడు గౌరీశం.

"ఇదిగో ఈసీన్‌ను ఎంతచక్కగా పండించాలి. కనీసం నాలుగు పేజీలైనా రాయాలి-ఏమిటీ ప్రకృతిలోని విచిత్రం. ఎంత లలితమైన స్త్రీత్వానికి, ఎంతకఠినమైన యవ్వన సిరిని ఎలాజోడు కలిపింది. నగ్నంగా వున్న ఆమె గుండెలమధ్య గీతను తన చూపుడువేలుతో రాస్తూ, తల్లి తన బిడ్డకు ప్రేమతో అందించే ఆచోటు, ఏపదార్థానికీ సరిరాని మాతృత్వపు అనురాగంతో కడుపునింపేచోటు, ఓహ్... మగవాడు ఆడదాన్ని తన భాగస్వా

మిగా భావించి, రాసలీల సాగించేవేళ, ఎంత మత్తెక్కిస్తుంది, ఆ నునువుదనం అపురూపశి ల్పి అయిన బ్రహ్మకు ఎలా సాధ్యపడిందో, క్రమక్రమంగా మొనదేలుతున్న ఆ ఆకృతిలో క్రమక్రమంగా మారుతూ తేలిన ముదురు నలుపువర్ణం-ఇలా వుండాలి. ఇక సీన్‌చిట్టచివ ర్న రచయితగా నువ్వు చెప్పాలి, స్త్రీని పుష్పవ తిని చేస్తూనే ఆమె శృంగారానికి తగినదని ప్రకృతి తన గ్రీన్‌సిగ్నల్‌ని రంగుమార్చి ఇచ్చే స్తూంది. కానీ, నాగరికత ముసుగులో ఈ మను షులు, అనుభవించవలసిన వయసును అడ విపాలుచేస్తున్నారు, ధనదాహంతో తమకొడుకు లకు పెళ్ళిళ్ళుచేయటానికి విపరీతపు కోర్కెలు కోరుతున్నారు కొందరు. నిస్సహాయతతో ఆడ పిల్లల తండ్రులు తమకూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయలేకపోతున్నారు. ఈ విషవలయంతో పోరాడలేక ఒక అబల నిస్సహాయంగా ఎంతకా లమని వుంటుంది. జతకట్టేకాలం రాగానే తోడుకోసం పరితపించే పశు పక్ష్యాదులకున్న పాటి స్వేచ్ఛ, మానవులకు వుండకూడదా, పె ళ్ళి కానంతమాత్రాన శోధినిచేసిన పని తప్పేనా? ఈ అన్యాయాన్ని మరో కోణంలో ఎదుర్కోవటానికి సిద్ధపడిన శోధిని మహిళాలో కానికి కొత్తబాట చూపిస్తుంది-ఇలా కొట్టాలి దెబ్బ, సెంటిమెంట్‌మీద'' ఆగాడు ఎడిటర్.

''అర్థమయిందిసార్'' అన్నాడు జ్ఞానోదయ మైన గౌరీశం.

''అసలు రచయితకు ముఖ్యమైనది అను భవం. ప్రతీవిషయం స్వయంగా తెలుసుకుని రాసినప్పుడే సహజత్వం వస్తుంది. నీలాంటి రచయితే, ఒక కథలో-హీరో బార్‌కు వెళ్ళి, ఒక పెగ్గుబీరు, ఒక సోడా ఆర్డర్‌చేశాడు- అని రాశాడు. ఆ ఎడిటర్ అదంతా వివరంగా చదువకుండా ప్రెస్‌కిచ్చాడు. ఆతర్వాత ఈమాత్రం తెలుసుకోకపోతే ఎలా -అని కొంద రు విమర్శిస్తే, సిగ్గుపడి, బార్‌లను, పావనంచే సాడు ఆయన. ఆ తరువాత ఇప్పుడు బార్‌లో కూర్చునే రాస్తున్నాట్ట. అలా అవద్దుకానీ, అన్న ట్టు...నువ్వింకా బేచులర్‌వేనా, నేననేది పెళ్ళి సంగతికాదు...''అంటూ నవ్వాడాయన.

ఆయనమాటవినగానే గౌరీశం మొహంలో రంగులుమారిపోయాయి. మౌనంగా తల వంచుకుని, ఏదో ఆలోచనలో పడ్డాడు.

అదిచూసి, ''అదీసంగతి... ఎవరైనా గర్ల్ ఫ్రెండ్‌వుందనుకో, నేను చెప్పకుండా నువ్వే రాసేవాడివి'' నవ్వుతూ అన్నాడు ఎడిటర్.

గౌరీశం ఏమీ మాట్లాడలేదు.

''రెండుమూడురోజుల్లో నేను హింట్స్‌రాసిన చోటల్లా మార్చి, ఆసక్తికరంగా, పర్‌ఫెక్ట్‌గా రాయి. అన్నట్టు, రచయితగా నీజీవితానికి పొద్దుపొడిచిందనుకో ఇక. అందుకే నీపేరుతో చివరనున్న మార్నింగ్‌ని, అదే, ఏ, ఎమ్-అనే అక్షరాల్ని తీసెయ్, గౌరీశ్-అని రాసుకో. మంచి ప్యూచరుంది నీకు. ఈ సీరియల్‌గురించి ఈవారమే ప్రకటిస్తాను. ఇపుడొస్తున్న సీరియల్ పూర్తవగానే ఇది స్టార్ట్‌చేద్దాం. ఈలోగా మొత్తం పనిపూర్తిచెయ్''.

కాసేపు కూచుని సెలవుతీసుకుని, బైటపడ్డా డు గౌరీశం.

★ ★ ★

ఆదివారం ఉదయం టిఫిన్‌చేసి, విజయ దగ్గర ఇరవైరూపాయలు తీసుకుని, ఇంట్లోంచి బైటపడ్డాడు నారాయణ. హాస్టల్‌దగ్గరికెళ్ళేసరి కి, హాస్టల్ వరండాలో చెట్టుకింద నిలుచున్న ముగ్గురిలోంచి, ఒకమ్మాయి నారాయణ దగ్గరికొ చ్చింది. ఇద్దరూ కలిసి, నెమ్మదిగా నడకసా గించారు. నెమ్మదిగా అడుగులు వేస్తున్నారు...

''పోయిన ఆదివారం రాలేదేమ్మా'' కోప్పడే సిందా అమ్మాయి.

''సారీ గౌతమీ... మాతాతగారి తద్దినమట. పొద్దున బయల్దేరబోతుండగా చెప్పింది అమ్మ''

''ఇదిగో మీకు పెళ్ళిముఖ్యమా, తద్దినం ముఖ్యమా?'' అంది గౌతమి.

''అబ్బ... పోనీవోయ్ ఆ విషయం. మీఇంటి కెళ్ళొచ్చావా?''

''వెళ్ళొచ్చాను గనుకనే, ఆరోజు అంతగా ఎదురుచూశాను''

ఏమీ బదులియ్యకుండా నడవసాగాడు నారాయణ. కాస్సేపటికిక గౌతమే అంది- ''ఏమిటి విశేషాలని అడగొచ్చుకదా?''

నవ్వి ఊరుకున్నాడు నారాయణ. ఇక తనే చెప్పింది-




ఏముంది, మామూలే. సెకండియర్తోనే ఆపేసి, పెళ్ళిచేస్తామంటున్నారు''

''అంటార్లే... ఇంకోసంవత్సరం చదువుంది గదా, తొందరేముంది?''

''మీకేంటి, మీరలాగే అంటారు. ఇంట్లో నామాట వినాలిగదా''

''మరి ఏం చేద్దామంటావు?''

''ఏముంది... పెళ్ళి చేసుకుందాం''

''అన్నంత సులభంకాదు గౌతమీ. నాకున్న బాధ్యతలు నీకూతెలుసుగదా''

''ఈ బాధ్యతలు ఎప్పుడూవుండేవే. పెళ్ళయ్యాక నేనేమైనా వదిలించుకోమన్నానా! మీరు వదిలించుకుంటారు గనుకనా?''

''ఎలాగోలా నచ్చచెప్పు, మీఇంట్లో''

''నోట్లోంచి మాటరాదుకదా, చెప్పినట్టు వింటారు, కొంగున ముడేసుకోవచ్చుననుకుని మిమ్మల్ని ప్రేమించానుగానీ, అమ్మో, ఇంత మొండిఘటమని తెలిస్తే ఏంచేద్దునో''

''నేనూ అదే అనుకుంటున్నాను. అనలా రోజు సినిమా థియేటర్లో నువు పలకరించినప్పుడు మాట్లాడకపోతే ఎంత బావుండేది'' ఉడికించాడు నారాయణ.

''ఆరోజు నేనే వచ్చి పలకరించి, టికెట్ మిగిలింది ఇచ్చినందుకు ఇదన్నమాట. నేను టికెట్ ఇవ్వకపోతే....''

''ఆ సినిమాతోపాటు ఇలా కలిసినప్పుడల్లా నీ సినిమా కూడా తప్పేది?''

''ఛీ... మీ మగవాళ్ళంతా ఇంతే! పెళ్ళిదగ్గరికొచ్చేసరికి ధైర్యం రాదు''

''అది పోనీగానీ లోయర్తో మానేశావేంటి?''

''ఆ.... మీరు లేకపోయింతర్వాత ఇంక లైఫ్ ఎందుకు?''

''సరేగానీ.... కాస్సేపు ఎక్కడైనా కూర్చుని మాట్నీకి వెళ్దామా?''

''అమ్మో.... మా మిస్సింగ్ చూసిందంటే చంపేస్తుంది''

''ఎవరు?''

''అదే... మిస్సింగ్, మా మేట్రన్''

''మిస్సింగా- అదేంటి?''

''మిస్. సింగ్. మిస్టర్‌సింగ్ అంత భయంకరంగా ఉంటుంది గొంతు''

''నిన్ను చూడ్డంతప్ప వేరే పనేంలేదా ఆమెకు?''

''ఇన్నేళ్ళొచ్చినా పెళ్ళిచేసుకోలేదు. ప్రేమ సంగతి ఇంకేం తెలుస్తుంది ఆ మహాతల్లికి. సాయంత్రం లేటైతే ఇంటికి రాసిందనుకోండి- ఇక అంతే సంగతులు. కాళ్ళిరగ్గొట్టి ఇంట్లో కూర్చోబెడతారు''

''అన్నిటికీ అన్నీ చెబుతావు- ఏం చేయాలి నిన్ను?''

''పెళ్ళిచేసుకోండి. మేట్రన్ ఏంటి, దానిమొగుడికూడా భయపడక్కర్లేదు''

''మరిప్పుడేం చేద్దామంటావు?''

''నేన్నిన్ననే అడ్వాన్స్ బుకింగ్ తీసుకున్నాను. మార్నింగ్‌షోకి- వెళదాం''

ఆటో ఎక్కారు, కబుర్లాడుకున్నారు.... సినిమా చూశారు.... కబుర్లాడుకున్నారు.... టిఫిన్ చేశారు, కబుర్లాడుకున్నారు..... కబుర్లాడుకున్నారు, కబుర్లాడుకున్నారు... టీ తాగారు, కబుర్లాడుకున్నారు... ఎవరి గూటికివాళ్ళు చేరుకున్నారు. కబుర్లు నెమరేసుకున్నారు.... కలల్లో కబుర్లాడుకున్నారు.

★ ★ ★

''ఏమిటే అరుణా... నువు బైటకూచుని నెలదాటినట్టుంది''

''అబ్బే... లేదమ్మా! ఇంకోవారంలో వస్తుందేమో. ఈ మధ్య ఎందుకో సరిగ్గా రావటంలేదు కూడా''

''అలక్షం చేయకేతల్లీ! ఏ పెద్ద జబ్బులోకో దిగితే కష్టంకూడానూ- డాక్టర్ దగ్గరికెళ్ళు''

''డాక్టరంటుంటే మాటల్లోనే వచ్చాడు, కాబోయే డాక్టర్''

మనోహర్‌ని చూస్తూ అంది విజయ, అప్పుడే తల్లిమాటలు వింటూ.

విషయమేమిటో విజయకు తెలియక, మనోహర్‌కు చెప్పడంతో అతను అరుణ కళ్ళూ, నాలికా, నాడీ పరీక్షించాడు.

''ఇంతకూ ఏమిటక్కా జబ్బు? అసలు ఏమనిపిస్తుంది'' ఏదో ఆలోచిస్తూ అన్నాడు, హౌస్

సర్జన్ మనోహర్.

"నేను లేడీ డాక్టర్ దగ్గరికి వెళతాన్లే?" అంది అరుణ.

"ఏంటి ఏదైనా మెన్సురల్ ట్రబులా?"

అరుణ మాట్లాడకుండా ఉండిపోవటంతో మళ్ళీ అన్నాడు మనోహర్-

"నాకు తెలిసిన ఒక డాక్టరుంది.... వెళదాం రా అక్కా!"

పదినిమిషాల్లో విజయా, అరుణా తయారయ్యారు. మెయిన్ రోడ్డు పైకెక్కగానే ఆటో పిలిచాడు మనోహర్.

"డాక్టర్ విజయలక్ష్మి" అని చిన్న బోర్డుంది.

"మా ప్రొఫెసర్‌గారి భార్య. ప్రైవేట్‌గా ప్రాక్టీస్‌చేస్తూంది. నర్సింగ్‌హోమ్ కూడా నడిపిస్తున్నారు" లోపలికెళ్తుండగా చెప్పాడు మనోహర్.

అరుణను పరీక్షించి, ప్రశ్నలడిగిందావిడ-

"ఏమైనా వికారంగా అనిపిస్తుందా?"

"కొంచెం, అప్పుడప్పుడూ అన్నం సయించటంలేదు"

"యూరిన్....?"

"తరచుగా బాత్రూం వెళ్ళాల్సివస్తూంది"

"లాస్ట్ పీరియడ్ ఎప్పుడయింది?"

కాస్సేపు ఆలోచించి, చెప్పింది అరుణ-

"సరిగ్గా గుర్తులేదండీ... సిక్స్ సెవెన్ వీక్స్ అయినట్టుంది"

"ఒకసారి లోపలికి రా అమ్మాయ్... టెస్ట్ చేయాలి"- లేచిందావిడ.

వెనకే వెళ్ళింది అరుణ. ఐదారు నిమిషాల తరువాత అరుణ వచ్చి కూచుంది. ఓ నిమిషం తరువాతొచ్చింది డాక్టర్- టవల్‌తో చేతులు తుడుచుకుంటూ.

సుమారు నలభై ఐదేళ్ళుంటాయావిడకు. కాస్త లావుగా ఉంటుంది కానీ చూడగానే హుందాగా, ఆకర్షణీయంగా ఉంటుంది. ముఖంలో ఒక అరుదైన గ్రేస్- చూస్తుంటే కరుణ, వాత్సల్యం కనిపిస్తాయి. ఆమెను చూస్తేనే మామూలు రోగులకు సగం జబ్బు పారిపోయినట్టనిపిస్తుంది. కుర్చీలో కూర్చుంటూ అడిగిందావిడ-

"మనూ... ఆర్ దే క్రిష్టియన్స్"- అని అరుణ నుదుటి వంక చూస్తూ.

"నో మేడమ్ షి ఈజ్ విడో" అన్నాడు మనోహర్.

"ఐ సస్పెక్టెడిట్" క్షణంసేపు ఆగిందావిడ.

అక్కాచెల్లెళ్ళిద్దరూ మౌనంగా వింటూ కూర్చున్నారు.

"ఎన్నిరోజులయిందమ్మా నీ హజ్‌బెండ్ పోయి?"

ఆమె అప్పట్నించీ అడుగుతున్నతీరునుబట్టో, తన మెడిసిన్ అనుభవాన్నిబట్టో ఎందుకో, ఏదో అనిపించింది మనోహర్‌కు. ముఖ్యంగా ఇప్పుడిప్పుడే తనూ ఆ రంగంలో అడుగుబెట్టినందువల్ల అనుభవజ్ఞులైన డాక్టర్లు పేషెంట్లను అడిగే ప్రతి ప్రశ్నా జాగ్రత్తగా వినటం అలవాటయింది మనోహర్‌కు. ఎన్ని 'రోజులైందమ్మా'- అన్న ఆమె ప్రశ్నకు కూడా అలాగే అతని మెదడులో ప్రత్యేకంగా ప్రవేశించి, ఏదో విశ్లేషించి చెప్పినట్టుంది. అందుకే ఆమె ప్రశ్నకు అరుణ జవాబు చెప్పకముందే తనే నడన్‌గా జవాబిచ్చాడు-

"రెండు నెలలు కూడా అవలేదు మేడమ్"

హఠాత్తుగా గదిలో ఏదో విచిత్రమైన వాతావరణం ఏర్పడినట్టయింది. డాక్టర్ కళ్ళద్దాలు తీసి టేబుల్‌పైన పెట్టింది, ఏదో ఆలోచిస్తూ. మనోహర్ చెప్పిన అబద్ధం అక్కాచెల్లెళ్ళిద్దర్నీ ఆశ్చర్యపరచింది. అరుణ ముఖంలో రంగులు మారిపోయాయి. కర్చీఫ్ తీసుకుని ముఖం తుడుచుకోసాగింది. అరుణవైపు ఒకసారి పరీక్షగా చూసి ఒకక్షణం ఏదో ఆలోచించి.

"మీరిద్దరూ కాస్సేపు బైటకూచోండమ్మా" అంది డాక్టర్.

విజయకు మరింత ఆశ్చర్యం, ఏదో తెలియని కలవరపాటూ కలిగింది. నిస్సత్తువగా లేచి నిలబడింది అరుణ. ఇద్దరూ గదిదాటి బైటకు వెళ్ళారు.

వాళ్ళిద్దరూ వెళ్ళిన తరువాత వీలైనంత మెల్లిగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ అడిగిందావిడ-

"మనూ... ఆర్‌దే యువర్ రిలేటివ్స్?"

ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు మనోహర్-




"యస్... మేడమ్"

"పూర్‌గాళ్... ఐ సస్పెక్ట్ షి ఈజ్ ప్రెగ్నెంట్"

అంతవరకూ తన మనసులో ఇబ్బందిగా తొలిచేస్తున్న ఏదో భావన, అప్రయత్నంగా తను చెప్పిన అబద్ధం అరుణ వ్యక్తిత్వాన్ని ఈ డాక్టర్ ముందు దిగజారకుండా ఆపిందన్న ఆలోచన, అంతలోనే అర్ధంకాని నీరసం ఆవహించినట్టు అనిపించింది మనోహర్‌కు.

"ఇంత చిన్నవయసులో భర్తని పోగొట్టుకుంది. భర్తపోయిన వెంటనే అప్పటికే తను గర్భవతినన్న విషయం, పాపం ఆ ట్రాజెడీలో గ్రహించనట్టుంది అమ్మాయి"- చెబుతూ ఆగింది ఆవిడ.

మౌనంగా వుండిపోయాడు మనోహర్.

సుమారు పాతికేళ్ళుగా ఎంతోమంది పేషెంట్లను, ఎన్నోరకాలమంది మనుషులనూ చూసిన అనుభవం ఆమెది.

"ఈవార్త ఆ అమ్మాయికి సంతోషం కలిగిస్తుందో, విచారమే కలిగిస్తుందో...మళ్ళీ పెళ్ళిచేసుకోవాలనుకుంటే, రేపు ఈ బిడ్డ అడ్డంకు అవొచ్చు. హఠాత్తుగా విషయంచెప్పి గాభరాపెట్టడం మంచిదికానిపించింది. ఫస్ట్‌ప్రెగ్నెన్సీ అబార్షన్‌చేయటం అంతమంచిదికాదు. కానీ జీవితంలో ఎదురయ్యే విషయాలూ ఆలోచించాలి. వాళ్ళపరిస్థితులు ఆలోచించి. ఎలా చెప్పాలో నిదానంగా చెప్పు. డోంట్ లెట్ హర్ హేవ్‌షాక్. ముందుగా ప్రెగ్నెన్సీ టెస్ట్‌చేయించు. కన్‌ఫర్మ్ అయిన తరువాత చెప్పు. తరువాత విషయం తరువాత ఆలోచిద్దాం"

మౌనంగా తలూపాడు మనోహర్. వెళ్ళటానికిముందు అరుణా, విజయా ఆమెదగ్గరికొచ్చారు.

"ఏమీలేదమ్మా... ఏదో చిన్న డౌట్. యూరిన్ టెస్ట్ చేయించిన తరువాత మందులు రాసిస్తా ను. ఏమీ భయపడకండి. గాడ్‌బ్లెస్‌యూ" చెప్పిందావిడ.

నమస్కరించి, ముగ్గురూ వెనుతిరిగారు.

దారిలో విజయ అడిగింది కానీ మనోహర్ మాట దాటించేశాడు. తనకు తెలిసిన పెథాలజీలాబ్‌కు తీసుకెళ్ళాడు. అయిదు నిమిషాలతరువాత ఆటో తీసుకుని. వాళ్ళిద్దర్నీ ఇంటిదగ్గర దింపేసి, లాబ్‌కు వెళ్ళాడు. రిజల్ట్ పాజిటివ్ వచ్చింది.

అరుణ గర్భవతి. ఏంచేయాలో పాలుపోలేదు మనోహర్‌కు. ఆ విషయం ఎలా చెప్పాలో, ఎవరికి చెప్పాలో అన్నదానికంటే అది ఎందుకు జరిగిందో ఎక్కువగా వేధిస్తూంది మనోహర్ మనస్సును.

ఈపాటికి అరుణక్కకు అర్థమైవుంటుందా? ఎందుకిలా చేసింది? ఎవరో అతను. పబ్బం గడుపుకుని తప్పుకునేవాడో లేక పెళ్ళి చేసుకుంటాడో...ఇప్పుడు అరుణక్క ఏంచేస్తూంటుంది? ఇంట్లో తెలిస్తే ఏమవుతుందో-ఈ ఆలోచన రాగానే అనిపించింది మనోహర్‌కు-ఒకవేళ ఆత్మహత్యకుగానీ పాల్పడితే...అవును, అరుణక్క స్వభావం తనకు తెలుసు...అలాంటిది కాదు, ఏదో బలహీనక్షణంలో, ఎవరి ప్రోద్బలంతోనో ఇలా జరిగివుంటుంది. విషయం ఎలాచెప్పాలో తను ఆలోచించుకోవటానికి కనీసం తెల్లవారాలి. ఒకటి రెండు రోజులాగినా ఏమీకాదుగానీ, ఇప్పటికే తను గర్భవతినని గ్రహించి, ఏ అఘాయిత్యమో తలపెడితే...అలా జరగకుండా వుండాలంటే ఏం చేయాలి?-ఆలోచిస్తూ ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఓ మెడికల్‌షాప్‌లోకి ప్రవేశించి, ఏవో రెండు మూడు రకాల విటమిన్‌మాత్రలు తీసుకుని, ఆటో ఎక్కి మళ్ళీ వాళ్ళదగ్గరకు వెళ్ళాడు.

గంటలో తిరిగొచ్చిన మనోహర్‌ని చూసి, ఆశ్చర్యపోయారందరూ. ఏదో వినకూడని వార్తను వినటానికి మనసు దిటవు చేసుకున్నారందరూ.

అప్పటికే తను గర్భవతినేమోనన్న ఆలోచన వచ్చేసింది అరుణకు. అయినా, మనోహర్‌తో డాక్టర్ రహస్యంగా మాట్లాడటంతో మరేదైనా జబ్బేమోనన్న ఒక ఆశ కదలాడింది. మొదటిదానికన్నా, రెండవదే నిజమైతేనుపోయినా ఫర్వాలేదు. అసలుసంగతి మనోహర్ వచ్చి చెప్పేలోగా తెగించి, ఏదోఒకటి చేస్తే, అప్రదిష్టఎలాగూ తప్పదు. మొగుడు పోయిన

మ్మాయి ఆత్మహత్య చేసుకుందంటే లోకం తప్పక అనుమానిస్తుంది. ఏంచేయాలా-అని ఆలోచిస్తూంది అరుణ.

"మామేడమ్ పేథాలజీటెస్ట్ అనేసరికి నాకూ గాభరా అనిపించింది. ఏమీ కాంప్లికేష న్లేదట. రిజల్ట్ తెలుసుకుని, ఆవిణ్ని మళ్ళీ కలుసుకుని వచ్చాను. బలహీనత కారణమై వుంటుందని, మందులు రాసిచ్చింది" అంటూ తను తెచ్చిన టాబ్లెట్స్ అందించాడు.

అందరూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

★ ★ ★

అరుణకు ఏ జబ్బూ లేదని తెలియటంతో మనసు తెరిపినపడ్డట్టు అనిపించింది విజ యకు. ఫస్ట్ అయిపోయి రెండ్రోజులయింది. గౌరీశం ముందునెల అద్దెకూడా ఇవ్వలేదు. అతనిచ్చిన అడ్వాన్సుందికదాని అడగలేదు విజయ. త్వరలో ఇచ్చేస్తానని ఓసారన్నాడు కానీ ఇవ్వలేదు. విజయకూడా మళ్ళీ అడగలే దు. నారాయణకు ఉద్యోగం వచ్చిన తర్వాత రెండోతేదీనే వచ్చి అద్దెతీసుకుపోతున్నాడు ఇల్లుగలాయన. గౌరీశం అడ్వాన్సు కూడా అయిపోయింది. ఇక ఆయని వాటాకూడా ముందు తమ డబ్బులోంచి ఇచ్చేసింది.

విజయ వెళ్ళేసరికి ఏదో ఆలోచిస్తున్నాడు గౌరీశం చాప మీదపడుకుని. విజయను చూడ గానే చప్పున లేచికూచున్నాడు.

"ఏమిటి, సంగతులు?" నవ్వుతూనే అడి గింది గడపమీద కూచుంటూ.

విజయ అద్దెకోసం వచ్చివుంటుందని అర్థంచేసుకున్నాడు.

"ఏంలేదు... కథలో ఒక సీన్‌గురించి ఆలో చిస్తున్నాను. ఎలా రాయాలో తెలీటంలేదు" బలవంతంగా నవ్వుతెచ్చిపెట్టుకుని అన్నాడు.

"ఇవాళ వంట చేసినట్టులేదే"

"హోటల్లో తినేసి వచ్చాను"

ఆమాట వినగానే చప్పున లేచింది విజయ- "ఇప్పుడే వస్తాను" అంటూ.

మరునిమిషంలో ఓ ప్లేట్లో రెండు చపాతీ లూ, చిన్న గిన్నెలో కూరా తీసుకుని వచ్చి, గౌరీశం ముందుపెట్టింది. గ్లాసుతో కుండలోని మంచినీళ్ళు ముంచి పెట్టింది. హఠాత్తుగా విజయ అలాతెచ్చేసరికి అవాక్కయిపోయాడు గౌరీశం. అందుకే వెంటనే ఏమీ మాట్లాడలేక పోయాడు.

"ముందు అవి తిను, తర్వాత మాట్లాడుదు వుగానీ" అంది విజయ.

"అరే... నేను తినొచ్చాననన్నానుకదా"

"ఇవాళ అమ్మానాన్నలు ఉపవాసం. అందుకని అందరికీ చపాతీలు చేసింది అరుణ. ఏమీ మాట్లాడకుండా తింటావా లేదా?"

"నిజంగా తినొచ్చాను విజయా!"

"నామాట విని అవి తింటావాసరి... లేదూ ఈ నెలాఖర్లో గది ఖాళీచేసి వెళ్ళిపో. నాతో ఇంకేమీ మాట్లాడొద్దు- నేను వెడుతున్నాను" వెనుదిరిగింది విజయ.

"విజయా... కూర్చో" అన్నాడు కంగా రుగా...

వెళ్ళి గడపమీద కూర్చుంది.

పళ్ళెం ముందుకు లాక్కున్నాడు గౌరీశం. చపాతీ తుంపి చేతిలో పట్టుకుని అలాగే కూర్చున్నాడు.

"ఎన్నిసార్లు నేనూ, అరుణా తెచ్చివ్వలేదు టిఫిన్లు. ఇప్పుడెందుకింత మొహమాటం" అనునయంగా అంది విజయ.

"ఎందుకో నీకూ తెలుసు...అభిమానం అంటూ ఒకటుంటుందికదాఎంతైనా" తన చేతి లోని చపాతీముక్కను చిన్న చిన్నగా తుంపి, ముక్కలు చేస్తూ అన్నాడు.

విజయ తలవంచుకుని కూర్చుంది, రెండు చేతుల్తో మోకాళ్ళుపట్టుకుని.

"ఇలాంటి స్థితి వస్తుందని అనుకోలేదు విజయా" తుంపిన చిన్న ముక్కల్ని వేలికొస ల్తో నలిపి, పిండిలా చేస్తూ అన్నాడు.

"గౌరీశం... మేంకూడా ఇలాంటి పరిస్థితి లోనే వుంటే, నువుమాత్రం ఇలా చేసివుండేవా డివికాదా?"

అతని మనోస్థితి అర్థమయింది విజయకు. నిజానికి అతనిస్థితిలో తనుంటే, తనుకూడా అంతే అభిమానపడేదని తెలుసు. కానీ, తోటి మనిషి ఆకలితో మాడిపోతుంటే ఎలా ఊరుక




బుద్ధేస్తుంది. విజయ మనసంతా ఆర్ద్రమైపో యింది. గౌరీశంకానీ అవి తినకపోతే కొన్నిరోజు లదాకా తనకు నిద్రపట్టదు. కానీ ఏంచే యాలి... .

"అప్పుడు...అప్పుడు నేనిస్తే నువు తీసుకు నేదానివా?" విజయ ప్రశ్నకు మరో ప్రశ్నతో బదులిచ్చాడు గౌరీశం. ఎంత దౌర్భాగ్యమైన స్థితి ఇది. ఇంతకన్నా భయంకరమైనస్థితి ఏదైనా వుంటుందా-మనసు క్షోభతోనూ, నిస్సహా యతతోనూ నిండిపోయిందతనికి.

"ఆఁ" తన్నుకొస్తున్న దుఃఖం గొంతులోకొ చ్చేసింది. ఇంకో మూడంగుళాలు పైకి పొంగితే కళ్ళల్లోంచి పొంగు కొస్తుంది-"తప్ప కుండా తింటాను- నువ్విస్తే..." జీరవోయింది విజయ గొంతు.

"నా దగ్గరకూడా అభిమానమా గౌరీశం" అనకూడదనుకుంటూనే అనేసింది విజయ.

గుండె లోతుల్లోంచి ఉప్పెనలా పొంగుకొస్తు న్న ఆర్ద్రత జివ్వున పైకెగిసింది... ఇక ఆగలేక పోయింది విజయ...

"నాకేడుపొస్తూంది... ప్లీజ్, తిను గౌరీశం- నీకు దణ్ణంపెడతాను" ఏడుస్తూ, జలజలా కన్నీళ్ళు రాలుతుండగా, మోకాళ్ళమీద మోచే తులు ఆన్చుకుని, రెండు అరచేతులతో ముఖం కప్పుకుని బావురుమంది విజయ.

విజయ కన్నీళ్ళు చూడగానే, తను చిన్నగా తుంపిన ముక్కల్ని చప్పున నోట్లో పెట్టుకుని, గొంతు పొలమారగా, వెంటనే రెండు గుక్కల నీళ్ళు తాగి, మరోముక్కతుంపి నోట్లోపెట్టుకుని లేచి విజయ దగ్గరకొచ్చాడు.

అరనిమిషంపాటు వెక్కిళ్ళు పడుతూనే ఉంది విజయ. తన చెయ్యితీసి, విజయ భుజంమీద వేశాడు గౌరీశం, అనునయంగా.

కళ్ళు కొంగుకు తుడుచుకుని, తల కొంచెం ఎత్తి, కళ్ళు పైకెత్తి చూసింది గౌరీశంవంక. నములుతున్న చపాతీ నోరుతెరిచి చూపించా డు. మౌనంగా చప్పునలేచి నిలుచుని, "ఇప్పు డే వస్తాను" అని వెళ్ళింది.

ముఖం కడుక్కుని, తుడుచుకుని బొట్టుపె ట్టుకుంటూండగా అడిగింది అరుణ—

"ఏమిటే ... ఇప్పుడు సింగారిస్తున్నావు?" అని, నవ్వుతూ.

"సింగారమా, నీమొహమా ... నేనేమైనా నీలాగా హీరోయిన్నా ఏమిటి? వంటిల్లు సర్దు తూ, వళ్ళుంమీద కారప్పొడుంటే మరిచిపోయి ఉఫ్న ఊదాను. ఇక అంతే సంగతులు" కిలకిలా నవ్వుతూ చెప్పింది.

"నీతెలివి తెల్లారినట్లేఉంది. వంటింట్లోకొ చ్చేసరికి ఏమవుతుందే నీ తెలివి... వంటైనా తగలెడతావు. లేకపోతే ఏదో ఒకటి చేసు కుంటావు" నన్నగా కోప్పడింది చెల్లెల్ని.

"సరేగానీ ... ఈ రచయిత మహానుభావుడు ఈనెల అద్దె ఇయ్యలేదు. నువుకూడా వస్తావా, కాస్త దులిపేద్దాం"

"అమ్మో ... నీలాగా నేనడగలేను. అలా అడుగుతుంటే చూళ్ళేను. ఐనా ఈ సీరియల్ ఒకటుంది, చదవాలి" ముందుగదిలోకెళ్ళింది అరుణ.

మళ్ళీ గౌరీశం గదిని సమీపించింది విజయ. మెల్లిగా చపాతీ నములుతూ, తలెత్తి గుమ్మంలో నిలుచున్న విజయను చూసి నవ్వా డు సన్నగా.

"చిన్నపిల్లలాగా చేసినట్టున్నాను" నవ్వు తూ అంటూ, మళ్ళీగడపమీద కూర్చుంది.

"చిన్న పిల్లలాగా ఏమిటి, పెద్దాళ్ళు చేసిన ట్టేవుంది కూర, కమ్మగా..." మాటమారుస్తూ అన్నాడు గౌరీశం.

"ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు. ఒక ఇంట్లో ఉంటున్నవాళ్ళం. ఒకరికొకరు కష్టసుఖాలు చె ప్పుకోకపోతే ఎందుకు? ఇప్పుడిప్పుడే రెండు పూటలా తినగలుగుతున్నాం... ఒకరికి అవసర మైనప్పుడు సహాయంచేయటానికి ఎలా ముందుకొస్తామో, మనకు అవసరమైనప్పుడు తెలిసినవాళ్ళను సహాయం అడగటానికి కూడా అలాగే వెనుకాడొద్దు... నన్ను కాకపోతే అరుణక్కని, ఓ యాభై రూపాయలు అప్పడి గితే సరిపోయేదికదా! మా దగ్గరా లేవనుకో, మా ఖాతా దుకాణంలో అరువు తీసుకోవచ్చు కదా... ఎన్నిరోజులు, ఎన్నిరాత్రులు పస్తులు న్నామో... ఆకలి... ఎంత ఘోరమైందో... అర్ధశే రు బియ్యం, ఎన్నిసార్లు చేబదుళ్ళు తీసుకు న్నామో ఇరుగుపొరుగువారి దగ్గర మళ్ళీ ఇలా

చేయకు, పొద్దున మా షాపులోకెళ్ళి ఏం సరుకులు కావాలో తీసుకో...''

విజయ చెబుతూంటే మౌనంగా వింటూ, తినటంపూర్తి చేశాడు గోరీశం.

''లేదు విజయా ... పోయిన నెల్లో ఓ పత్రికవాళ్ళ చెక్కొచ్చింది. డెబ్భైఐదు రూపాయలకు- అంతే, అదొక్కటే. అందుకే అద్దె ఇయ్యలేదు. ఈ నెలలో నూట పాతికొస్తుంది ఇంకో రెండుమూడు రోజులకు. అప్పుడు ఇచ్చేద్దామనుకున్నాను...'' చెప్పలేక చెప్పలేక చెప్పాడు.

ఏమీ మాట్లాడకుండా, మోచేతులపై అరచేతుల్లో చుబుకం ఆనించుకుని వినసాగింది విజయ.

''ఈరోజు... ఈరోజు మాత్రం ఎన్నటికీ మరచిపోలేను విజయా''

హఠాత్తుగా మాటమార్చేసి అడిగింది విజయ—

''అసలు నువ్వెవరు... ఏమిటీ అజ్ఞాతవాసం''

క్షణంపాటు ఆలోచించి చెప్పాడు—

''ఏదో ఒకనాడు, చెప్పవలసివచ్చినప్పుడు, నీకు చెప్పాలనే అనుకున్నాను. సరే ... ఇప్పుడు చెబుతున్నాను''

చెప్పమన్నట్టు చూసింది విజయ, ఏమీ మాట్లాడకుండా.

''నేను నేనే ... ఇది అజ్ఞాతవాసంకాదు, ఇదే నా జీవితం. నేను ఐదో క్లాసులో ఉన్నప్పుడే మా అమ్మ పోయింది. మేం మొత్తం ఎనిమిది మంది పిల్లలం. నలుగురన్నలూ, ముగ్గురక్కలూ. అందరికంటే నేనే చిన్నవాణ్ని. నాకంటే ఐదేళ్ళు పెద్దది— మా చిన్నక్క. దాంతరవాత నేనే. అమ్మపోయేనాటికి ఇద్దరన్నల పెళ్ళిళ్ళు అయిపోయాయి. వాళ్ళు ఉద్యోగాల్లో ఉన్నారు వేరే వూళ్ళల్లో. ఇద్దరక్కల పెళ్ళిళ్ళు కూడా అయిపోయాయి. నాలుగేళ్ళకు చిన్నక్క పెళ్ళి కూడా అయిపోయింది. అప్పుడే మా పెద్దన్నయ్యలు చిన్నగొడవ చేశారు-- కొంత పొలం అమ్మినందుకు.

మరో రెండేళ్ళకనుకుంటాను, అప్పుడు నేను ఇంటర్‌లో ఉన్నాను... మా నాన్నకు కాన్సరని తెలిసింది. ఆయన బాంకులో ఆఫీసర్. మంచి జీతం వచ్చేది కానీ ఇంతమంది చదువులూ, హోదా ఇలాంటి వాటివల్ల సరిపోయేదికాదనుకుంటాను. ఆయనకు కొంచెం డ్రింక్ హేబిట్ కూడా ఉండేది. అమ్మ పోయిన తరువాత ఎక్కువయింది. ఐతే మాకు వెనకాల కొద్దిగా ఆస్తిపాస్తులున్నాయి. అదీగాక బాంక్ ఆఫీసర్లకు మెడికల్ ఖర్చు ఎంతయితే అంతా వాళ్ళే భరిస్తారు. అందువల్ల కూడా అంత ఇబ్బంది ఉండేదికాదు.

రెండు మూడుసార్లు మద్రాస్ వెళ్ళొచ్చాము. నాన్న ఇంకా బాంకుకు వెళుతూనే ఉన్నాడు. అప్పుడే బాంకులో జరిగిన ఒక ఫ్రాడ్‌కేసు విచారణ జరుగుతూంది. టెలిగ్రాఫ్ ట్రాన్స్‌ఫర్లు చేయటానికి ఉపయోగించే కోడ్‌బుక్ పోయింది. అది ఎవరో బాంకు ఉద్యోగుల సహాయంతోనే జరిగింది. ఫ్రాడ్ కేసులో మా నాన్న ఇరుక్కోలేదు కనుక పోలీసు కేసులూ, గొడవలూ జరగలేదు కానీ, మా నాన్న అధీనంలోంచే పోయిందని ఆరోపించి, మూడు నెలల్లో ఆయన్ని డిస్మిస్ చేశారు. ఇలాంటివాటిలో క్లర్కులకు యూనియన్లు అడ్డుపడతాయి కానీ ఆఫీసర్లకు మాత్రం అంత బలంలేదు. తన నిర్లక్ష్యం ఏమీలేదనీ, ఇంత సాహసం చేసినవాళ్ళకు బ్యాంకుబీరువా తాళాలు సంపాదించటం కష్టంకాదనీ మానాన్న అన్నాడు. కానీ ఎవరు వినిపించుకుంటారు. అన్ని సంవత్సరాలుగా, ఎక్కడా ఒక చిన్న పొరపాటు కూడా చేయకుండా తనుసేవ చేసిన సంస్థ తనను డిస్మిస్ చేసేసరికి బాగా కుంగిపోయాడు నాన్న.

ఉద్యోగంపోయిన బాధకన్నా ఎక్కువ కుంగదీసింది మా అన్నయ్యల ప్రవర్తన. ఈ విషయం తెలియగానే అందరూ కూడబలుక్కుని నాన్నమీదకు యుద్ధానికి వచ్చారు సన్నుకూడా అందులో కలవమన్నారు. లేకపోతే నాకూ భవిష్యత్తులేదని నచ్చచెప్పబోయారు నేను విన్లేదు. నాకు మా నాన్నను గురించి బాగ తెలుసు. నేను చిన్నవాణ్ని కనుక, అమ్మలేదు కనుకా నాతో చాలా బాగా ఉండేవాడు నాన్న ఆయన స్వభావం నాకు బాగా తెలుసు. పిల్ల




# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక మీ ఆరాటం వేరేముంటుంది!

# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. అనేక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- సెవెహా రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత!**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత!!**



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

లకు ఏమీ లేకుండా చేయాలని ఆయనకెప్పుడూ లేదు. ఆయన ఏం ఖర్చుచేసినా, ఎంతఖర్చు చేసినా మా చదువులకూ, మమ్మల్ని అందరిలోనూ మంచిగా నిలబెట్టడానికే చేశాడు. ఆ డ్రింక్ ఒక్కటితప్ప ఆయనకు వేరే దురలవాట్లు కూడా ఏమీలేవు. ఇవన్నీ తెలుసో తెలియదో లేక ఉన్న ఆస్థి అంతా ఇక ఆయన వైద్యానికే పోతుందని భయపడ్డారో, వాళ్ళమనసుల్లో ఏముందోగానీ అందరూ వచ్చి ఆస్తి పంచివ్వమని పంచాయతీ పెట్టారు.

ఆరోజు నాకు బాగా గుర్తు ... నా చేతుల్లో మొహం దాచుకుని భోరుమని ఏడ్చాడు నాన్న. బాంకునుండి అప్పులన్నీపోగా వచ్చింది చాలా చిన్నమొత్తం. తాకట్టులో వున్నపొలం విడిపించటానికి సరిపోయింది. జరుగుతున్నదానికే కుంగిపోయిన నాన్న పంపకాలకోసం పెద్దమనుషులెవర్నీ పిలవలేదు. తన కొడుకుల నిర్వాకం వాళ్ళకూ తెలిపి మరింత అవమానం పొందడమేతప్ప మరేం లేదనుకున్నట్లున్నాడు.

"అప్పటివరకూ అమ్మిన ఆస్తుల తాలూకు లెక్కలన్నీ తీసి, అసలు తమ సంతకం లేకుండా అమ్మటమే తప్పని వాదించారు. మనుషులంటేనే అసహ్యం కలిగేట్లు చేశారు. నా అన్నల్లో అంత స్వార్థం వున్నదనీ, వాళ్ళు అంత ధూర్తులనీ నాక్కూడా తెలియదు. ఇంకా అప్పటివరకూ బాంకు అద్దెకడుతూండిన ఇంట్లో, అద్దె మేమే చెల్లిస్తూవున్నాం. ఇదంతా జరిగిన తరువాత నాకూ, నాన్నకూ కలిసి రెండున్నర ఎకరాల పొలంమాత్రం వచ్చింది. ఏదైనా చిన్న ఇంట్లోకి మారిపోవటం మంచిదని నాన్నకు సూచించాను నేను. ఇంట్లో సామానంతా సరిపోదు, అంతమాత్రం ఇల్లు లేకపోతే. అందుకని అవన్నీకూడా తీసుకుపొమ్మని చెప్పగానే దాదాపు పూచికపుల్లకూడా వదలనట్టు అన్నీ తీసుకెళ్ళిపోయారు. రెండు క్యాంప్‌కాట్‌లూ, స్టీరియో టూ ఇన్‌వన్‌నూ, స్కూటరుమాత్రం ఇవ్వనని నేను ఖచ్చితంగా చెప్పటంతో అవి మాత్రం వదిలేశారు.

మేం చిన్నఇంట్లోకి మారిపోయాం. ఈ గొడవల్లో నేను కాలేజీలో చేరలేదు. మళ్ళీ అడ్మిషన్లు ప్రారంభం అవటంతో బియ్యేలో చేరాను. కానీ నాన్నకు జబ్బుతీవ్రంకావటంతో చదువుసాగలేదు. ఇల్లు గడవటంకోసం అప్పటికే పొలం అమ్మి డబ్బు బాంకులో వేశాడు నాన్న. నెలనెలా ఐదొందలు వడ్డీ వచ్చేది. మళ్ళీ ఒకసారి నాన్నను రాయవేలూరు తీసుకెళ్ళాను. ఫిక్సడ్ డిపాజిట్‌పైన అయిదువేలు అప్పుతీసుకుని, రెండుమూడు సంవత్సరాలు అక్కడే వుంచితే నయమవుతుందని నమ్మకంగా చెప్పారు. నాన్న వద్దన్నారు. ఆ వయసులో ఎలాగూ పోవాల్సిన తనకోసం నాభవిష్యత్తు పాడుచేసుకోవద్దన్నారు.

విజయా ... రెండేళ్ళ పరిచయం మనది. ఈ మాత్రానికే నేను ఒకపూట అన్నం తినలేదని నువ్వు విలవిల్లాడిపోయావే, అలాంటిది నాన్న నాకున్న ఒకే ఒకదిక్కు -- జబ్బుతో చనిపోతుంటే ఎలా వుండగలను చెప్పు. మానాన్నకు తగ్గితే, ఆ తరువాత నేను ఎలాగోలా బతకగలను అంతే నిశ్చయించుకున్నాను. ఆయనెంత చెప్పినా విన్లేదు. బ్యాంకులో డబ్బులన్నీ తీసుకున్నాను. స్కూటర్‌తోసహా యింట్లో వస్తువులన్నీ అమ్మేశాను. నాన్నను తీసుకుని శానిటోరియంకు వెళ్ళాను. వాళ్ళు బొంబేకు తీసుకెళ్తే మరింత మంచిదన్నారు. అక్కడికీ తీసుకెళ్ళాను. నాన్నకు వైద్యం చేయించలేననే బాధ నాకు కలిగించకుండా, తన ఒక్కకొడుకైనా తనను ఆదుకున్నాడన్న సంతోషం నాన్నకు మిగిలిపోయేట్టూ, అది ఆయన అదృష్టమో, నాదురదృష్టమో బాగానే కోలుకుంటున్నాడనుకుంటుండగా హఠాత్తుగా పోయాడు నాన్న. అన్నయ్యలకూ, అక్కలకూ అందరికీ టెలిగ్రాంలిచ్చాను. తండ్రి కడసారి చూపులకు బొంబాయిదాకా వచ్చేంతతీరిక కూడా లేదేమో- ఇద్దరన్నయ్యలూ, చిన్నక్కా, బావా వచ్చారు. మిగతావాళ్ళు రాలేదు. అక్కడే అంత్యక్రియలు పూర్తిచేశాం. చిన్నక్క తనదగ్గరకొచ్చి కొంతకాలం వుండమంది. మాటవరసకు అన్నలుకూడా అన్నారు. నాకు వెళ్ళబుద్ధి కాలేదు.

నాన్నపోయేసరికి ఒంటరివాణ్ణయిపోయాను. నాన్నతో వుంటూ, కాలక్షేపంకోసం పత్రికలూ, నవలలూ చదవటం బాగా అలవాటయింది. ఈమధ్యలోనే పత్రికలకు కథలూ,




వ్యాసాలూ రాశాను. కొన్ని వేసుకున్నారు కూడా. అలా ఈ రంగంలోకొచ్చాను. ముందుగా బొంబాయిలో అన్నయ్యలూ, అక్కా వెళ్ళిపోయిన తరువాత ఓ నాలుగురోజులు పిచ్చిపట్టినట్టుగా బాంబే అంతా తిరిగాను. అక్కణ్నించి దొరికిన రైలల్లా ఎక్కి, ఎక్కడో అక్కడ తిరుగుతూ ఓ నెలరోజులు గడిపాను. హఠాత్తుగా నావనినాకే బాగాలేదనిపించింది. ఏదోఒకటి చేసి బతకొచ్చు. అప్పుడే ఈవిధంగా బతుకుదామని నిర్ణయించుకున్నాను. బహుశా, మానాన్నకు ఎదురైన అనుభవంవల్లనేమో, ఉద్యోగం చేయాలంటే మనసొప్పుకోక ఏంచేసినా స్వతంత్రంగానే చేసుకోవాలనుకున్నాను. నాలుగైదురోజులు మద్రాసు బీచ్‌లోకూర్చుని ఆలోచించుకున్న తరువాత తిన్నగా రైలెక్కి ఇక్కడికొచ్చాను''

ముగించాడు గౌరీశం.

అసలు కష్టాలు లేనివాళ్ళంటూ ఎవరైనా వున్నారా...ఎవర్నిచూసినా డబ్బులేకనే కష్టాలు, డబ్బుకోసమే కష్టాలూ తాపత్రయం. డబ్బున్న వాళ్ళకు కష్టాలంటూ వుండవా, ఉంటే అవెలా వుంటాయో...బంధాలూ, అనుబంధాలనూ తలదన్నే ప్రేమ డబ్బుమీద...ఎందుకిలా వుందీలోకం...డబ్బులేకపోవటం వలన తాము ఎదుర్కొన్న సమస్యలు అనుభవించటంవల్లనో, ఇలా ఇతరులు ఎదుర్కొన్న కష్టనష్టాలను తెలుసుకోవటంవల్లనో... ఆ డబ్బు సంపాదన కోసం ఏ దారైనా తొక్కడానికి సిద్ధపడి, ఏ జీవితాన్ని ఆనందంగా గడపడానికి డబ్బు సంపాదించాలనుకుంటారో, అదే జీవితాన్ని డబ్బు సంపాదనలోపడి అస్తవ్యస్తంచేసుకుంటుంటారు కొందరు! డబ్బు, ఎంత శక్తిమంతమైనదీ ప్రపంచంలో-ఆలోచించసాగింది విజయ.

ఆలోచనల్లోంచి తేరుకున్న తరువాత, ఏంమాట్లాడాలో తోచలేదు విజయకు. అలుముకున్న ఇబ్బందికరమైన పరిస్థితిని పారదోలటానికి వేరే టాపిక్ ఎత్తాలనుకుంది. అంతలో హఠాత్తుగా అన్నాడు గౌరీశం-

''మా అమ్మానాన్నలు పేపర్లో నాఫొటో వేయిస్తారని ఇక ఎదురుచూడకు ''-అని నవ్వుతూ.

విజయ నవ్వేసింది.

★ ★ ★

మరునాడు పొద్దున్నే ఏదో మిషమీద వచ్చి, కాసేపు కూచున్నాడు మనోహర్. విజయ్ ఒక్కతే వున్నప్పుడు హఠాత్తుగా చెప్పాడు-

''సాయంత్రం అరుణక్క నొక్కదాన్నే తీసుకుని, సినిమాకని చెప్పి, ఓ గంట ముందుగా పార్క్‌దగ్గరికి రా''

''అదేమిటి....'' ఏదో అనబోతున్న విజయను మధ్యలోనే ఆపేసి,

''ఇప్పుడేమీ అడక్కు. సాయంత్రం చెబుతాను. సరిగ్గా అయిదింటికి రండి'' అన్నాడు.

విజయకు అంతా అయోమయంగా వుంది. మనోహర్ వెళ్ళాక కూడా ఆలోచిస్తూనే వుంది. కాలేజీకి వెళ్ళేముందు, ''ఫస్ట్‌షో సినిమాకు వెడదాం ఎక్కడికీ వెళ్ళకు'' అని అరుణకు చెప్పి బయలుదేరింది. ఎన్నడూలేంది విజయ తనంతతాను సినిమాకు వెళ్దామనేసరికి ఆశ్చర్యపోయింది గానీ, నాలుగింటికి విజయ వచ్చేసరికి ముస్తాబై కూర్చుంది.

''సినిమాకని పార్కులోకెందుకే'' దార్లో అడిగింది అరుణ.

''మనోహర్ కూడా వస్తానని ఇక్కడికి రమ్మన్నాడు. నా అనుమానం మనక్కాబోయే వదినను చూపిస్తాడని''

''దానికింత రహస్యమెందుకు?''

''అది తనే చెప్పాలి. చూద్దాం ఏమిటో'' అంది విజయ.

పార్కులో మనోహర్ ఒక్కడే కూర్చున్నాడు. ముగ్గురూ కలిసి కాస్సేపు అదీ ఇదీ మాట్లాడుకున్నాక, మనోహర్ ఒక హాస్పిటల్ స్లిప్ లాంటిది తీసి, విజయచేతిలో పెట్టాడు. స్లిప్ పైన పేరు చూసి,

''సంధ్య... ఎవరునాయనా ఈ సంధ్య. ఏమిటీ స్లిప్పు'' అంది విజయ నవ్వుతూ.

''సంధ్యకాదు అరుణ. అది నిన్న మనం వెళ్ళిన పేథాలజీల్యాబ్‌స్లిప్. నేనే పేరు మార్చి రాయించాను''

వెంటనే కింద చూసింది విజయ-

''ప్రెగ్నెన్సీ టెస్ట్- పాజిటివ్... అంటే, అరుణక్క...''- అని విజయ అంటూండగా అరుణ

కూడా తీసుకుని చూసింది.

"ఇదెలా జరిగిందో, ఇప్పుడేం చెయాలో నాకేం పాలుపోవటంలేదు. మీరిద్దరూ మాట్లాడుతూండండి. నేను సిగరెట్స్ కొనుక్కుని వస్తాను" అంటూ, లేచి వెళ్ళిపోయాడు మనోహర్.

"ఏంటిది అరుణక్కా. ఎలా జరిగింది. అసలు.... అసలిది నిజమేనా?"

విజయ మాటలు పూర్తికాకముందే, అరచేతుల్లో మొహం దాచుకుని భోరున ఏడవసాగింది అరుణ.

వాళ్ళు కూర్చున్న స్థలంలో గుబురుగా పొదలున్నాయి. పార్కులో జనం ఇంకా నిండలేదు. అంచేత ఇది ఎవరికంటా పడే అవకాశంలేదు. ఏడుస్తున్న అరుణని ఓదార్చలేదు. కాసేపు ఏడిస్తే మనసుతేలిక పడుతుందని ఊర్కుంది విజయ. రెండుమూడు నిమిషాలకు అరుణ కూడా ఆపేసింది. కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకుని, ముక్కుచీదేసింది. మోకాళ్ళలో తలపెట్టుకుని, చూపులు వాల్చి కూర్చుంది. అప్పుడడిగింది విజయ-

"మనోహర్ చాలా మంచిపనిచేశాడు. ఇంట్లో ఐతే మాట్లాడుకోలేం. అమ్మానాన్నలకు తెలిస్తే వాళ్ళ గుండె బద్దలవుతుంది. నాతో చెప్పుకోవటానికి సిగ్గెందుకు. వున్నదున్నట్టు చెప్పు. ఏంచేయాలో తర్వాత ఆలోచిద్దాం... చెప్పు.... ఎవరు?"

"అంతా నా ఖర్మనుకో. నన్నేమీ అడగొద్దు నేనేమీ చెప్పను" జీరవోయిన గొంతుతో బదులిచ్చింది అరుణ.

"ఎవరతను, బ్రహ్మచారా? పెళ్ళయినవాడా నాకు తెలిసినతనేనా, పెళ్ళిచేసుకుంటాననన్నాడా?" అనునయంగా అడిగింది విజయ.

"నన్నేమీ అడగొద్దు... నేను చెప్పను. నీకు చేతనైతే ఈ గండం గట్టెక్కేమార్గం చెప్పు లేదా ఏంచేయాలో నాకు తెలుసు"

"ఈ గండం గట్టెక్కాలనే అడుగుతున్నానక్కా. ఎవరైనా పెళ్ళిచేసుకుంటానని నమ్మించి మోసం చేశారా? అసలు సంగతిచెప్పు. ఆలోచిద్దాం. నా గురించి తెలుసుకదా నీకు. అమ్మానాన్నలకు కూడా ఈ విషయం తెలియకుండా నీకు మచ్చరాకుండా చేద్దాం... చెప్పక్కా"

"నీ విషయం నాకు తెలుసు. కానీ ఎవ్వరూ ఏమీ చేయలేరు. నన్నేమీ అడగొద్దు"

"మరి... ఎవరైనా సినిమాల్లో ఛాన్సిస్తానంటే..." విజయమాట పూర్తికాకముందే.

"ఛీ" అంది అరుణ.

"ఎవరో చెప్పక్కా... నేనెవరికీ చెప్పను నాకు కాక ఇంకెవరికి చెప్పుకుంటావు?" అనునయంగా అడిగింది.

అరుణ అప్పటికీ మాట్లాడలేదు.

"ఎవరైనా పెళ్ళయిన వాడయితే నువ్వు మాత్రం ఎలానమ్మావు?"

"వద్దు... నన్ను ఏమీ అడగొద్దు"

"అతను పెళ్ళికి ఒప్పుకోడని భయమా, అది నేను చూసుకుంటానుకదా. పోనీ ఎందుకొప్పుకోడో చెప్పు. పేరు చెప్పొద్దు అదైనా ఆలోచిద్దాం"

ఇక విజయ వదిలేట్టులేదనుకుని చెప్పింది అరుణ-

"నిజం చెప్పాలంటే అతని తప్పులేదు. తప్పంతా నాదే. ఎంతైనా కొన్నాళ్ళు కాపురం చేసిన దాన్నికదా, ఏదో బలహీనక్షణంలో నేనే అతన్ని ప్రేరేపించాను. ఇక వదిలెయ్యి విజయా, ప్లీజ్"

"సరే... నువ్వు ఎందుకు చేసినా నువ్వు ప్రేరేపించేవరకూ అతనేమీ చేయలేదంటున్నావు కదా పోనీ అంతమంచివాడైనా మొత్తానికి అతనికీ భాగం వుంది కదా. అతను పెళ్ళిచేసుకోనన్నాడా- నేనడుగుతాను. నేను చెప్పిస్తాను"

"నేను చేసుకోను- అతనూ చేసుకోడు ఇంకేమీ అడగొద్దు"

ఇక విజయ ఎన్నిరకాలుగా అడిగినా చెప్పలేదు అరుణ. అబార్షన్ ఒక్కటే మార్గం అని నిశ్చయించుకుంది. కాస్సేపటికి మనోహర్ వచ్చాడు. మనోహర్ కూడా ఎంత ధైర్యం చెప్పినా ఒప్పుకోలేదు. మరేమీ చెప్పలేదు. తనకన్నా ఇద్దరు చిన్నవాళ్ళముందు జరుగుతున్నదంతా చూస్తుంటే సిగ్గుతో చచ్చిపోవాలన్పించింది అరుణకు. ఏమీ చేయలేక ఏడుస్తూ కూర్చుంది. చివరకు ఇంట్లో ఎవరికీ చెప్పకుండా అబార్షన్ చేయించాలని నిశ్చయించు




కున్నారు. రెండ్రోజుల తరువాత నర్సింగ్‌హోమ్‌లో మారుపేరుతో అబార్షన్‌కు ఏర్పాటుచేశాడు మనోహర్. అబార్షన్‌కు వెళ్ళేముందు కూడా ఎంతో ధైర్యం చెప్పి, చివరిసారిగా ప్రయత్నంచేసింది విజయ, ఎన్నో విధాలుగా అడిగి. అరుణ పెదవి కదపలేదు. అబార్షన్ అయిపోయింది. ఇంట్లో పెద్దలకు తెలియకుండా జరిగిపోయిన ఘోరం కంటే, అసలేమయిందన్న విషయం విజయను బాగా కలవరపెట్టింది. అరుణ చెప్పినట్టు- ఏదో బలహీనక్షణంలోకాక, మరోవిధంగా అయితే, అసలే సినిమా రంగానికి ఉరకలు వేస్తున్న అరుణ ఏమైపోతుందోనని కలవరపడింది విజయ. ఏమీ చేయలేక ఊర్కుండిపోయింది.




**తొ**మ్మిదోక్లాసులో చేరిన దగ్గర్నించీ శ్రీనివాస్‌కి చదువుమీద శ్రద్ధ ఎక్కువయింది. పదోక్లాసు పబ్లిక్‌పరీక్షలో, రెండుక్లాసులవీ కలిపి అడుగుతారని ఎవరో చెప్పటంతో ఎప్పటికప్పుడు, చెప్పినవి చెప్పినట్లుగా ఇంట్లోకూచుని దీక్షగా చదువుకోవటం మొదలెట్టాడు. స్కూల్లో చెప్పే ఇంగ్లీష్‌పాఠాలు అర్థంకాకపోవటం ఒకటీ, పైగా వాళ్ళ క్లాసులోనివాళ్ళు చాలామంది ట్యూషన్‌కు వెళుతూండటం ఒకటీ-శ్రీనివాస్‌కి ాడా ట్యూషన్‌కు వెళ్ళాలనే ఆలోచనను కలి ుచాయి. తండ్రినడిగాడు అదేవిషయం.

"ట్యూషన్ ఎందుకురా... బుద్ధిగా బళ్ళో ప్పింది విని ఇంట్లో చదువుకోక"

"ఇంట్లో చదువుకోవటానికి ఇదేమైనా తెలుగా?"

"ఏదైతేఏంరా... ట్యూషన్‌ఫీజు యాభైరూపాయలు. నెలనెలా ఎక్కణ్ణించి తెస్తాం?"

ఎక్కణ్ణించి-అంటే ఏంచెప్పగలడు.

ఇలా లాభంలేదని అన్నయ్యనడిగాడు, ఎలాగోలా గొంతు పెకిలించుకుని.

"విజయను పిలువు" అన్నాడు నారాయణ.

వెళ్ళి పిలుచుకొచ్చాడు.

"వాడు ట్యూషన్‌కు వెళ్తాడట... ఏంచేద్దాం?"

"ట్యూషన్ ఎందుకురా, ఏ సబ్జెక్టు?"

"ఇంగ్లీష్"

"ఇప్పుడేం అవసరమొచ్చింది?"

"అర్థంకావటంలేదు. టెన్త్‌పరీక్షలో ఇవికూడా అడుగుతారట"

"నీ మొహం ఎవరు చెప్పారు? అదేంలేదు"

"నీకేంతెలుసు- ఐనా నేను ట్యూషన్‌కు పోతాను"

"ఇంతకూ ఏమంటావే నువ్వు?"

"వాడివన్నీ అక్కర్లేనిపనులుగానీ, నువ్వెళ్ళు అన్నంతిను- రాత్రయిపోయింది" చెల్లెలి మాటవినగానే నారాయణ లేచి, వంటింట్లోకి నడిచాడు-

"దానిష్టంరా- నాకేంతెలుసు" అంటూ.

"నీకేమైనా తెలియకపోతే నేను చెబుతున్నానుకదా! ఈ నైన్త్ హాలీడేస్‌లో స్కూలుతెరిచేలోపు టెన్త్ ఇంగ్లీష్‌పాఠాలన్నీ చెబుతాను"

"నీకెందుకే మధ్యలో. నేను కావాలని ఫెయిలవుతాను చూడు" నిస్సహాయతతో కోపంగా అన్నాడు.

"కావాలని ఫెయిలయినా, నిజంగా ఫెయిలైనా అసలు ఫెయిలంటూ అయ్యావనుకో..."

"ఏం... సుధన్నయ్యకాలేదా టెన్త్‌కూడా"

"ఆ మహానుభావుడు టెన్త్‌పరీక్షలప్పుడు జ్వరమొచ్చి రాయలేదు. ఇక ఇంటర్‌లోనా- ఆయన్నేనా నువ్వు ఆదర్శంగా తీసుకునేది. మరి నేను ఫెయిలయ్యానా?"

"మీ బళ్ళోలాగా చెబుతున్నారా మాబళ్ళో. ఐనా నువ్వువేరు, నేనువేరు. నన్ను ఇప్పుడు ట్యూషన్‌కు పంపకపోయావో, నేను ఫెయిలై

చూపిస్తాను"

"అదే చెబుతున్నాను. నువ్వు ఫెయిల య్యావో, మళ్ళీ ఫీజుకట్టడంలేదు. ఏ సైకిల్‌షా పులోనో చేర్పించటమే"

"ఊ... సైకిల్‌షాప్‌లో చేర్పిస్తావ్, అసలు నీపెళ్ళిచేస్తే నువ్వే పోతావ్"

"ఒరేయ్- మొద్దువెధవా! నాపెళ్ళిచేసే టంత మొనగాడివి కావాలంటే, మంచి ఉద్యో గంచేసి బాగా సంపాదించాలి. మరి అందు కని ముందు బాగా చదువుకోరా గాడిదా" అంటూ వెళ్ళిపోయింది విజయ.

ఇంకేమీ అనకుండా నిద్రకుపక్రమించాడు. దుప్పటితీసి కప్పుకుని, ముఖంపైకి లాక్కున్నా డు. కాళ్ళుదాటి చీలమండలదాకా వచ్చింది. కాళ్ళతో కిందికి తన్నుకున్నాడు. మొహం మీంచి కిందికొచ్చి, గొంతుదగ్గరకొచ్చింది. చాలా చిరాకేసింది.

"అమ్మా... ఈ దుప్పటి సరిపోవటంలేదే"- అరుద్దామనుకున్నాడు. కానీ కాస్త పెద్దవాడ య్యాడుకదా. అరవలేదు. ముడుచుకుని పడు కున్నాడు.

అసలు విజయక్క చెప్పినమాటకూడా నిజమే. తను బాగా చదువుకోవాలి. మంచి ఉద్యోగం సంపాదించుకోవాలి. అప్పుడిహ నాన్ననూ, అన్నయ్యనూ, ఎవర్నీ ఏమీ అడగన వసరంలేదు. టేప్‌రికార్డర్ కొనుక్కోనవచ్చు. ఫాన్‌కూడా కొనాలి. అప్పుడు నాలుగైదు స్వెట్ట ర్లు కొనాలి. చలికాలంలో ఆఫీసుకు రోజుకోరకం స్వెట్టర్‌వేసుకుని వెళ్ళాలి. అమ్మకూ, నాన్నకూ, అన్నకూ, అరుణక్కకూ, విజయక్కకూ అందరి కీ తలా ఓ బ్లాంకెట్‌కొనాలి. ఇంకోనాలుగు ఎక్కువకూడా కొనిపెట్టాలి. హఠాత్తుగా ఎవరైనా చుట్టాలొచ్చినా, ఎవరి బ్లాంకెటైనా ఎలుకలు కొట్టినా మళ్ళీ ఇబ్బందుండదు. ఆలోచనలతో శ్రీనివాస్‌కి నిద్రపట్టలేదు.

* * *

గౌరీశం రాసిన నవల సీరియల్‌గా మొదల వగానే, సీరియల్స్‌చదవటం అలవాటులేని విజయకూడా చదవటం మొదలెట్టింది. రెండో పార్టు పూర్తయ్యేసరికి విజయకు కోపంవ చ్చింది. మూడోపార్టు చదవగానే ఇక ఆగలేక గౌరీశం గదికెళ్ళింది-

"ఇదేనా మహాప్రభూ... తమరు రాస్తున్న అపూర్వమైన సీరియల్! ఆడవాళ్ళమీద తమ కున్న బ్రహ్మాండమైన అభిప్రాయాలు ఇవేనా?" కోపంగా అడిగింది.

"అదికాదు విజయా... పూర్తిగా చదివాక నేను చెప్పదలుచుకున్నది తెలుస్తుంది"

"ఈ దిక్కుమాలిన నవల ఇంకా పూర్తిగా చదవాలా... ఛస్తే చదవను. ఈ మాత్రమైనా బుద్ధితక్కువై చదివాను. అసలు నీసబ్జెక్టేమిటి, అందులో మధ్యలో ఈ క్రైం ఎందుకు, ఈ ఛండాలమైన రాతలెందుకు? నీలో మంచి రచనాశక్తివుంది. దాంతో పాఠకుల్ని ఆకట్టుకు నేందుకు కృషిచేయమన్నాను కానీ, వాళ్ళు ఏంచదువుతారో అలా రాయడమా గొప్పదనం. ఇది చదివితే పెళ్లికాని ఆడవాళ్లు ఎలా బతు కుతున్నారో పాఠకులకు తెలిసేసంగతి అటుంచు, తమకు తెలియనివన్నీ తెలిసి, అలాంటి అమ్మాయిలు తప్పుదారి తొక్కితే..."

ఈమాట వినగానే ఎందుకో గౌరీశం మొహం నల్లగా మాడిపోయింది. అంతలోనే తేరుకుని అన్నాడు--

"నైన్టీనైన్ పర్సెంట్ రచయితలు ఇవే రాస్తు న్నారు. నా ఒక్కడివల్లా ప్రత్యేకంగా జరిగే అపకారం ఏం వుంటుంది?"

"అపకారం సంగతి అటుంచు. నైన్టీనైన్ పర్సెంట్‌ని నువ్వు సెంట్‌పర్సెంట్ చేయడం ఎందుకు. ఇంతకన్నా..."

"అదికాదు..."

"వద్దు... ప్రతివాడికీ తన సమర్థనలు త కుంటాయి. నేను వినదల్చుకోలేదు. మళ్లీ రచనల గురించి మాత్రం నాకెప్పుడూ చెప ద్దు" అంటూ, ఆ పత్రికనక్కడ విసిరే గిరుక్కున వెనుదిరిగి వెళ్లిపోయింది విజయ

నిశ్చేష్టుడయ్యాడు గౌరీశం.

తన సీరియల్ విజయకు నచ్చదనుకున్నా డు కానీ, ఆమెకు అంతగా కోపం వస్తుందని ఊహించలేకపోయాడు. ఎప్పుడో తీరిగ్గా నచ్చ జెప్పవచ్చుననుకున్నాడు. అయితే ఆ సీరి యల్ విజయకు నచ్చలేదు కానీ, అది బ్ర హ్మాండంగా హిట్టయింది. మూడునెలలు తిరి




గనుక అప్పటికి ఎంతో జనాదరణగల ఆ పత్రిక సర్క్యులేషన్ మరికొంత పెరిగింది. ఈలోపల తమకో సీరియల్ రాయమని రెండు పత్రికల సంపాదకులు అభ్యర్థించారు గౌరీ శంని. సీరియల్ పూర్తయిన తరువాత వెయ్యి రూపాయలిస్తామన్న ఈ పత్రికవాళ్లేమో పూర్తవకముందే రెండువేల రూపాయలిచ్చి, పూర్తయినాక తమ శక్తికొద్దీ ఇస్తామని హామీ ఇచ్చారు. మరో సీరియల్ వెంటనే ఇమ్మన్నారు. ఓ పుస్తక ప్రచురణసంస్థ వారు ఆ సీరియల్‌ని నవలగా ప్రచురించేందుకు గౌరీశంతో ఒప్పందం కుదుర్చుకుని, అడ్వాన్సుగా మూడువేలు కూడా ఇచ్చారు.

ఆ సీరియల్ ప్రారంభమైన నాలుగునెలల కల్లా గౌరీశం చిన్నగది స్వరూపం మారిపోయింది. స్టూలు కిటికీ ముందేసుకుని, ప్యాడ్ పైన రాసుకునే వాతంతకుముందు. అలాంటిది గాడ్రెజ్ టేబుల్, చెయిర్ వచ్చాయి. ఫ్యాన్ వచ్చింది. ఒక పుస్తకాల షెల్ఫ్, దాన్నిండా పుస్తకాలొచ్చాయి. చాప మూలకెళ్లి మంచం వచ్చింది. టేబుల్‌పైన పెద్ద యాష్‌ట్రే, ఒక ఫ్లాస్కూవచ్చి చేరాయి. కానీ ఈ నాలుగునెలల్లో అతనితో విజయ మాట్లాడింది మళ్లీ మూడేమూడుసార్లు. అదీ గౌరీశం వెళ్లి పలకరిస్తేనే.

"మీరు ప్రొఫెషనల్ రైటర్ అవుతానంటే వద్దన్నాను. ఈ పంథాలోకి వస్తానని మీరు అప్పుడనలేదు. అందుకే కమిటెడ్ రైటర్‌గా కష్టమన్నాను. ఇదేదో అపుడే చేసివుంటే బాగుండేదేమో ఇది మంచిదా, కాదా అని నేను చర్చించను. ఇంకా మా పత్రికకు రాసేంత తీరిక వుందంటే నాకాశ్చర్యం వేస్తూంది. మరో రెండు, మూడునెలల తరువాత మాత్రం ఇంత తీరిక వుంటుందనుకోను. ఏమైనా ఒకమాటమాత్రం చెబుతాను ఎప్పుడెలా ట్రెండ్ మారుతుందో చెప్పలేం. సంపాదనంతా జాగ్రత్తగా ఇన్‌వెస్ట్‌చేసుకోండి. ఉద్యోగం వేయదలచనివాళ్లకు అది తెలిసుండాలి" అన్నాడు 'సమీర' సంపాదకుడు.

★ ★ ★

తను ఫొటోలు పంపిన విషయం దాదాపు మరచిపోయిన అరుణకు, ఇంటర్వ్యూకు హాజరుకమ్మని కబురొచ్చింది. అది చూడగానే ఎగిరి గంతేసింది. ఇంటర్వ్యూ జరిగేది వేరే ఊళ్లో కాదుకనుక తల్లిదండ్రులకు చెప్పాల్సిన పనిలేదు.

ఇంటర్వ్యూలో ఏమేం అడుగుతారో రమేష్‌నూ, సంపత్‌నూ అడిగి తెలుసుకుంది. కొన్ని సినిమాల్లోనివి, డ్రామాల్లోనివీ డైలాగులు రాసుకుని బట్టీపట్టింది. అటూ, ఇటూ తలుపువేసుకుని, మధ్యగదిలో నిలువుటద్దం ముందు నిలుచుని, ముఖకవళికలు మరీ మరీ ప్రాక్టీస్ చేసింది. సంపత్‌వాళ్ల సమాజం గదిలో డైలాగులు పలికేవిధానం క్షుణ్ణంగా నేర్చుకుంది. ఆ పదిరోజులూ వీలైనంతవరకూ బైటతిరగకుండా జాగ్రత్తపడింది. ఇష్టంలేకున్నా సుష్టుగా భోంచేసి, హాయిగా పడుకుంది-- అందంకోసం. తనకున్న చీరల్లోకెల్లా బాగున్న డార్క్‌గ్రీన్ కలర్ గార్డెన్ సిల్కుచీరను డ్రైక్లీనింగ్‌కువేసి, రెడీగా అట్టిపెట్టుకుంది. ఈ హడావిడి అంతాచూసి, విజయ కనిపెట్టేసింది--

"ఎందుకే ఈ హడావుడి అంతా సినిమా ఇంటర్వ్యూకేనా?"

"అబ్బ... ఎట్లాకనిపెట్టావే?"

"అదేదో సామెత చెప్పినట్లు, శుక్రవారం ఇంటర్వ్యూ వుంది. మరి నీ జాతకంలో హీరోయిన్ అయ్యేయోగం వుంది. ఇంకేముంది?" నవ్వింది.

చెల్లెలి మాటలు అరుణకు చాలా సంతోషం కలిగించాయి.

"నీమాట చలువతో నేను సెలెక్ట్‌కావాలికానీ నీకు బంగారు కాలిపట్టాలు కొనిపెడతాను"

రెండునిమిషాలు మౌనంగా వుండిపోయింది విజయ.

"అక్కా... ఒకమాట చెబుతాను ఏమీ అనుకోకు..." ఆగింది విజయ.

ఏమిటని అరుణ అడగలేదు. విజయే చెప్పింది.

"జరిగింది మళ్లీ గుర్తుచేసి, నిన్ను బాధపెట్టాలనికాదుగానీ ఒకసారి ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో వదిలేయ్. సినిమా మోజులోపడి తెలిసో, తెలియకో మళ్లీ అలాంటిది జరగనీ

యకు. నీకు మంచీ చెడూ తెలుసు. అంతక న్నా ఏమీ చెప్పలేను'' ఈమాటనేసి వెళ్లిపో యింది.

అసలు వెళ్లొద్దనిచెప్పి లాభంలేదన్న విషయం విజయకు తెలుసు. దరిద్రపుఎడారి లోని మనిషికి అక్షయ జలనిధుల ఛాయ కనిపిస్తుంది. వెళ్లొద్దని చెబితే ఎందరు వింటా రు? ఇక్కడి చెంబుడునీళ్లూ వదులుకుని పరి గెత్తాక అది ఎండమావే అవుతుందో, ఒయా సిస్సే అవుతుందో.



ఎదురుచూసిన శుక్రవారం రానేవచ్చింది. తెల్లారింది కూడా. పదిగంటలు కూడా అయ్యేటట్టువుంది. అమ్మో... ఇదంతా నిజమే! బాలాజీ మందిరానికెళ్లి పూజచేసివచ్చింది. తొమ్మిదయ్యేసరికి తన ముస్తాబు ఎవరికంటా పడకుండా జాగ్రత్తపడి, వంటింట్లో వున్న తల్లికి గుమ్మంలోంచి చెప్పి చప్పున బైటపడింది.

వీధి మలుపుతిరిగేసరికి అక్కడి హోటల్ ముందర సంపత్, రమేష్ మాట్లాడుకుంటూ నిలుచున్నారు. అరుణను చూడగానే వచ్చేశారు. ఆటో తీసుకుని వెళుతుండగా, మధ్యలో ఆపి, ''ఒక్కక్షణం'' అంటూ, ఫాన్సీ షాప్‌లోకి దూకింది అరుణ. రెండునిమిషాల్లో తిరిగొచ్చింది. ఏమిటని— ఇద్దరూ అడిగితే ఏమీ చెప్పకుండా చిరునవ్వు నవ్వి ఊరుకుంది. ఇంటర్వ్యూ వున్న హోటల్ దగ్గరికెళ్లేసరికి తండోపతండాలుగా జనం. హోటల్‌గేటు దగ్గర గట్టి పోలీసు బందోబస్తు వుంది. కంపెనీ వాళ్ల మనుషులిద్దరు నిలుచుని, తాము పంపిన కాల్‌లెటర్స్‌చూసి లోపలికి పంపిస్తున్నారు. రమేష్, సంపత్ బయటేవుండాల్సి వచ్చింది. ఇద్దరూ ''బెస్టాఫ్ లక్'' చెప్పారు.

లెటర్ చూపించి గేటుదాటి లోపలికెళ్లింది. మొదటి అంతస్తులోవున్న గది ముందర కొందరు సినిమా కంపెనీవాళ్లున్నారు. అక్కడే ఇంటర్వ్యూ జరుగుతూంది. గదిలో కూర్చున్న వాళ్లల్లోంచి ఒక్కొక్కర్నీ పిలిచి, లోపలి గదిలోకి పంపిస్తున్నారు. మళ్లీ కిందికి వెళ్లింది. టాయ్‌లెట్ గదిలోపలికెళ్లి అద్దంముందు నిలుచుని, ఒకసారి తన ముస్తాబువంక చూసుకుంది. హేండ్‌బ్యాగ్‌లో చేయిపెట్టి, ఫాన్సీ షాప్‌లో కొనుక్కొచ్చిన చిన్నఫోల్డర్ బైటకుతీసింది. అది తెరిచి, రెండువేలికొసల మధ్య జాగ్రత్తగా పట్టుకుని, నుదుటిమీద అతికించింది. ఆకుపచ్చరంగు కుంకుమ్ స్టిక్కర్‌తో అరుణ ముఖంలో కొత్తఅందం వచ్చింది. ఫోటోలుదిగినప్పుడు మరిచిపోయినందుకు తరువాత బాధపడిందికానీ, ఇంటర్వ్యూ కాల్ రావటంతో సంతోషించింది. ఓసారి బొట్టును సరిగా సర్దుకుని, బైటకొచ్చి మెట్లెక్కుతూ కిందకు చూసింది.

వివరీతమైన జనాన్ని కంట్రోల్‌చేయడానికి పోలీసులు చాలా తంటాలు పడుతున్నారు. పాపం అంతమంది నిలుచునుండగా, తను మాత్రం కాల్‌లెటర్ చూపించి, లోపలికి రాగలి గింది. గర్వంగా నవ్వుకుంది. ఒకరోజు తనను చూడటానికి, తను ఏ హొటల్లో దిగితే ఆ హొటల్ ముందు జనం ఇంతకన్నా ఎక్కువగా చేరతారు. అప్పుడు తను గదిలోంచి బాల్కనీలోకి వచ్చి, అందంగా నవ్వి, వయ్యారంగా చేతులు జోడించి నమస్కరిస్తుంది. హొటల్లోంచి బైటకొచ్చి కారెక్కుతుంటే ఆటోగ్రాఫ్‌ల కోసం ఎగబడే జనాన్ని పోలీసులు అదుపుచేస్తుంటే, తను దగ్గరికెళ్ళి కొందరికి ఆటోగ్రాఫులిస్తుంది. ఆ అదృష్టంకోసం తోసుకుని, తొక్కుకుని జనం ముందుకొస్తుంటారు. "ప్లీజ్... నాకు షూటింగ్‌కి టైమయింది. అవుట్‌డోర్ లొకేషన్‌కు రండి. అందరికీ ఆటోగ్రాఫ్‌లిస్తాను" అంటూ తను కారెక్కి వెళ్ళిపోతుంది. ఎలాంటి మెట్లు ఎక్కబోతుందో ఆలోచిస్తూ, ఒక్కోమెట్టూ ఎక్కసాగింది.

★ ★ ★

"అమ్మా... సుధాకరన్నయ్యొచ్చాడే" శ్రీనివాస్ అరుపుతో విజయ, అరుణ, జగదాంబ అందరూ బైటకొచ్చారు. అప్పటికే ఎయిర్ బ్యాగ్, సూట్‌కేస్ పట్టుకుని లోపలికొచ్చాడు సుధాకర్.

బ్యాగీషర్టు, జీన్స్‌పాంటు, షూస్, వత్తుగా పెరిగిన గడ్డం, మీసాలూ, మెళ్ళో ఒక స్టీల్ చెయినూ, కుడి చేతికి స్టీలు కడియం - వేషం పూర్తిగా మారిపోయింది.

"ఏరా... ఇన్నాళ్ళకు ఇల్లు గుర్తొచ్చిందా?"

"ఎక్కడికెళ్ళావురా ఇన్నాళ్ళూ?"

"ఏంటన్నయ్యా... ఉత్తరం కూడా రాయకుండా వచ్చేశావ్?"

—అన్నకీతల్లికీ, అక్కకూ, చెల్లికీ సమాధానాలు చెబుతూ, బూట్లు విప్పేశాడు. సూట్‌కేస్ తీయబోతున్న తమ్ముణ్ని వారించాడు.

"అందులో టేప్‌రికార్డరుంది. నేను తీసిస్తానుండు" అంటూ వెళ్ళి, టేప్‌బైటకు తీసి, ఒక కేసెట్, హిందీ పాటలది పెట్టి, సూట్‌కేసూ, బ్యాగూ పట్టుకుని లోపలకు నడిచాడు. శ్రీనివాస్ తప్ప అందరూ లోపలికి నడిచారు.

"ఏమిట్రా... చెప్పాపెట్టకుండా పారిపోయావు. ఏం చేస్తున్నావు. ఎక్కడుంటున్నావు?"

"అందుకే ఉత్తరం రాశానుకదే, అప్పుడే"

"టేప్ రికార్డరెవరిదిరా?" అడిగింది అరుణ.

"మనదే"

"నేషనల్ కదూ, అంత డబ్బెక్కడిదిరా?"

"నేషనల్ మాకు ఎంతకొస్తుందో చెబితే మూర్ఛపోతావ్. మేం అమ్మేదే వెయ్యి, రెండు వేలమధ్య. కొనేవాడి మొహాన్నిబట్టి వుంటుంది. మా బాస్‌కు చెప్పి మనకని తీసుకొచ్చాను. ఇదిగో ఇవి కూడా" అంటూ రెండు సిటిజన్ క్వార్జ్‌వాచీలు తీసిచ్చాడు.

అరుణ చప్పున తీసుకుని చేతికి పెట్టుకుంది. విజయ తీసుకోలేదు.

"నేనింత ప్రేమగా తెస్తే..." అలకమొహంపెట్టి అన్నాడు సుధాకర్.

"నన్ను గుర్తుపెట్టుకున్నావు. ప్రేమ వుందన్నావు. చాలన్నయ్యా... వాచీ ఎందుకు?" అంది విజయ.

జగదాంబ టీ కలుపుకొచ్చి ఇచ్చింది కొడుక్కి.

"నాన్నది ఏ షిఫ్టు?" అన్నాడు టీతీసుకుంటూ.

"ఇల్లు సంగతీ, మా కష్టాలూ అన్నీ నీకేం అవసరంరా. హాయిగా పోయి అక్కడ కూచున్నావు" నిష్టూరంగా అంది.

"అన్నయ్యా... టేప్‌కేమో అయింది చూడు, టక్‌మని ఆగిపోయింది" శ్రీనివాస్ పరుగెత్తుకొచ్చాడు.

"అది ఆటోస్టాప్‌రా దివానా... కేసెట్ అయిపోయి వుంటుంది అంటూ వెళ్ళి ఆపరేటింగ్ పద్ధతి చూపించాడు తమ్ముడికి.

"తెలుగు పాటలు లేవేరా సుధా?" అడిగింది అరుణ.

"అక్కడ దొరకవు. నీకు కావాలంటే రికార్డింగ్ చేయించుకో. నేను ఎంప్టీకేసెట్లిస్తాను" అంటూ బ్యాగ్‌లోంచి ఆరుకేసెట్లు తీసిచ్చాడు. పాటలున్న కేసెట్లు తమ్ముడికిచ్చాడు.




గౌరీశంను పలకరించి, తనుతెచ్చిన ఇంపోర్టెడ్ సిగరెట్ ప్యాకెట్ ఇచ్చాడు. కాస్సేపు మాట్లాడాడు. సాయంత్రం వచ్చిన నారాయణ, రాత్రివచ్చిన వెంకటేశం సుధాకర్ని చూసి ఆశ్చర్యపోయారు. అంతకుముందే మనోహర్ని కలుసుకునొచ్చాడు. తల్లికి నాలుగొందలు ఇచ్చాడు.

తమ షాపు మీద రైడింగ్ జరగటంతో తను తప్పించుకుని పారిపోయి వచ్చిన విషయం మాత్రం చెప్పలేదు. ఇలాంటివాళ్ళంతా మళ్ళీ మూడు నాలుగు నెలలకు అక్కడే చేరటమో లేక అంతవరకూ ఏర్పడిన పరిచయాలతో వేరే చోట పాలుపంచుకోవటమో చేస్తారు. ఎందుకంటే పట్టుపడకుండా పారిపోవటం ఆ ముఠాల దృష్టిలో ద్రోహంకాదు. మద్రాసులో వున్న మరో ముఠాతో ఓ రెండు నెలల్లో కలవాలని సుధాకర్ ఆలోచన.

మరునాడంతా ఇంట్లోనే వుండి, అందరితో ఢిల్లీ కబుర్లుచెప్తూ. వీలైనంతవరకూ తన వ్యాపారం సంగతులు రాకుండా జాగ్రత్తపడ్డాడు.

"బంగారంలాంటి ఉద్యోగం మానుకున్నావు. సరే... ఇంటికొచ్చేసి వేరే మార్గం చూసుకోవచ్చుకదా. ఆ స్మగ్లింగ్‌దాంట్లో ఎందుకిరుక్కున్నావు. అసలు నిన్నెవరు నమ్మారు?" అడిగింది విజయ.

"నేను వాళ్ళ దగ్గర పనిచేస్తున్నానంతే! వాళ్ళ పనితో నాకేం సంబంధం?"

"చిన్నపిల్లల కబుర్లొద్దన్నయ్యా!"

"విజయా... డబ్బు లేనందుకు మనం ఇన్ని ఇబ్బందులుపడుతున్నాం కదా, డబ్బు కోసం కొన్ని ఇబ్బందులు పడితే ఏమవుతుందంటా? ఇంటి దగ్గర వుండి బావిలో కప్పలాగా ఏం తెలుసుకోగలవు నువ్వు? ఢిల్లీలో ఒక్కొక్కరు ఎన్ని పనులు చేస్తారు, ఎలాంటి పనులు చేస్తారు... సంపాదించుకోవాలి, నలభై నలభై అయిదేళ్ళొచ్చేదాకా సంపాదించాలి. తరువాత కూర్చుని తిన్నా ఎలా సంపాదించావని మనను ఎవడూ అడగడు"

"ఇన్నిరోజుల్లో ఎంత సంపాదించావన్నయ్యా?"

"ఇన్నిరోజుల్లో ఏ ఆధారమూ లేకుండా నేనీ పొజిషన్‌కు వచ్చాను చూడు, ఆ చురుకుదనమే కావాలక్కడ. ఇప్పటి మాటవదిలెయ్... నాలుగేళ్ళుఆగి అడుగు ఇదే మాట. నువ్వు ఊహించనంత మొత్తం చెబుతాను"

తనకంటే సుధాకర్ పెద్దవాడే అయినా, ఢిల్లీ అతనికి చాలా నేర్పిందని గ్రహించింది విజయ. సుధన్నయ్యకు చదువు రాకపోవచ్చు. కానీ తెలివితక్కువ వాడు కాదు. ఇలాంటివాళ్ళను నిరాశా, నిస్పృహలకు లోనుచేసి, పనికిమాలిన వాళ్ళుగానో, సంఘవిద్రోహులుగానో మారుస్తున్న పరిస్థితుల బాధ్యత ఎవరిది? ఈ సమాజంది కాదా? కానీ సమాజం అంటే ఎవరు, మళ్ళీ వీళ్ళలోని ఒక్కొక్క వ్యక్తేకదా! ఈ చక్రానికి ఆది ఎక్కడో, అంతం ఎక్కడో -- అనుకుంది విజయ.

"సరే! నీ ఇష్టం. ఇక్కడున్నన్నిరోజులు మాత్రం నీ ఆపరేషన్స్‌కు పని చెప్పకు. అలాగే ఇంటిని నీ పనులకు కేంద్రంగా మార్చకు" అంది.

"అలాంటిదెప్పుడూ చెయ్యను. ఒక్కపని మాత్రం చెయ్యి... ఇంట్లో నా ఫొటోలెక్కడున్నాయో అన్నీ వెతికి చించెయ్. ఇప్పుడేమీ కాదుగానీ, ముందు ముందు మంచిదికాదు" అంటూ లేచి బైటకు వెళ్ళిపోయాడు.

ఆ మాటకు వళ్ళు జలదరించింది విజయకు.

★ ★ ★

గౌరీశం పేరు తెలుగు పాఠకలోకంలో మార్మోగిపోతూంది. అతన్ని కలుసుకోవటానికి వచ్చే జనం ఎక్కువైపోతున్నారు. ఆ గది ఖాళీచేసి వేరేచోట మంచి ఇల్లు తీసుకొమ్మని ఎందరో సూచించారుగానీ వినలేదు. ఇంటి యజమానితో మాట్లాడి, రెండువేలు అడ్వాన్సిచ్చి, ప్రహరీగోడకు తన గదిముందే మరో గేటు కట్టించుకున్నాడు. వాస్తురీత్యా అభ్యంతరం లేకపోవటమేగాక గౌరీశం తర్వాత అద్దెకొచ్చేవారు ఆ గేటు మూలంగా మరో ఇరవైరూపాయలు అద్దె ఎక్కువిచ్చే అవకాశంకూడా వుండటంతో ఇంటి యజమాని ఒప్పుకున్నాడు. గది గుమ్మంనుండీ గేటు వరకూ పూలకుండీలు కొని

పెట్టించాడు గౌరీశం.

గౌరీశంకు నిజానికి తీరిక దొరకటంలేదు. పత్రికాఫీసులకు వెళ్ళటం, మాట్లాడటం, తన నవలల సబ్జెక్టులకు సంబంధించి వివరాలు సేకరించటం, ఐడియాలకోసం ఇంగ్లీషు నవలలు చదవటం, ఇదే సరిపోతూంది. వంటచేసుకోవటం ఎప్పుడో మానేసాడు. ఒక పనికుర్రాణ్ని పెట్టుకున్నాడు. వాడు పొద్దున్నా, సాయంత్రమూ ఓ గంటసేపుండి క్యారేజీ తెచ్చియ్యటం, గది చిమ్మటం, మొక్కలకు నీళ్ళుపోయటంలాంటి పనులుచేసి వెళ్ళిపోతుంటాడు.

గౌరీశంకు జగదాంబ దగ్గర చనువెక్కువయింది. అప్పుడప్పుడు వెంకటేశంతోకూడా హస్కువేసుకుంటున్నాడు. అరుణ, విజయలు మాత్రం అతన్ని తప్పించుకు తిరుగుతున్నట్టు అనిపిస్తూంది. ఓసారి విజయ గుమ్మందాటి బైటకు అడుగుపెట్టగానే, తన స్కూటర్ తీసి, విజయ వెనకే వెళ్ళాడు. సందు మలుపు తిరగగానే వెళ్ళి విజయ పక్కన ఆపాడు.

"మీ కాలేజీవైపే వెళుతున్నాను. రా... డ్రాప్ చేస్తాను"

"నేను బస్సులో వెడతాన్లే నువ్వెళ్ళు" అంది ముందుకు కదలబోతూ.

"విజయా" పిలిచాడు గౌరీశం-- "నామీద కోపమా, ఎందుకు?"

"నాకు పానుందని వద్దన్నాను కానీ, నీకు స్కూటర్ నడపరాదన్లేదే" నవ్వటానికి ప్రయత్నిస్తూ అంది విజయ.

"నేను ఏంచేశానని నన్ను తప్పించుకు తిరుగుతున్నావ్?"

"నాకు కాలేజీ టైమవుతుందీ, వెళ్ళాలి" అసహనంగా అంది విజయ.

"ఇలా... అందరూ మననే చూస్తున్నారు, ప్లీజ్... స్కూటరెక్కు"

"అందుకే నేను వెళతానన్నాను" అనేసి, చప్పున కదిలి వెళ్ళిపోయింది విజయ.

మర్రోజు పెరట్లో విజయ బట్టలు పిండుతూంది.

"ఎందుకు విజయా, ఆరోజు నా స్కూటర్ ఎక్కడానికంత ఇది చేశావు?"

"కాలేజ్ దగ్గర నీ స్కూటర్‌మీంచి దిగటం చూస్తే, అందరూ ఏమనుకుంటారు?"

"అనుకుంటే ఏం?" కోపంగా అడిగాడు.

"భలేవాడివే... నీ అంత ధైర్యం అందరికీ వుండొద్దూ"

"విజయా... నేను చేసింది తప్పంటావా, పోనీ నాకు చెప్పొచ్చుగదా"

"గౌరీశం, నీలాంటి రచయితే మరెవరో అన్నట్టు, ఈ జీవితం రైలు ప్రయాణంలాంటిది. ఎక్కడో ఓ చోట మనస్టేషన్ వచ్చేయగానే మనపరిచయాలు అంతమవుతాయి. వీలైనంత నవ్వుతూనే అంది విజయ.

గౌరీశంకు ఒళ్ళు మండిపోయింది--

"నేనేం తప్పుచేశానని... లోకంలో అందరూ చేస్తున్నదే కదా, నేనేదో నేరం చేసినట్టు చూస్తూ నన్ను ఎందుకిలా సతాయిస్తున్నావ్" కోపంగా అన్నాడు.

"నువ్వే నన్ను సతాయిస్తున్నావు. నువు చేసింది తప్పనో, ఒప్పనో నేను అని తీరాలి అంటే నేనేం చేయగలను. నన్నడిగి చేశావుగనుకనా?" మళ్ళీ నవ్వుతూనే అంది.

"విజయా..." ఏదో అనబోతున్న గౌరీశంను మధ్యలోనే ఆపేసింది విజయ.

"గౌరీశం" హఠాత్తుగా విజయ గొంతులో ఒక విచిత్రమైన మాడ్యులేషన్ వచ్చింది-- "చూడు... నువ్వొక మార్గం ఎన్నుకున్నావు. అది నీఇష్టం. నేను నా ఇష్టమైనమార్గంలో ముందువెనుకలు ఆలోచించకుండా నడవటానికి వీల్లేదు. నాకు హద్దులనీ, బాధ్యతలనీ కొన్ని పరిమితులున్నాయ్. అవి నాకు ఇష్టంకూడా. నాకు కనిపించనంతముందుకు సాగిపోయావ్. అందుకోవాలనే తాపత్రయం అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ నాకు లేదు. మరింత ముందుకు వెళ్ళు, విజయగానీ, గౌరీశ్‌గా మారని గౌరీశంగానీ నీకు గుర్తుండరు, గుర్తురారు కూడా. నీకూ, నాకూ అదే మంచిది" అంది ఇద్దరి మధ్యవున్న తీగపై చీర ఆరేస్తూ.

"డామిట్... అదే దరిద్రంలో కలకాలం వుండాలా?" చీర చివరి వరకూ నడిచొచ్చి అన్నాడు చిరాగ్గా.

"ఉండమని నేనన్లేదు కదా" తీగపై మరో




చీర ఆరేసింది.

"అదే... ఎందుకనవు?" ఆ చీర చివరగా వస్తూ అన్నాడు కోపంగా.

దానివక్కన మరోచీర ఆరేసింది.

"ఎందుకనాలి... నేనదే దరిద్రంలో వున్నానుగదా... నువే పారిపోయావు. నేనుమాత్రం నిలబడి నీళ్ళు తాగుతాను"

ఆ చీర చివరదాకా నడుస్తూ వచ్చాడు–

"ఐతే నువ్వు వేరు, నేను వేరు అనుకుంటున్నావా విజయా?"

"గౌరీశం, నీక్కావలసింది 'విజయ'– కాదు, 'విజయం' అటే సాగిపో"

మరో చీరనుతీసి ఆరేయబోయిన విజయ చేతిని తన చేత్తో పట్టుకుని ఆపి.

"నా ముఖం చూడటంకూడా ఇష్టంలేదా నీకు"– అన్నాడు విజయ కళ్ళల్లోకి చూస్తూ.

"ఈ సున్నితమైన రేఖకు నువ్వటు, నేనిటు" తన చెయ్యిని సున్నితంగా విడిపించుకుని చెప్పింది విజయ. "ఇదింతే గౌరీశం"

ఆ మాట అని ఇంట్లోకెళ్ళిపోయింది. స్థాణువైపోయాడు అలాగే.

★ ★ ★

"విజయా... గౌరీశంతో ఎందుకలా మాట్లాడావు?"

అరుణ ప్రశ్నకు నివ్వెరపోయింది విజయ.

"ఎలా?" అంది.

"నేనప్పుడే స్నానం చేద్దామని బాత్రూంలో కొచ్చాను. నువ్వు నన్ను గమనించలేదు. అప్పుడే గౌరీశం నీ దగ్గరి కొచ్చాడు. అనుకోకుండా నేను విన్నాను"

"మరెలా మాట్లాడాలి. మన సమస్యలు మనకుండగా పరులని నెత్తికెత్తుకునే ఓపికెక్కడిది?"

"చిన్నపిల్లలా చెప్పకు. అతన్నిన్ను ప్రేమిస్తున్నాడని నీకు తెలియదా?"

"తెలుసు... అందుకే అది కుదరదని చెప్పాను"

"ఎందుకు?"

"నాకిష్టంలేదు"

"కాదు... నాకు తెలుసు. అతను కథలు రాస్తున్న పద్ధతి నీకు నచ్చలేదు. అంతేకదా– అది జీవనమార్గం అతనికి"

"ఎందుకు గౌరీశంను వెనకేసుకుని మాట్లాడుతున్నావు?" అనుకోకుండా కోపం వచ్చింది విజయకు– "మీ అందరిదీ ఒకటే మార్గం. మీరీదరిద్రాన్ని భరించలేరు. అందుకు ఏమైనా చేస్తారు– అంతేకదా. జీవనమార్గం ఎంచుకునే దగ్గరే మనిషి వ్యక్తిత్వం బైటపడుతుంది. నాలుగురోజులు పస్తులుండలేక, అంతవరకూ తను తిట్టి, ఎగతాళిచేసి, విమర్శించిన మార్గంలోనే నడవాలని నిశ్చయించుకున్న వ్యక్తిలో ఏముందని ప్రేమించమంటున్నావ్? ఒకమాట చెబుతున్నాను-- అతనికి చెప్పు... ఈ దరిద్రంలో చస్తేచస్తానుగానీ నేను మీలా చేయను. దాంతోనే మరోమాటకూడా చెబుతున్నాను. కలకాలం ఇలాగే వుండను. ఒకనాటికి ఈ దరిద్రాన్ని జయిస్తాను. కానీ మీలాగా కాదు... నీతిగా, నిజాయితీగా కష్టపడి– అంతే"

సుధాకర్‌తో పాటున్న గౌరీశంకూడా ఈ మాటలు విన్నాడు, ముందు గదిలోంచి.

★ ★ ★

సుధాకర్ వచ్చి నెలలు గడిచిపోతున్నాయి. మధ్యలో మరో రెండుసార్లు తల్లికి ఓ మూడొందలిచ్చాడు. ఎక్కణ్ణించో రెండు ఉత్తరాలొచ్చాయి ఈమధ్య కాలంలో. రెండోఉత్తరం రాగానే ఇక తను వెళ్ళాలని చెప్పేశాడు ఇంట్లో. ఎవరెంత వారించజూసినా వినిపించుకోలేదు.

సరిగ్గా అప్పుడే అరుణకు సినిమా కంపెనీ నుండి లెటర్ వచ్చింది. నెలరోజుల్లో మద్రాసు కురమ్మనీ, స్క్రీన్ టెస్ట్, వాయిస్ టెస్ట్ చేసి, పర్‌ఫెక్టని తేలితే సెకండ్ హీరోయిన్ పాత్ర ఇచ్చే విషయం కన్‌ఫర్మ్ చేస్తామనీ రాశారు. లెటర్ పట్టుకుని సంపత్ దగ్గరికెళ్ళింది. తరువాత విజయకు చూపించింది. విజయ విషయం తల్లిదండ్రులకు చెప్పింది. తీరిగ్గా కదిపాడు వెంకటేశం ఓరోజు.

"ఏమిటరుణా... విజయ ఏదో చెప్పింది?"

అరుణ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది తలొంచుకుని.

"సినిమాల్లో చేరతానన్నావట?"

"అవున్నాన్నా? ఎప్పట్నుంచో అనుకుంటు న్నాను"

"పెళ్ళికాకముందు చిన్నతనం అనుకున్నా ను. పెళ్ళిచేసుకోగానే సంతోషించాను, నీకా ధ్యానవదిలిపోయిందనుకున్నాను. ఇప్పుడు నీకు మంచీ, చెడూ తెలిసి వుంటాయనుకు న్నాను. కానీ నువ్వు ఇంకా అదే ఆలోచనతో వున్నావనీ, ఇలా నిజంగానే వెళతానంటావనీ అనుకోలేదు"

"ఈ ఛాన్స్ పోతే మళ్ళీ దొరకటం కష్టం నాన్నా"

"ఏమిటే ఛాన్స్, ముండమోపి సినిమాల్లో దొరకటం అదేదో బ్రహ్మ కార్యమన్నట్టు మాట్లా డుతున్నావ్! ఊర్కుంటుంటే బరితెగించిపో తున్నావు..."

"నువ్వూర్కోవే... నేను అడుగుతున్నాను కదా. సినిమాల్లో అవకాశం దొరకటం ఎంత కష్టమో, ఎంత అదృష్టమో అమ్మకు తెలియ దు. కానీ అక్కడ నెగ్గుకు రావడం ఎంత కష్టమో నీక్కూడా తెలియదు.

"ఇన్ని వేలమందిలో నాకొక్కదానికే వచ్చింది. ఐనా ఇంకా స్క్రీన్‌టెస్టూ, వాయిస్ టెస్టూ చేసి, అందులో పాసయితేనే ఇస్తారు"

"ఇన్నిట్లో నెగ్గినదానివి అందులోనూ నెగ్గుతా వనుకో, తరువాత సంగతి?"

అరుణ ఏమీ అన్లేదు. భర్త ఆగటంతో జగదాంబ అంది:

"పెళ్ళయి ఇలా అయినందుకే ఏం చే యాలా అని మేం సతమతమవుతున్నాం. నువ్వు అక్కడికెళ్ళాక ఏమన్నా అయితే ఎంత అప్రదిష్ట?"

"ఇప్పుడిప్పుడే కుట్టుపనిలో చెయ్యితిరి గింది. నీకాళ్ళమీద నువ్వు నిలబడగలవు. పోనీ చదువుకో, కాలేజీకి వెళ్ళు- ఏదో కష్టపడతాం. మంచి సంబంధం కుదిరితే మళ్ళీ పెళ్ళిచే యాలని నేననుకుంటున్నాను. చక్కగా సంసారం చేసుకుంటూ, హాయిగా ఉండే అవ కాశం ఇప్పుడు కొద్దిగొప్పో ఉంది కానీ సినిమా ల్లో చేరాక ఉంటుందంటావా? ఇప్పుడేమీ చె ప్పొద్దు- బాగా ఆలోచించుకో. నీకేమైనా తోచక పోతే నీ స్నేహితులనడుగు... విజయనడుగు. అంతేకానీ వెళ్ళాలనేదొక్కటే అనుకోకు" అన్నా డు వెంకటేశం ముగిస్తూ.

అరుణ అదేమీ చేయలేదు. తన మెళ్ళోఉ న్న గొలుసూ, ఉంగరం అమ్మేసి, మూడోరోజున సుధాకర్ని తీసుకుని ఎవరికీ చెప్పకుండా వెళ్ళి పోయింది.

★ ★ ★

"అమ్మా నాన్నలు చాలా పట్టుదలతో ఉన్నా రు. ఈ సంవత్సరం పెళ్ళిచేసెయ్యాలని" చెప్పింది గౌతమి ఫైనల్ పరీక్షలు రాశాక.

"ఎమ్.ఎ. విషయం ఏమయింది?"

"ససేమిరా వద్దంటున్నారు. పెళ్ళిచేసు కుని, మొగుడికిష్టం ఉంటే చదువుకోమన్నా రు"

"మరెలాగంటావు ఇప్పుడు?"

"మీరే ఆలోచించండి. ఈ బాధ్యతలనేవాటి కి అంతుండదు. ఒకటైతే మరొకటి వస్తూనే ఉంటాయి"

"పోనీ, నేను మాట్లాడనా మీవాళ్ళతో?"

"ఏం మాట్లాడతారు. మీ అమ్మాయిని ఎమ్మే చదివించండి, తరువాత నేను పెళ్ళిచే సుకుంటాను- అని చెబుతారా? కుదిరే వ్యవహా రమేనా ఇది... ఇలాంటి మాటలు ఎవరైనా లెక్కచేస్తారా? పెళ్ళిచేసుకున్నవాళ్ళే ఏం చేస్తా రోనని అనుమానాలు పడుతుంటే, మీరిలా చెబితే ఎవరు నమ్ముతారు? పైగా అసలీ పెళ్ళికి మీవాళ్ళూ, మావాళ్ళూ ఒప్పుకుంటారో లేదోనని నేననుకుంటూంటే..."

"ఏం చెయ్యను గౌతమీ... వాడు- సుధాకర్ అంది వస్తాడనుకుంటే ఇలా చేశాడు. మళ్ళీ ఎక్కడున్నాడో తెలియదు. అరుణ పెళ్ళికి చేసిన అప్పు తీరనేలేదు, కొత్త అప్పులు. ఇంతలో సంసారం మొదలుపెడితే మనమా త్రం ఏం సుఖంగా ఉంటాం చెప్పు. విజయ పెళ్ళైనా అయితే బాగుణ్నని చూస్తున్నాను"

"నేను చెప్పేది మీరు అర్థంచేసుకోండి. బాధ్యతలకు భయపడి ఎన్నాళ్ళిలా వాయిదా వేస్తారు? అసలు మీగురించి మీరు కొంచెం ఆలోచించండి. ఇంకా ఎన్నేళ్ళిలా ఉంటారు, మీతోటివాళ్ళంతా పెళ్ళిళ్ళుచేసుకుని పిల్లల్ని




కూడా కనేసి ఉంటారీపాటికి. నాన్నగారేమో ఈసారి నా మాట వినేట్టులేరు. నా ఒక్కపెళ్ళీ అయిపోతే తమ్ముళ్ళ విషయం ఆయనకంత బెంగ ఉండదు. ఆయన బాధ ఆయనది. మనం ఏమాత్రం ఆలస్యం చేసినా, వాళ్ళు ఏదో ఒక సంబంధం చూసేస్తారు. ఒకసారి ఆ ప్రయత్నం మొదలెట్టారంటే ఇక మనమాట వింటారో వినరో. నా ఒక్కదానికీ ఇంత తిండి పెట్టలేరా మీరు, అసలు ఇదికూడా మీ బాధ్య తగానే ఎందుకాలోచించరు?''

గౌతమి కళ్ళల్లో తిరిగిన నీళ్ళకి నారాయణ చలించిపోయాడు. అశ్రువులైనా, అస్త్రాలైనా సాధారణంగా మగవాడు స్త్రీ దగ్గర కరిగిపోతా డు... అదే జరిగింది.

''ఏం చేయమంటావో చెప్పు?'' అన్నాడు నారాయణ.

ఆ మాటతో పొంగిపోయింది గౌతమి. గబ గబా కళ్ళుతుడుచుకుంటూ చెప్పింది-

''నేను వెళ్ళి అమ్మకు చెప్పి, నాన్నగార్ని మీ నాన్నగారి దగ్గరకు పంపిస్తాను. ఈ లోగా మీరు చెప్పి ఉంచండి''

తల ఊపాడు నారాయణ

అనుకున్నట్టుగానే జరిగింది. గౌతమి తండ్రి వచ్చి వెంకటేశంతో మాట్లాడాడు. నారా యణ కట్నం తీసుకోనన్నాడు. పెళ్ళి మాటెత్తి తేనే మాటతప్పించే కొడుకు పెళ్ళిచేసుకుంటా ననడమే చాలుననుకుని ఊరుకున్నాడు వెంక టేశం. పైగా ప్రేమ పెళ్ళిగనుక రెట్టించలేకపో యాడు. నారాయణకొచ్చే కట్నంతో విజయపె ళ్ళి చేయాలనుకున్న ఆశ జారిపోవటంతో విజయ పెళ్ళి గురించి ఇక ఆలోచించలేదు.

ఐతే గౌతమి తండ్రి తన కూతురి పేరున యాభై వేల రూపాయలు కట్నంగా వేసేటట్టూ, మగపెళ్ళివారు ఏలాంఛనాలూ పెట్టనవసరం లేకుండానూ మాట్లాడారు. మగపెళ్ళివారి తర పున వ్యవహారమంతా నడిపించింది చలపతే. అతను ఎంత చెప్పినా నారాయణకట్నం తీసు కోవటానికి ససేమిరా అన్నాడు. విజయ కూడా అతన్నే సమర్థించింది. అయినా అది సాకుగా చూపి నారాయణ కుటుంబానికి ఎక్కువ ఖర్చు లేకుండా వ్యవహారం నడిపాడు చల పతి.

లాంఛనంగా పెద్దవాళ్ళ కోసం పెళ్ళిచూ పుల తతంగం జరిగింది. నారాయణతో తల్లి దండ్రులు వెళ్ళి పిల్లను చూసివచ్చారు. వరు నాడే గౌతమి నానమ్మ మరణించింది. దాంతో పెళ్ళి ముహూర్తం ముందుకు మార్చారు.

★ ★ ★

అరుణ నటించిన సినిమా రిలీజయింది అనూహ్యంగా అట్టర్ ఫ్లాపయింది. అదులో అరుణతోపాటు మరో మూడు చిన్న పాత్రల్లో కూడా కొత్త నటుల్ని పరిచయంచేశారు. వాళ్ళ సంగతెవరూ పట్టించుకోలేదుగానీ అరుణకు మాత్రం రిలీజ్‌కు ముందే మరో మూడు సిని మాల్లో సైడ్ హీరోయిన్ ఆఫర్లొచ్చాయి. మొదటి సినిమా ఫ్లాప్‌తో అవి చిన్న పాత్రలుగా మారిపో యాయి. అరుణ తొలి చిత్రం షూటింగ్ పూర్త య్యేవరకూ ఆమెతో ఉన్న సుధాకర్, ఆ తరు వాత తన దారిలోకి మళ్ళాడు. అతనేం చేస్తు న్నదీ ఇంట్లోవాళ్ళకుగానీ, అరుణకుగానీ తెలి యదు. మద్రాసులోనే అప్పుడప్పుడూ అరు ణకు కనిపిస్తుంటాడు.

గౌరీశం మొదలెట్టిన కొత్త ఒరవడిలోకి మరి కొందరు రచయితలు కూడా ప్రవేశించా రు. ఆ శైలిపట్ల పాఠకుల్లో అంత క్రేజ్ ఏర్ప డింది. పాఠకలోకంతోపాటు సంపాదకులూ, ప్ర చురణకర్తలూ అతని వెంట పరుగులు మొద లెట్టారు. గౌరీశం రాసిన ఒక నవల సినిమాగా విడుదలై హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడుస్తోంది. దాంతో 'గౌరీశ్' అనే పేరున్న నవలల కోసం సినిమా నిర్మాతలు ఎగబడుతున్నారు. ఆ ప్రయత్నంలో ఒకసారి మద్రాస్ వెళ్ళిన గౌరీ శంకు అరుణ కలిసింది.

తను అరుణను ఏంచేశాడో అతనికి గ ర్తుంది. అందులో అరుణ పాత్ర ఏమిటన్న తనకు తెలిసినా, తను కూడా తప్పుచేశానన భావం అతనిలో ఉంది. తన ముగ్గురు నిర్మా లకూ అరుణకేమైనా పాత్రలుఇమ్మని మెండ్ చేశాడు. ఆ విషయం అటు అరు క్కానీ, ఇటు వాళ్ళ ఇంట్లోకానీ చెప్పలేదు

ఈమధ్యకాలంలోనే నారాయణ పెళ్ళికి గిన ప్రయత్నాలూ, మూడు నాలుగు నె అతని పెళ్ళి జరగబోతున్న విషయ

తెలిసి, తిన్నగా చలపతి ఇంటికి వెళ్ళాడు గౌరీశం. తమ గురించి ఏమీ చెప్పకుండా, తను విజయను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నట్టూ, వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడమనీ కోరాడు వెంకటేశం, జగదాంబ సంతోషంతో ఒప్పుకున్నారు కానీ విజయ ఒప్పుకోలేదు.

"ఏమయ్యా... విజయా, నువ్వూ ఇంతకు ముందేమైనా తగువులాడుకున్నారా, అసలేమయింది. నిన్ను మాత్రం చేసుకోనని మొండికేసింది?' గౌరీశంను కూర్చోబెట్టి అడిగాడు చలపతి.

"వాళ్ళ అమ్మానాన్నలు చెబితేనైనా ఒప్పుకుంటుందేమో ననుకున్నాను" నిట్టూర్చాడు గౌరీశం.

చలపతి బలవంతం చేసిన మీదట విజయ కోపకారణం వివరించాడు.

మళ్ళీ రాయబారం నడిపాడు చలపతి-

"ఓసోస్... ఏమిటే విజయా, వడ్లగింజలో బియ్యపు గింజలా ఇదా విషయం! ఇంతచిన్న విషయానికి ఇంతకాలం అలిగావు చాలు. నువ్వేదో తెలివైనదానివని నేననుకుంటున్నాను"

"నేనేం తెలివైనదాన్ని మామయ్యా... ఏదో అమ్మానాన్నల చాటున ఇలా బతుకుతున్నాను"

"చాల్లేవే నీ వ్యంగ్యాలు నా దగ్గరా. చూడు విజయా... ఆ అబ్బాయి ఏం చేశాడని. ఏమైనా హత్యలు చేశాడా, దోపిడీలు చేశాడా? మరీ ఇంత సున్నితంగా ఆలోచిస్తే బతకటం చాలా కష్టంసుమా! లక్షలమంది ఎగబడి చదువుతున్నారు. వాళ్ళందరూ చదవగాలేని తప్పు, అతను రాస్తే వచ్చిందా? పిల్లవాడు బుద్ధిమంతుడు. ఒక్క దురలవాటూ లేదు. సిగరెట్లు కాలుస్తాడనుకో. నేను పాన్ తిననా. అయినా పాపం మానెయ్యమంటే అదీ మానేస్తానన్నాడు. ఎక్కడ దొరుకుతాడే అలాంటివాడు. అతనే గానీ 'కో' అంటే కోటిమంది... ఏమిటీ అక్షరాలా కోటిమంది వచ్చి క్యూలో నిలుచుంటారు"

"కో... కాకపోతే కొక్కొరకో- అనుకోమను. అందులో ఒకర్ని కాకపోతే కోటిమందినీ చేసుకోమను. నాతోమాత్రం ఇక మాట్లాడొద్దు మావయ్యా ఈ విషయం"

"పోనీ అతనేం చేస్తే నువ్వు పెళ్ళిచేసుకుంటావో చెప్పు?"

"ఒక్కమాట చెప్పనా మావయ్యా... మేం ఇన్ని కష్టాల్లో ఉన్నాంకదా, అన్నయ్య కట్నం ఎందుకు తీసుకోలేదంటావ్, వాళ్ళు ఇస్తామన్నా ఎందుకు వద్దన్నాడంటావ్? దీనికి బదులు చెప్పునువ్వు... చాలు"

"ఒరేయ్ చలపతీ... ఇక వద్దురా. దానికి నిజంగా ఇష్టంలేనట్టుంది- వదిలెయిరా. ఆ కుర్రాడికో అమ్మాయి దొరక్కపోదు, దీనికో కుర్రాడూ దొరక్కపోడు" చెప్పాడు వెంకటేశం.




నారాయణ పెళ్ళి ముహూర్తం దగ్గరకొచ్చింది. ఎన్ని లాంఛనాలు అటువారు పెట్టుకున్నా వీళ్ళకూ ఖర్చు తప్పలేదు. మళ్ళీ అప్పు చేయాల్సివచ్చింది. ఆడపిల్ల పెళ్ళికవసరమైనంత కాకపోయినా, అప్పు అప్పే. అరుణకు ఏదో స్టూడియో అడ్రస్‌కు ఉత్తరం రాశారు కానీ, అరుణ పెళ్ళికి రాలేదు. మైసూర్లో ఏదో ఔట్‌డోర్ షూటింగ్‌లో ఉందని పేపర్లో చూసి, చెప్పింది విజయ. ఇక సుధాకర్ ఎక్కడున్నదీ, ఏం చేస్తున్నదీ తెలియదు. సరే... అయ్యవారి కోసం అమావాస్య ఆగదన్న సామెతలాగూ ఉంటనేఉంది. పెళ్ళి జరిగిపోయింది. కొత్తకోడలు ఇంట్లో అడుగుపెట్టింది.

గౌతమికి మొదట్నించీ ఇంట్లోవాళ్ళందరి మీదా కాస్తో కూస్తో కోపంగానే ఉండేది- తన భర్తకు భారంగా తగిలారని. అదికాస్తా పెళ్ళి ముందు నారాయణ దావా వేయబోవడంతో మరింత పెరిగింది. భర్తకు ఎంతసేపూ చెల్లెలి పెళ్ళి, తమ్ముడి చదువుమీదే ధ్యాస ఉండటం




ఆమెకు చిరాగ్గా ఉండేది. ఇవన్నీ ఇంట్లో అత్తతో మాట్లాడేటప్పుడూ, పనులు చేసుకొనేటప్పుడూ అనుకోకుండా బైటపడేది.

అప్పుడప్పుడూ ఎవరైనా కుట్టుపని గురించి వచ్చి ముందు గదిలో గౌతమిని చూసి అడిగితే చిరాగ్గా అనేది-

"మా ఇంట్లోనూ మిషన్ వుందిగానీ, మా బట్టలు తప్ప, ఇలా ఊరివాళ్ళందరి బట్టలూ కుట్టలేదెప్పుడూ. పక్కవాళ్ళముందు మొహమెత్తుకుని ఎలా తిరుగుతాం?"

రెండుమూడుసార్లు చూసి,

"బట్టలు కుడుతున్నాం కానీ, డబ్బులకోసం కొంపలు కూల్చటంలేదుకదా వదినా, ఇందులో తప్పేముంది?" అంది విజయ.

"మీ అన్నయ్యెలాగూ ఢిల్లీలో ఆపనే చేస్తున్నాడుగదా" అని మూతి విరిచింది.

అంతమాట అంటుందని ఊహించని విజయ తెల్లబోయింది. జగదాంబమటుకు గొడవచేసింది. విషయం తెలిసినా నారాయణ కిమ్మనలేదు.

ఓ సారి పేపర్లో అరుణ వున్న స్టిల్ పడింది. శ్రీనివాస్ అది తీసుకొచ్చి, విజయకు చూపించాడు.

"మరి అరుణక్క ఎప్పుడొస్తుందే?" అనడిగాడు.

గౌతమి మధ్యలో కల్పించుకుని-

"సినిమాల్లో చేరి, అడ్డమైన తిరుగుళ్ళూ తిరిగేవాళ్ళు ఇంటిధ్యాస పెట్టుకోరయ్యా-శ్రీనూ" అంది.

ఇలాంటివే అడపాదడపా జరిగేవి. మూణ్నెల్లు గడిచే సరికి కొత్త కోడలి ముచ్చట కాస్త తీరిపోయింది ఇంట్లోవాళ్ళకు. ఒకరోజు గౌతమి నేదో అన్నందుకు తల్లిని కోప్పడ్డాడు నారాయణ. జగదాంబ శోకాలు పెట్టి ఏడవటంతో గౌతమిని తిట్టాడు. ఆమె ఏదో ఎదురు సమాధానం చెప్పటంతో చెంప ఛెళ్ళుమనిపించి, ఇంట్లోంచి బైటకు వెళ్ళిపోయాడు.

రాత్రి వేళ నారాయణ తిరిగొచ్చే సరికి గౌతమి అలిగి పడుకుంది. జగదాంబ నిద్రపోయింది. వెంకటేశం మిల్లుకు వెళ్ళాడు. శ్రీను కూడా నిద్రపోయాడు. విజయొక్కతే ముందు గదిలో కూర్చుని వుంది. అన్నను చూడగానే అప్పటివరకూ ఆలోచించి పెట్టుకున్నవన్నీ గుర్తొచ్చాయి విజయకు.

"కొంచెం మాట్లాడుదాం. రా అన్నయ్యా" అంటూ కుర్చీపట్టుకుని పెరట్లోకి నడిచింది. కూర్చున్నాడు నారాయణ ఏం మాట్లాడుతుందోనని ఆలోచిస్తూ.

ఐదునిముషాలకు ఓచేత్తో కాఫీకప్పు, మరోచేత్తో స్టూలూ పట్టుకునొచ్చింది. కాఫీ నారాయణకిచ్చి, స్టూలు మీద తను కూచుంది.

"ఒకమాటడుగుతాను, సరిగ్గా ఆలోచించి చెప్పన్నయ్యా" అంది విజయ.

అడగమన్నట్టు చూశాడు నారాయణ, ఏమీ మాట్లాడకుండా.

"అన్నయ్యా... రేపు, నాకు పెళ్ళి చేస్తే ఎలాంటి సంబంధం చూస్తారు?"

తల్లిని కోప్పడినందుకు ఏమడుగుతుందో, ఏం చెప్పాలోనని ఆలోచిస్తున్న నారాయణ, ఊహించని ప్రశ్నకు తెల్లబోయాడు.

"ఎలాంటి సంబంధం అంటే" అన్నాడు కాస్సేపటికి తేరుకుని.

"అత్తామామలు, మరుదులూ, మరదళ్ళూ, బాదరా బందీ వున్నవాళ్ళని చూస్తారా, అరుణక్కకు చూసినట్టుగా బాధ్యతలు లేనివాళ్ళను చూస్తారా?"

"అదెందుకే ఇప్పుడు?"

"ఊరికినే చెప్పు... ఎలాంటి సంబంధం చూస్తారు?"

"అరుణకు చూసినలాంటిదే చూస్తాం. బాదరాబందీ వున్న సంబంధమైతే నాన్నకూడా ఒప్పుకోడు"

నిద్ర నటిస్తున్న గౌతమికి వీళ్ళ మాటలన్నీ వినిపిస్తూనే వున్నాయి.

"మరి వదినకూడా అలాగే అనుకుంటుందని ఆలోచించలేదా నువ్వు?"

"ఆలోచించడమేమిటి? చెప్పాను కూడా. తనే తొందరపడింది. నీ పెళ్ళీ, శ్రీనుగాడి చదువూపూర్తి కావాలని చెప్పాను. పెళ్ళైనాక కూడా అవన్నీ చూసుకోవచ్చునంది"

విజయ కాస్సేపాగి అంది-

"నేనోమాట చెబుతాను. చిన్నదాన్ననుకో కుండా వింటావా?"

"చెప్పు... నీమాటెప్పుడు కాదన్నాను గనుక"

"ఇన్నిసార్లూ విన్నది వేరు. ఇప్పుడు విన టంవేరు" కాస్సేపాగింది- "ఎలా చెప్పాలో తెలియటం లేదు..."

నారాయణేమీ మాట్లాడలేదు.

చప్పుడవకుండా, మంచంలోంచి లేచి కూచుంది గౌతమి ఆసక్తిగా.

"వదిన అనీ, నేననీ, ఇలా కాదు - అందరా డపిల్లలూ, పెళ్ళయ్యాక ఏ బాదరబందీలే కుండా హాయిగా వుండాలనే కోరుకుంటారు. భర్తతో కలిసి, భర్తతో మాత్రమే కలిసి జీవించా లనుకుంటారు. అంతేకానీ, పెళ్ళికాగానే ఓ బంది ఖానాలాంటి జీవితం, కలిసి మాట్లాడుకో వాలంటే ఏకాంతం దొరకని ఇల్లు, నయాపైస ఖర్చు చేయాలంటే లెక్కలు చూసుకోవాల్సిన ఖర్చులూ, అప్పులూ - ఇవన్నీ ఎవరికిష్టం వుంటాయి చెప్పు. కాస్సేపాగి మళ్ళీ అంది విజయ-

సరే... ఎప్పుడో ఒకప్పటికి ఇవన్నీ తీరిపోతే అప్పుడే హాయిగా వుంటాంలెమ్మని కొందరు సహిస్తారు. కానీ బలవంతంగా భరించమంటే జరగదన్నయ్యా- ఇలాగే అవుతుంది"

"ఇవన్నీ గౌతమికి నేను ముందే చెప్పాను. చెప్పానని కూడా నీకు చెప్పాను"

"అన్నయ్యా... అనుకోవటం వేరు, ప్రత్య క్షంగా అనుభవించటంవేరు"

"అనుకునేప్పుడే వుండాలికానీ, ఇప్పుడెక్క సారిగా - నీకు చెల్లెలుండొద్దు, తమ్ముడుండొ ద్దు- అంటే, వున్నవాళ్ళంతా ఏమయిపోతా రు?" అడిగాడు నారాయణ.

"అందుకు చేయవలసిందేమిటో చెబుదా మనే మాట్లాడుతున్నది. నువ్వూ, వదినా వేరుకా పురం పెట్టండి. అలా ఆశ్చర్యపడకు. నేను సరిగ్గానే చెబుతున్నాను- అంతకంటే మార్గం లేదు"

"రేపు నాన్నకూ, అమ్మకూ నాముఖం ఎలా చూపించాలి? వద్దు విజయా, నేను గౌతమికి నచ్చజెబుతాను"

"సినిమాల్లో అన్నయ్యల్లాగా మాట్లాడకు. వదినను సుఖపెట్టడం మాత్రం నీబాధ్యత కాదా. రోజూ వదినకు నీముఖం చూపించ టంలేదా... ఐనా, అసలు అమ్మకూ, నాన్నకూ ఈ విషయం చెప్పకుండానే చేయటానికి మరో మార్గం వుంది. నువు ట్రాన్స్‌ఫర్ చేయించుకో, సరిపోతుంది"

తెల్లబోయి చూశాడు నారాయణ.

"మరి నీచదువుకో ఏడాదుంది, శ్రీను ఇంకా కాలేజీలో చేరాలి. నీపెళ్ళి..."

"పోనీ... ఓపనిచెయ్యి నెలకో రెండొందలు మాకు పంపించు. అది కూడా మనకు అప్పు లున్నాయి గనుక. బాగా ఆలోచించన్నయ్యా. వదినకు చెప్పిచూడు. కలిసుండి ఇలా గొడవ లు పడేకంటే నీకైనా, వదినకైనా అదే మంచిద న్నయ్యా"

★ ★ ★

నారాయణ గౌతమిని ఒప్పించే అవసరమే లేకపోయింది. గౌతమి, తండ్రి సహాయంతో వాళ్ళ ఊరి దగ్గరకు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవా లనుకుంది. డిపార్ట్‌మెంట్ మార్చి, పడవలసిన తంటాలేవో పడి, ఎలాగైతేనేం, ఆయన అల్లు ణ్ని ఊరు మార్పించాడు. ట్రాన్స్‌ఫర్ విషయం తెలిసినప్పట్నించీ వెంకటేశంకు చాలా భారంగా అనిపిస్తూవుంది. మరునాడు వెళ్ళి పోతారనగా రాత్రి పొద్దుపోయేదాకా కూచుని కొడుకుతో మాట్లాడాడు వెంకటేశం. పొద్దున్నే లేచి డ్యూటీకి వెళ్ళిపోయాడు.

అన్నీ సర్దుకున్నాక గౌతమి విజయ దగ్గరకొ చ్చి కూర్చుంది. చాలా సేపు ఖర్చుల విషయ మూ, అన్న అమాయకత్వమూ చెప్పింది విజయ. తను ఈ ప్రతిపాదన తెచ్చిన విషయం నారాయణ గౌతమికి చెప్పి వుండడ నుకుంది విజయ. నారాయణ చెప్పివుండకపో యినా ఎలాగూ గౌతమికి తెలుసు.

"ఏమిటో వదినా, పుట్టి బుద్ధెరిగినప్ప ట్నించీ, అన్నయ్యను చూడకుండా ఒక్కరోజు కూడా వుండలేదు. ఈ ట్రాన్స్‌ఫర్ ఎందుకొ చ్చిందో, మా అన్నయ్యకే రావాలా?"

"ట్రాన్స్‌ఫర్ రాకున్నా, నీపెళ్ళయితే వదలా




ల్సి వచ్చేదికాదా?" అంది గౌతమి నవ్వుతూ.

కాస్సేపటికి లేచివెళ్లబోతూ, విజయచేయి రెండు చేతుల్లోనూ పట్టుకుని-

"నీకు మంచి మొగుడు రావాలని దీవిస్తున్నా విజయా" అంది గౌతమి విజయ చేతిని ముద్దుపెట్టుకుంటూ.

మధ్యాహ్నం వెంకటేశం వచ్చేసరికి కొడుకు, కోడలూ వెళ్ళిపోయారు. ఇల్లు బోసిపోయినట్టుగా అనిపించింది.

★ ★ ★

మరునటి నెలలో ఆ ఇల్లు ఖాళీచేశారు. కాస్తపెద్దగావున్న ఒకే ఒక్కగది తీసుకున్నారు. కొద్దిగా పెరడు కూడా వుండటంతో ఇబ్బంది లేకపోయింది. ముఖ్యంగా అద్దె నూటయాభై రూపాయలు. ఒక ఖర్చు తగ్గిందని సరిపుచ్చుకున్నారు.

అన్నట్టుగానే నారాయణ రెండొందలూ పంపించాడు. ఆ నెలలోనే నారాయణ పేరుమీదున్న అప్పులు మాత్రం తీర్చింది గౌతమి, బ్యాంకులోంచి కొంతడబ్బుతో. అక్కడికే ఒక భారం తీరిపోయిందని సంతోషించాడు వెంకటేశం.

శ్రీనివాస్ పదో తరగతి పరీక్షలు రాశాడు. కాలేజీలో చేరటం గురించి కలలుకంటున్నాడు. విజయ సెకండియర్ అయిపోయింది. నారాయణ దగ్గర్నించి గౌతమి నెల తప్పినదన్న శుభవార్తతోపాటు, తన ఇబ్బందులవల్ల ఓ ఏడాది పాటు డబ్బు పంపించలేని అశక్తతకు క్షమాపణలు కూడా వచ్చాయి.

జగదాంబకు అల్సర్ వచ్చింది. నెలనెలా మందుల ఖర్చొకటి ఎక్కువయింది. నారాయణకు మళ్ళీ రాస్తానన్న తండ్రిని వారించింది విజయ. సుధాకర్ వదిలేసి వెళ్ళిన టేప్‌రికార్డరూ, సిటిజన్ వాచీ తాకట్టూ పెట్టగా వెయ్యి రూపాయలు వచ్చాయి.

కష్టాలనేవి అలవాటయి యాభైఅయిదేళ్ళయింది వెంకటేశంకు. మిల్లులో కొత్తయంత్రాలు తేవటం వల్ల మరో మూడేళ్లు సర్వీసున్నా ఆ సంవత్సరంలో చాలామందితోపాటు, తననూ బలవంతంగా రిటైరుచేశారు. అసలు ప్రభుత్వం ఏం చేస్తుంటుందో వెంకటేశంకు తెలియదు. బడ్జెట్ అనేది ప్రతియేటా చేస్తారనే విషయంతప్ప, బడ్జెట్ అంటేనే ధరలు పెరగటం.

తండ్రి ఎంతచెప్పినా వినకుండా, ఆయేడు కాలేజి మానేసింది విజయ. తమ్ముణ్ని ఇంటర్ బీపీసీలో చేర్పించింది- మెడిసిన్ చదివించాలని. కాలేజీ ఎలాగూ లేదుగనుక మిషన్‌మీద స్థిరంగా కూచుంది కానీ, నెలరోజులకే విపరీతంగా కీళ్లనొప్పులు వచ్చేశాయి. మనోహర్ ఎం.ఎస్ సీటు రాకపోవటంతో తాత్కాలికంగా ప్రాక్టీసుపెట్టాడు. విషయం తెలియటంతో విజయను మంచి స్పెషలిస్టు దగ్గరికి తీసుకెళ్ళి చూపించాడు. మిషన్ తొక్కడం ఆమె ఆరోగ్యానికి ఎంతమాత్రమూ సరిపడదని నిక్కచ్చిగా చెప్పేశాడు డాక్టరు. ఉన్న ఒక్క ఆశాపోయింది.

బలవంతంగా రిటైర్‌చేసినందుకు మిల్లు వాళ్ళు కట్టిచ్చిన నష్టపరిహారం, ప్రావిడెంట్ ఫండూ, అన్నీ కలిసి పదమూడు వేలవరకూ చేతికొచ్చాయి. సంసారం గడవటమే కష్టంగా వుంటే విజయ పెళ్ళి ఎలాచేయాలన్నది అంతవరకూ తోచలేదు వెంకటేశంకు. ఈ డబ్బుతో ఎలాగోలా కూతురు పెళ్ళిచేస్తే, తరువాతి విషయం ఆలోచించవచ్చుననుకున్నాడు.

"వద్దు నాన్నా... మీరు ఏం చెప్పినా, ఎలా చెప్పినా ఇలాంటి పరిస్థితిలో మిమ్మల్ని వదిలేసి నేను పెళ్ళిచేసుకోను" ఖచ్చితంగాచెప్పింది విజయ.

"ఇప్పుడు కాకపోతే ఈ కాస్త డబ్బూ ఐపోతే ఇక నేను ఏమీ చేయలేనమ్మా" బాధగా అన్నాడు.

"నువ్వు చేసి చేసీ అలసిపోయావు నాన్నా! ఇక ఏమీ చేయవద్దు కూడా"

"అలా అంటే ఎలానే" జగదాంబ కల్పించుకున్నది.

కాస్సేపాగింది విజయ- ఏదో లెక్కపెట్టింది వేళ్ళమీద.

"ఈ డబ్బు ఇలాగే ఓ నెలరోజులు బ్యాంకులో వేసెయ్యండి నాన్నా! వచ్చే నెల పదిహేనో తారీఖున చెబుతాను నేను, ఏంచేయాలో"

కూతురు ఏం చెబుతుందో ఇద్దరికీ అర్థంకా లేదు. కానీ విజయ మీదవున్న అభిప్రాయం కొద్దీనూ, తాము ఏంచెప్పినా వినిపించుకోదనీ నూ ఇక ఊరుకున్నారు.

★ ★ ★

"ఏమండీ... ఈ అరుణ మీకు నిజంగా ఇంతకుముందు తెలుసా?" ఒక నిర్మాత ప్రశ్నించాడు గౌరీశంను.

"ఎందుకలా అడిగారు" అన్నాడు గౌరీశం.

"ఏంలేదు... నిన్నో బూతుపత్రికవాడు నాదగ్గరకొచ్చాడు. మీకు అరుణ ఇంతకుముందే తెలుసుననీ, అప్పట్నించే మీ ఇద్దరికీ సంబంధంవుందనీ, మొన్న మీరు కొన్న ఇల్లు ఆమె కోసమేననీ, ఏవేవో రాస్తానని చెప్పి, నా దగ్గర వెయ్యిరూపాయలు తీసుకున్నాడు. సరే... డబ్బులు మీరిస్తే ఒకటీ నేనిస్తే ఒకటీ కాదనుకోండి. ఇదే మరో నిర్మాతెవరైనా అయితే పట్టించుకోకపోతే, రేపు మీ ఇద్దరి పేర్లూ ఆంధ్ర దేశమంతా మోగిపోయేవి"

నారాయణ ట్రాన్స్ఫర్‌తో, విజయవాళ్ళు ఇల్లు ఖాళీ చేయగానే, ఆ గది ఖాళీచేయటానికి మనసొప్పక గౌరీశం ఆ ఇల్లు కొనేసాడు- అదీ సంగతి.

"మీరేమనుకుంటున్నారు" నవ్వు తెచ్చిపెట్టుకుని అడిగాడు గౌరీశం.

"మీరెప్పుడు ఆ అమ్మాయితో మాట్లాడినా సెట్లోనే మాట్లాడారు. మీకు అలాటి అలవాట్లు లేవు. అసలా అమ్మాయి కూడా ఈ సినిమా రంగంలో ఇమిడిపోలేదు. ఇహ ఛాన్సులు దొరకటం కష్టంకూడా. ఏదో మీమీది గౌరవంకొద్దీ కొందరు, అలాంటి ఆలోచనలేని నాలాంటివారెవరో ఇచ్చే వేషాలతో ఎంతకాలముంటుంది గనుక. కానీ ఇవన్నీ ఎవరు పట్టించుకుంటారు... ఇంతకీ నిజమేమిటో మీరే చెప్పాలి"

"వాళ్ల పక్కగదిలో నేను అద్దెకుండేవాణ్ని. అంతవరకూ నిజం"

"అదిచాలునండీ- ఈ పత్రికలవాళ్ళు ఎప్పుడేం చేస్తారో తెలియదు. మీరిలా ఆ పిల్లను రికమెండ్ చేయటం మానుకోండి"

"మంచిది... ఆలోచిస్తాను" అన్నాడు గౌరీశం.

ఆరోజు సాయంత్రం అరుణ గదికి వెళ్ళాడు గౌరీశం.

"అరుణా నీకు సినిమా హీరోయిన్ కావాలని ఆశ వుందా లేక ఎవరైనా చేసుకుంటానంటే పెళ్ళిచేసుకుంటావా?"

"ఎందుకడుగుతున్నావ్, ఇప్పటివరకూ వేషాలకోసం నేను కాని పనేదీ చేయలేదు. నువ్వు నమ్మినా, నమ్మకపోయినా సరే"

తమిద్దరి గురించీ వచ్చిన పుకారు గురించి చెప్పాడు గౌరీశం తప్పనిసరిగా.

"అదా సంగతి- నన్నిక రికమెండ్ చేయలేనని చెప్పటానికి వచ్చావన్నమాట" నవ్వింది అరుణ.

అరుణ అలా అర్థంచేసుకుంటుందనుకోని గౌరీశం నివ్వెరపోయాడు. తర్వాత అన్నాడు-

"మరి ఎలా నీవిషయం?"

"సాగినంతకాలం ఇలాగే- ఆ తరువాత సంగతి చూద్దాం"

"నేను రికమెండ్ చేయకపోతే నీకూ, నాకూ చెడిందని రాస్తారు"

"రాసుకోనీ... నిజమైతే భయపడాలి కానీ...."

"ఇలా అనుకుంటున్నానని ఏమీ అనుకోకు. మీఇద్దరికీ నిజంగా సంబంధం లేదని గుండెలమీద చెయ్యేసుకు చెప్పమని ఎవరైనా అడిగితే ఏమని చెప్పగలం- నీ అబార్షన్‌కు కారణం నేనేనని నిజం చెప్పగలమా?"

"ఐతే ఏం చెయ్యమంటావు?"

"పెళ్ళిసంగతి చెప్పలేదు నువ్వు"

"ఓసారి సినిమాల్లో చేరాక, ఇంకా మంచివాడెవడు పెళ్ళిచేసుకుంటాడు నన్ను" నీరసంగా నవ్వింది అరుణ.

"నేను మంచివాణ్నేనా?"

హఠాత్తుగా వచ్చిన ప్రశ్నకు నివ్వెరపోయింది అరుణ. కాస్సేపటి తరువాత అంది-

"అలాంటి ప్రయత్నం చెయ్యొద్దు గౌరీశం! నాకు ఆశాలేదు, అభిప్రాయమూలేదు. పైగా, నా చేతులారా విజయకు అన్యాయం చెయ్యలేను"

చలపతి ద్వారా తను చేసిన ప్రయత్నం వివరించాడు గౌరీశం.

"ఇక విజయ నన్ను మరిచిపోయినట్టే. తెలిసోతెలియకో నేను నీకు చేసిన అన్యాయాన్ని ఇలాగైనా సరిదిద్దుకోనియ్! ఈ రంగంలో నువ్విలాగే పైకిరావటం చాలాకష్టం... అసంభవమనుకో. నువ్వూ, నేనూ ఇద్దరమూ డబ్బు కోసం ఒక మార్గంలో అడుగుపెట్టాము. లోకం హర్షించేదే అయినా, నేను ఆత్మవంచన చేసుకుంటున్నాను. నువ్వు అది చేసుకోలేకపోతే నీకు నువ్వే అన్యాయం చేసుకున్నట్టవుతుంది. కనీసం నిన్నైనా దారి మళ్ళిస్తే, విజయ దృష్టిలో నేను కొంతైనా ధైర్యంకలవాడిగా నిలుస్తాను. పోతే, నీకిష్టమై నువ్వొప్పుకుంటే మరోసారి విజయ ప్రస్తావన కూడా మన మధ్యరాదు"

"గౌరీశం... ఎంత ఆలోచించినా సరిపెట్టుకోలేకపోతున్నాను. నా చెల్లెలికి చెందవలసినవాణ్ణి నేను చేసుకోవటం, ఎందుకో బాగా అనిపించటంలేదు. నీకూ మంచి అమ్మాయి దొరకకపోదు. నువ్వు చెప్పు- నీఇష్టం"

"ఇంకేమీ ఆలోచించొద్దు అరుణా! నీగురించి చెడు ప్రచారం జరిగితే విజయైనా, మీ అమ్మా, నాన్నలైనా ఇంతకన్నా ఎక్కువ బాధపడతారు. పైగా రచయిత రికమండేషన్‌తో అవసరం లేకుండానే వేషాలొస్తాయి" నవ్వాడు గౌరీశం.

"వద్దుగౌరీశం... నీసంపాదన చాలు. నేనిక నటించను. నువ్వొప్పుకుంటే, ప్లేబాక్ అవకాశాలొస్తే, పాటలుమట్టుకు పాడతాను. తప్పు చేసే ధైర్యంలేదు. ఇక్కడ నెగ్గుకు రాలేనని తెలిసింది. ఆశకొద్దీ సినిమాల్లో చేరాలనుకున్నానే గానీ ఇక వద్దు"

"మంచిది, మనపెళ్ళి గురించి పత్రికలవాళ్ళకు చెబుతాను"

"కానీ ఒక్క విషయం. నన్ను ఎప్పుడూ అక్కడికి రమ్మని అడగొద్దు. ఈ జన్మలో మళ్ళీ ఇక ఒకేచోట-విజయా, అమ్మా, నాన్నలున్నచోట నేను వుండలేను. ఈ ఒక్కటీ మాత్రం కాదనకు"

మూడోరోజున అన్ని దినపత్రికల్లో రచయిత గౌరీశ్, నటి అరుణ పెళ్ళి చేసుకోబోతున్నారనీ, మరుసటివారం పెళ్ళిచేసుకున్నారనీ వార్తలొచ్చాయి. అరుణ ఇక నటించదని, మరుసటి నెల సినిమా పత్రికల్లో పెళ్ళిఫొటోలతో పాటు వార్తలొచ్చాయి.

★ ★ ★

విజయ చెప్పిన పదిహేనో తేదీ వచ్చింది. మనోహర్‌హౌస్ సర్జన్ అయినప్పటినుంచీ డ్రాయింగ్స్ దాదాపు లేవు. విజయ ఇంటి పరిస్థితి చూసి, కాలేజ్‌లోని ఒక ప్యూన్‌తో మాట్లాడి, అతను సేకరించి తెచ్చియిచ్చేటట్టు ఏర్పాటు చేశాడు మనోహర్. దాంతో మళ్ళీ కొంచెం ఆదాయం వస్తూన్నది. ఆరోజు గీయాల్సిన ఫిగర్స్ కూడా పక్కన పెట్టేసి పన్నెండు గంటలకు బజారుకు వెళ్ళింది విజయ.

గంట తరువాత మనోహర్‌ను వెంటబెట్టుకుని వచ్చింది. తాకట్టు పెట్టిన టేప్‌రికార్డర్, వాచీకూడా తీసుకొచ్చిన కూతుర్ని చూసి ఆశ్చర్యపోయారు వెంకటేశం, జగదాంబా. వందరూపాయలు, దాదాపు సగంకట్ట తండ్రి చేతిలో పెట్టింది. ఇద్దరికీ నోటమాట రాలేదు.

"ఎక్కడిదే ఇంత డబ్బూ" అడిగేసింది జగదాంబ, ఇక ఆగలేక.

"మనోహర్ రికార్డ్స్ గీయటం మొదలెట్టినప్పట్నించీ దాదాపు ఇంటి ఖర్చంతా నేనే చూస్తున్నాను కదా నాన్నా. ఈమధ్య కుట్టుమిషన్ మీద కూడా డబ్బులొస్తున్నాయి. సరే... మీరెప్పుడూ నన్ను లెక్కలడగలేదు. అప్పుడే చలపతి మావయ్య ఓసారి చిట్‌ఫండ్స్ గురించి చెప్పటం మీకు గుర్తుందో లేదో. నెలకు నూటాఇరవై రూపాయల చొప్పున కట్టేసాను నాన్నా! మొదట్లో కమీషన్ల మూలంగా అంత అవసరం అయ్యేది కాదు. ఒక్కోనెల ఇబ్బంది ఐనా మనోహర్ సహాయంచేశాడు. అప్పుయిస్తూ ఏఇబ్బంది వచ్చినా, మళ్ళీ నెలనెలా తీర్చటం మనవల్ల కాదని నాకు తెలుసు. పైగా శ్రీనుఇంటర్ తరువాత కొద్దో గొప్పో అవసరం వుంటుందనీ అనిపించింది. అందుకే మధ్యలో తీసుకోకుండా మంచో చెడో ధైర్యంచేసి కడుతూ వచ్చాను నాన్నా! పోయిన నెలతో ఐపోయింది. మొత్తం ఏడు వేలు వచ్చింది"

"నేనెన్నిసార్లో అనుకున్నా, విజయ వారించటంతో చెప్పలేదు పిన్నీ" అన్నాడు మనోహర్.

వెంకటేశంకు చాలాసేపు నోటమాట రాలే దు- విజయకున్న ముందు చూపుకు.

ఆ సాయంత్రం అందరూ కలిసి సరదాగా సినిమాకు వెళ్ళారు. విజయ ఎంత గింజుకున్నా మనోహర్ ఆమెను ఒక్కపైసా కూడా ఖర్చుపెట్టనీయలేదు. చాలారోజుల, చాలా నెలల, చాలా సంవత్సరాల తర్వాత ఎంతో సంతోషంగా వున్నట్టనిపించింది అందరికీ.

మరునాడు శ్రీనివాస్‌ని కాలేజ్ మానుకో మ్మంది.

తండ్రిని కూచోబెట్టి, తీరిగ్గా అన్ని విషయాలూ చర్చించింది-

"ఈ డబ్బుతో అప్పులన్నీ తీర్చేద్దాం ముందుగా - మనకు సగం మనశ్శాంతి అదే నాన్నా"

"నీపెళ్ళి విషయం విజయా?" - అరుణ, గౌరీశం పెళ్ళిచేసుకున్న విషయం కూడా గుర్తొచ్చింది వెంకటేశంకు.

"ఇప్పుడేం తొందర నాన్నా? మరో నాలుగైదేళ్ళు ఆగినా నాకేం వయసు మీరిపోదు కదా"

"అప్పుడు మాత్రం ఎలా?"

"అదే చెబుతున్నా నాన్నా... ప్రైవేట్‌గా బియ్యే పూర్తిచేస్తాను. బి.యిడి కూడా ప్రైవేట్‌గా చేయొచ్చు. కావాలనుకుంటే తరువాత ఎమ్మే కూడా చేస్తాను. లేదా ఏటీచర్ వుద్యోగమో చేస్తూ చదువుకోవచ్చు. మన అప్పులన్నీ తీర్చేస్తే, నీ ప్రావిడెంట్‌సొమ్మూ, ఈ చిట్‌ఫండ్ డబ్బూ కలిసి ఓ పదివేలైనా చేతిలో వుంటాయి. ఈ కుట్టుమిషన్‌కో ఎలక్ట్రిక్ మోటార్ కొందాం. కుట్లూ, అల్లికలూ చేసే ప్లేట్లు కూడా కొనుక్కుంటేసరి. పెద్ద హడావిడి అక్కరలేదు. మనకు తెలిసిన వాళ్ళకు బట్టలు కుట్టిపెట్టి, అల్లికలు చేసుకున్నా మనకు హాయిగా గడిచిపోతుంది. శ్రీనుని మెడిసిన్ చదివిద్దాం..."

"అంత చదువంటే మనం తూగలమా... ఆలోచించు"

"అదే వద్దు నాన్నా... కష్టమో నిష్టూరమో ఇన్నాళ్ళూ మనం అనుభవించాం. వాడికి కూడా గుమాస్తా జీవితం వద్దు నాన్నా... మరరెండు మూడేళ్ళు కష్టపడ్డామంటే చాలు, నాకు మంచి ఉద్యోగం వచ్చిందా, ఇబ్బందేలేదు. వాడి చదువుపూర్తయిపోతే చాలు. టెన్త్‌లో ఫస్ట్ క్లాస్ దాటి మంచి మార్కులొచ్చాయి వాడికి. వాడి తెలివితో వాడు సీటు సంపాదించుకోగలడు"

మళ్ళీ నవ్వుతూ అంది-

"ఇక నాపెళ్ళి విషయంలో తొందరేం లేదు. వీడి మెడిసన్ పూర్తయేసరికి నాకు ఇరవై ఆరు, ఇరవైఏడేళ్ళు వస్తాయేమో! అప్పటికి ముసలిదాన్ని కానుగదా. అన్నీ అర్థంచేసుకుని, మనతో పాటు వుండగలిగే అతను దొరికితేనే చేసుకుంటాను అప్పుడైనా"

తలిదండ్రులు ఏం చెప్పినా వినిపించుకోలేదు విజయ.

"ఈ ఇంటర్‌లో కూడా కష్టపడి క్లాసు సంపాదించుకోరా! మంచి మార్కులు వస్తేగానీ సీటు దొరకటం కష్టం మెడిసిన్‌లో"

శ్రీనివాస్ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా కూర్చున్నాడు. మనసులో ఎందుకో బ్లాంకెటూ, స్వెట్టరూ మెదిలాయి. కానీ చిన్నప్పటిలాగాకాక అడిగే స్థాయిని మించి ఎదిగాడు కనుక మౌనంగా ఉండిపోయాడు.

సాయంత్రం వేళకు ఇవ్వాల్సినవాళ్ళందరికీ డబ్బులిచ్చేసి వచ్చాడు, శ్రీనివాస్‌ని వెంటబెట్టుకుని వెళ్ళిన వెంకటేశం.

"నేను ఆటోలో రమ్మంటే బస్సులో వచ్చినట్టున్నారు ఏమిటి నాన్నా?"

"అప్పులన్నీ ఇలా ఒకే రోజున తీర్చేస్తానని నేను కలలో కూడా అనుకోలేదు. అలాంటిది ఇలా నిజంగానే తీర్చేసి, బస్సులో వస్తుంటేనే విమానంలో వచ్చినట్టు. అనిపించింది- ఇక ఆటో ఎక్కితేనా?"

"నువ్వెప్పుడూ ఇంతే" అంది కాఫీ కలుపుతూ.

ముఖం కడుక్కుని. వచ్చిన తండ్రికి కాఫీ అందించింది.

"ఏడాదిన్నరయింది మనం బట్టలు తీసుకోక. ఎలానూ తప్పదు డబ్బులున్నప్పుడే తీసుకుందాం. ఏమంటావ్ నాన్నా?"

"నేనేమంటాను... నువ్వు వింటావు గను




కనా''

అంతలో మనోహర్ కూడా వచ్చాడు. మనోహర్‌కు కూడా కాఫీ కలిపి ఇచ్చింది. మనోహర్ స్కూటర్‌మీద శ్రీనూ, మిగతావాళ్ళు ఆటోలోనూ బయలుదేరారు.

షాపులో ముందుగా శ్రీనుకిష్టమైనవి తీసింది విజయ. ఇక తల్లికీ, తనకూ, తండ్రికీ చూడటంలో మునిగిపోతూ, శ్రీనుని పక్కకు పిలిచింది. పర్సులోంచి మూడు వందరూపాయలనోట్లు తీసింది.

''పక్కషాపులో ఒక మంచి స్వెట్టరు, బ్లాంకెట్ తీసుకో'' అంది.

''వద్దక్కా... నాకేమీ వద్దు'' అన్నాడు శ్రీనివాస్ డబ్బులు తీసుకోకుండా.

''నీమొహం'' అంటూ, అవి మనోహర్‌ని పిలిచి ఇచ్చింది-

''మంచివి చూసి కొనియ్యి. డబ్బు తక్కువైతే నువ్వు ఇయ్యి. తరువాత నా దగ్గర తీసుకుందువుగానీ. ఎందుకైనా మంచిది- వాడు బాగా పొడుగు పెరుగుతున్నాడు, వాడికంటే ఓ మీటరు పొడవుండేట్టు చూసికొను బ్లాంకెటు'' అంది నవ్వుతూ.

మళ్ళీ పర్సుతీసి ఇంటి తాళం, ఒక రసీదూ ఇచ్చి చెప్పింది-

''అన్నట్టు పొద్దున్న చలపతి మావయ్యతో చెప్పి పంపించాను. ఈ షాప్‌కు వెళ్ళి ఎలక్ట్రిక్ మోటారూ, ప్లేటూ ఇస్తారు. మిషన్‌ని తీసుకురండి. డబ్బులిచ్చేశాం. అతనొచ్చి ఫిక్స్‌చేస్తాడు. ఈలోగా మేం వస్తాం''

ఇంటికి చేరేసరికి ఎనిమిదిన్నరయింది. అప్పటికే వచ్చిన మనోహర్, శ్రీనూ మిషన్‌మీద ఏవో ప్రయోగాలు చేస్తున్నారు.

మనోహర్ కొత్తగా కొనుక్కొచ్చిన కర్చీఫ్ మీద అందమైన పువ్వు కుట్టి ఇచ్చింది విజయ-

''బోణీనీదే... ఏమైనా అయిందో నీపని చెబుతాను'' అంది నవ్వుతూ.

తెచ్చినవన్నీ చూస్తూ కూర్చున్నారు. కాస్సేపటికి-

''అయ్యో... మరిచేపోయాను. నీ బ్లాంకెటూ, స్వెట్టరూ ఏవిరా శ్రీనూ, నాకు చూపించనేలేదు?'' అడిగింది విజయ.

శ్రీనివాస్, మనోహర్- ఒకరి మొహం ఒకరు చూసుకుంటూ కూర్చున్నారు.

''ఏమయింది... డబ్బులు పోగొట్టారా?''

''ఊహుఁ... కొన్లేదు'' అన్నాడు మనోహర్.

''అదేంటి... మంచివిలేవా?''

''కాదు... శ్రీనే వద్దన్నాడు''

''అదేంటిరా శ్రీనూ... ఎందుకని?''

శ్రీను ఓ ప్యాకెట్ తీసుకొచ్చాడు. ఒకటి డిసెక్షన్ బాక్స్, ప్యాకెట్లో పుస్తకాలున్నాయి ఇంటర్‌వి.

''కోప్పడొద్దక్కా'' అన్నాడు శ్రీను- ''లైబ్రరీ నుండి పుస్తకాలు తెచ్చుకుంటూ అన్ని పుస్తకాలూ లేని సంగతి నీకు చెప్పలేదు. లైబ్రరీ పుస్తకాలతో చదువుకోవటం కష్టమైపోతూంది. మా క్లాసులో నాకొక్కడికే డిసెక్షన్ బాక్స్‌లేనిది. ఇన్నాళ్లూ తోటివాళ్ళవి వాడుతున్నాను గానీ వాళ్ళకూ ఇబ్బందిగా వుంటూంది. అందుకే కొన్నాను'' ఆగాడు శ్రీనివాస్.

మళ్ళీ అన్నాడు-

''నువ్విచ్చిన మూడొందలూ వున్నడబ్బులో నాకు కేటాయించినవనుకున్నాను. ఇన్నాళ్ళూ నా దుప్పటితో తలో, కాళ్ళో ఏదో ఒకటే కప్పుకోగలిగాను. ముడుచుకు పడుకోవటం అలవాటయిపోయింది. ఇప్పుడు నువ్విచ్చిన డబ్బుతో బ్లాంకెటూ, స్వెట్టరూ కొన్నాననుకో, మళ్ళీ పుస్తకాలకు ఇబ్బంది. డబ్బులన్నీ నువ్వేదో లెక్కవేసి పెడతావు. పుస్తకాలకు ఇవ్వాలంటే ఇంట్లో ఇబ్బంది- అందుకే బ్లాంకెట్ కొన్లేదు''

అందరూ తెల్లబోయారు.

★ ★ ★

మధ్యతరగతి మనిషి అవసరాలకూ, ఆదాయానికీ లంకె కుదరదు. అతని ఆర్థికజీవితం చాలీచాలని దుప్పటిలాంటిదే. కాళ్ళు దాచుకుంటే తలదాగదు, తలదాచుకుంటే కాళ్ళు దాగవు. ముడుచుకుని సర్దుకోవలసిందే. ఈ దేశంలోని, ఇలాంటి మరెన్నో అభివృద్ధిచెందుతున్న దేశాల్లోని దాచేస్తే దాగని సత్యం ఇది.

ఇక్కడితో ఇది అయిపోలేదు.

ఇది కథకాదు... ఇది జీవితం. ★

# విజ్ఞాన ప్రపంచం

## చంద్రమండలంలో సాగు!

అమెరికాలోని అటాహ్ స్టేట్ యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ ఫ్రాంక్ బి. శాలిస్‌బరీ చంద్రమండలంలో గోధుమలు, పప్పుధాన్యాలు, కూరగాయలు పండించవచ్చంటున్నారు. మరో ముగ్గురు శాస్త్రవేత్తలు 1982 లోనే నాసాకు సమర్పించిన నివేదికలో అరవైరకాల పంటల్ని పేర్కొని 2019 నాటికల్లా వీటిని చంద్రమండలంలో పండించవచ్చునని రాశారు. ఆ జాబితాలో గోధుమలు, బార్లీ, మొక్కజొన్న కాయధాన్యాలు, కొన్నిరకాల పళ్ళు, కూరగాయలు, బంగాళదుంపలు వంటివి కూడా చోటుచేసుకున్నాయి.

ఒక సోవియట్ శాస్త్రవేత్త కృత్రిమ ఉపగ్రహంలో అయిదు నెలలపాటు ఇద్దరికి సరిపడే ఆహారధాన్యాల్ని పండించాడు. ఇందుకుగాను 60 చదరపుమీటర్ల వైశాల్యంగల స్థలంలో, జీనాన్‌లాంపు సాయంతో, కృత్రిమంగా కల్పించిన కాంతిలో గాలికి బదులుగా క్లోరెలియాను ఉపయోగించి దిగుబడిని సాధించాడు.

1981 లో 'నాసా' ప్రొఫెసర్ శాలిస్బరీ కృత్రిమ కాంతిని కల్పించటానికి సోడియం ల్యాంపుల్ని వాడి కృత్రిమ చంద్రమండల వాతావరణాన్ని కల్పించి చదరపు మీటరుకు 60 గ్రాముల గోధుమ పండించాడు. అలా 12 చదరపు మీటర్ల భూమిని సాగుచేస్తే ఒక మనిషికి సరిపడే ఆహారం పండుతుంది. ఇలాంటి వాతావరణంలో పండే గోధుమ సాధారణ గోధుమకంటే శీఘ్రంగా కాపుకొస్తుంది. గోధుమ పంట మామూలుగా అయితే కోతకి రావటానికి 120 రోజులు పడుతుంది. కానీ ఈ ప్రత్యేక రకం గోధుమ కోతకి రావటానికి కేవలం 79 రోజులకాలం చాలు - దీనికిగాను ఉష్ణోగ్రత పగలు 20°c, రాత్రుళ్ళు 15°cలో నిలబెట్టవలసి ఉంది.



# ఆనాటి మద్రాసు కోట!

'మాటలు చూస్తే కోటలు దాటుతాయి', 'కోటలో పాగా వేయటం' లాంటి వాక్యాలు మనకి సుపరిచితం. కోట అనగానే నగరం చుట్టూ రాజులు నిర్మించే కోటగోడ తలపులో తళుక్కుమంటుంది. కానీ మద్రాసు కోట అలాంటిదికాదు. చరిత్రాత్మకమైన ఈ సెయింట్ జార్జ్‌ఫోర్ట్ లోనే ఇప్పటికీ అసెంబ్లీ సమావేశాలు జరుగుతుండటం విశేషం.

1639 లో ఈస్టిండియా కంపెనీ ప్రతినిధి ఫ్రాన్స్‌డే, మద్రాసు సముద్రతీరానికి రెండుమైళ్ళ దూరంలోగల 10 చ.కి.మీ. స్థలంలో ఈస్టిండియా కంపెనీ అధినేత ఆండ్రూతో కలిసి ఈస్టిండియా కంపెనీ కోసం ఒక చిన్న ఫాక్టరీ నిర్మించాడు. దీనిని సెయింట్ జార్జ్ పుట్టినరోజున అంటే ఏప్రిల్ 23న ప్రారంభించారు కాబట్టి సెయింట్ జార్జ్ ఫోర్ట్‌గా పిలవటం ప్రారంభించారు.

ఆ పరిసరాల్లోనే 1640 నుండి 1749 వరకు ఎన్నో భవనాలు వెలిశాయి. 1783 లో పాట్రిక్ ఆ భవంతిని ఆధునీకరించాడు. ఆ రోజుల్లోనే ఈ భవన నిర్మాణానికి 75 లక్షల రూపాయలు ఖర్చయ్యాయట. ప్రస్తుతం అసెంబ్లీ సమావేశాలు జరిగే రెండవ అంతస్తుని 20 వ శతాబ్దంలో నిర్మించారు. 1732 లో ఈ భవనంలో మలిచిన స్థంభాలని 1746 లో ఫ్రెంచ్‌వారు ఆక్రమించుకున్నపుడు పాండిచ్చేరికి తరలించారు. అయితే 1762 లో వీటిని మళ్ళీ మద్రాసుకు తెచ్చారు.

ఈ సెయింట్ జార్జ్ ఫోర్ట్‌లో హోలీమేరీ చర్చి, మ్యూజియంలు అతిపురాతనమైనవి. హోలీమేరి చర్చిని 1678 లో నిర్మించారు. ఈ చర్చి ఆవరణలోవున్న స్మశానవాటిక కూడా చాలా పురాతనమైనదే! ఆ మద్రాసు మేయరుగావున్న బ్రిటిషర్ ఆరోన్‌బెకర్ భార్య ఎలిజ



బెత్ బెకర్ ఓడలో పయనిస్తూ మరణించగా ఆమె శవపేటికను తెచ్చి ఈ శ్మశానంలో ఖననం చేశారు.

ఈ ఫోర్టులో ఇతర చరిత్రాత్మక దర్శనీయ స్థలాలు క్లైవ్‌హౌజ్, వెల్లెస్లీ హౌజ్. ఈ కోటలో ఉంటూనే వెల్లెస్లీ టిప్పుసుల్తానును ఓడించాలని నిర్ణయించాడు. మ్యూజియంతో లార్డ్ కారెన్‌వాలెస్ 14.5 అడుగుల ఎత్తున్న విగ్రహం చెప్పుకోతగింది.

# డ్రైవరే డాక్టరైతే...!

రైల్వే డ్రైవర్ అశోక్‌కుమార్ అరోరా బొంబాయి లోకల్ రైళ్ళల్లో రోజూ లక్షలాది ప్రయాణీకుల్ని గమ్యంచేరుస్తుంటాడు. అతను ఆలిండియా రైల్వేమెన్ ఫెడరేషన్‌లో ఆఫీస్ బేరర్ కూడా. అయినా చదువుపట్లా, పరిశోధన పట్లాగల విపరీతమైన ఆసక్తి ఫలితంగా డాక్టరేట్‌తోపాటు జర్నలిజం, టూరిజం, హోటల్ మేనేజిమెంట్లో డిప్లొమాలు కూడా సాధించాడు.

1967లో అప్రెంటిస్ డ్రైవర్‌గా ఉద్యోగంలోచేరి 1967–71 మధ్య బియ్యే డిగ్రీ పూనా యూనివర్సిటీ నుండి 'చరిత్ర' ప్రధానంగా ఎ.ఎ పూర్తి చేశాడు. గ్రాడ్యుయేషన్‌చేసేరోజుల్నే అరోరాకి మరాఠాల చరిత్రపైన ఆసక్తి పెరిగి అదే విషయంపై పి.హెచ్‌డి పట్టా పుచ్చుకోవాలనుకున్నాడు. "రాజపుత్రుల - మరాఠాల సంబంధాలు-1707 నుండి 170() వరకు" పరిశోధించాడు. ఇందుకుగాను బికనీర్‌కి వెళ్ళి మూడువేల చారిత్రాత్మిక పత్రాలు పరిశీలించాడు. అతని పరిశోధనా వ్యాసం పదుగురి ప్రశంసల్ని పొందింది; డాక్టరేట్ సంపాదించిపెట్టింది.

అరోరాకి పుస్తకాలంటే తగనిపిచ్చి. అతను నివసించే రైల్వేక్వార్టర్‌లోని మూడుగదుల్లోనూ నిండా పుస్తకాలే. కాని వాటిలో కథలు, నవలలు మాత్రం కనిపించవు. అతని లైబ్రరీలో అన్నీ హిస్టరీ, సైన్స్, లా, మెడిసిన్ సబ్జెక్టులకు సంబంధించిన పుస్తకాలే. ప్రస్తుతం రైల్వేల చరిత్రకు సంబంధించిన పుస్తకాలన్నీ తెప్పించి పరిశీలిస్తున్నాడు. చాలా అపురూప గ్రంథాల్ని అరోరా సంపాదించి భద్రపరిచాడు. అరోరా మంచి ఫొటోగ్రాఫర్ కూడా!

అరోరా ప్రస్తుతం 'లా' చదువుతున్నాడు. డి.లిట్ డిగ్రీ సాధించాలని అతని ఆశయం. 'ఇండియన్ రైల్వే'లను ప్రధానాంశంగా తీసుకుని చారిత్రాత్మకమైన పుస్తకం ఒకటి రాయాలని అతని సంకల్పం! ★

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. **"సమీక్ష"** అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **'చతుర' సమీక్షకు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

### సెప్టెంబర్ 'చతుర' నవల దుప్పటి

సమీక్షకుని పేరు: ..........................................

చిరునామా: ..........................................

..........................................

..........................................

..........................................




**అతని మాటలు ఆమెకు తేనెజల్లుల్లా అనిపించాయి.** చెవులు ఇంకా ఇంకా అతని మాటలకోసం రిక్కించి నిల్చున్నాయి. ఆ మాటలు మాట్లాడిన వ్యక్తిని చూడటమే తమకు సార్థకత అన్నట్లు చూశాయి కళ్ళు. అతని మాటలువినికూడా ముడుచుకుని వుండటం అపరాధమన్నట్లు విచ్చుకున్నాయి పెదవులు. తళుక్కున మెరిసి సంభ్రమాన్ని ప్రకటించింది పలువరున. ఆనందాశ్చర్యాలతో నిలబడిన ఆమెవంక వింతగా చూశాడు అతను. తన మాటలకామె ఎందుకంతగా స్పందించిందో అతనికేమీ అర్థంకాలేదు. ఆమెకు మాత్రం ఓ పండుగలా ఉందా సందర్భం.

స్తంభించిన ఆమె హృదయసాగరంలో అమృతమథనంచేసి, కదలికతెచ్చి అలలను విజృంభింపజేసిన అతని మాటల్లోని మిస్టరీ ఏమిటి?

సరికొత్త వాతావరణంలో మరీ కొత్తరకం మనుషులను పరిచయంచేసే

ఓల్గా నవల 'అలలు'

అక్టోబరు **చతుర** అందిస్తోందిమీకు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed a.
Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD 1402